శ్రీరస్తు

# శ్రీకృష్ణ భాగవతము:

హరికథ.

Checked
1937

గ్రంథకర్త:

కొప్పరపు గోపాలకృష్ణమూర్తిగారు

STATE CENTRAL LIBRARY HYDERABAD

4288

1943.

కొండపల్లి వీరవెంకయ్య
కొండపల్లి లక్ష్మణరావు &
సంస్కృతాంధ్ర బుక్ డిపో,
స్థాపితం: 1882. రాజమండ్రి

శనివారపు కోటిరెడ్డి అండ్ యస్. మాలాగార్ల
శ్రీ కోటీశ్వర ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది
నరసరావుపేట.

Copyright Reserved.

శ్రీలక్ష్మీప్రెస్, నరసరావుపేట.

మొదటి కూర్పు ౧౫౦ ప్రతులు.

స్వభాను వైశాఖం.

లిఖితరూపముగు నాయనుమతి లేనిది యెవరును యీగ్రంథమును ముద్రింప, ప్రచురణాదులు చేయకూడదు. అట్లుగాక స్వతంత్రించిన వారలు నాయొనర్చు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులు.

గ్రంథకర్త.

# పీఠిక.

—:o:—

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసంఫణిః" అను నార్యోక్తి ప్రకారము సంగీతము సమస్తజీవుల సమాదరణంబు బడసినదని చెప్ప పనిలేదు. ఆసంగీతంబునకు సాహిత్య సమ్మేళనంబుగావించినచో పూవ్వుకు తావియబ్బినట్లగును. అట్లు గల్పింపబడినవే యక్షగానములు, హరికథలు యక్షగానములకన్న హరికథ లగ్రస్థాన మలంకరించి సర్వ జననుతి పాత్రమై ప్రకృత మలరారుచున్నవి. అందు రామాయణ, భారతగాథలు వేరువేరుగాను, సంపూర్ణముగాను, పండిత కవులచే రచియింపబడి, శ్రోతలకు వక్తలకు ముక్తి భుక్తులొసంగుచున్నవి. గాని పురాణశ్రేష్ట మనదగు శ్రీమహాభాగవత మట్లు పూర్తిగా లేనికారణమున కొందరు హరిదాసులకోరికపై నేనిది వ్రాయుట తటస్థించినది. నేనందులకు సమర్థుడను గాకున్నను పెద్దల యాశీర్వచనబలం బిందుల కొడంబడ జేసినది. మొత్తముమీద భాగవతమంతయు వివరించితిని గాని "పురంజనోపాఖ్యానము" వరకు ద్వ్యర్థియగుట వదలితిని. అందులకు సహృదయులు క్షమింతురుగాక. యీ పవిత్రగ్రంథమును మదీయ పరమేష్ఠి గురువర్యులును «శుద్ధనిర్గుణ తత్వకందార్థములు» వ్రాసి లోక విఖ్యాతిగనిన శివరామ దీక్షిత అచల గురుపరంపరా పీఠాధి పతులును, అగు,

## శ్రీమద్భాగవత శ్రీకృష్ణ ప్రభువులవారికి

కృతినొసంగితిని. యీగ్రంథ ముద్రణకు ద్రవ్యసహాయ మొనర్చినవారికి ఆ పరమేశ్వరుడు చిరాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి నొసంగుగాత యని కోరుచున్నాడను. దీన శ్రీబమ్మెన పోతనామాత్యుని భాగవతమందలి పద్యములకు * గుర్తు నుంచితిని.

ఉయ్యందపతాళ్ళూరు
9-5-1943.

ఇట్లు,
కొప్పరపు గోపాలకృష్ణమూర్తి.

## ప్రార్థన.

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ । తస్మై శ్రీగురవేనమః॥

శ్లో॥ శ్రీమత్కాశ్యప గోత్రాబ్ధే । లక్ష్మీనారాయణాహ్వయః
వేంకమాంబిక సత్పుత్రం । వందేహం వేంకటప్రభుం॥

శ్లో॥ శ్రీవత్సగోత్రకులశాంబుధి పూర్ణచంద్రం
శ్రీకృష్ణపాదకమలామృత పానభృంగం
శ్రీశైలభాను వంశాంబుధి దేవజాతం
శ్రీశంకరార్య నామం గురుసంస్మరామి॥

శ్లో॥ నిత్యంసాంద్ర కృపారసం । విదిత భావాభావ మధ్యస్థితం
ద్వంద్వాతీత మనుత్తరం । పరమకల్యాణాత్మ తత్వంవిమం
బ్రహ్మానందమయం । ముముక్షునిలయం సానందభావంసదా
శ్రీమద్భాగవత తాత్పర్యార్థి । విలసచ్ఛ్రీకృష్ణ చంద్రంభజే॥

## కవివంశావళి.

సీ॥ శ్రీమించుగుంటూరు ♦ సీమనుయ్యూందన
తాళ్లూరుకాపుర ♦ స్థలము కొప్ప
రపు గుర్వయాఖ్యుండు ♦ రాజ్యలక్ష్మమలు
మాతాపితల్ వినుడు గో ♦ త్రంబువిమల
కౌండిన్యసంబుల ♦ క్ష్మాయమ్మ మద్ధర్మ
పత్ని యిర్వురుపుత్ర ♦ వరులుపూర్ణ
జ్ఞానరూపుండు ప్రజ్ఞా ♦ దురంధరుడు వేం
కట ప్రభుండు గురుండు ♦ కావ్యరచన
జ్ఞానయోగ విచారణల్ ♦ గనగరెండు
సతమునొనరించు పనులుపా ♦ స్యంబు బాల
త్రిపురసుందరి హరికథల్ ♦ తేటపరతు
వయసు ముప్పది పేరు గో ♦ పాలకృష్ణ
మూర్తి యందురు వెల్లరు ♦ ముదమలరగ॥



శ్రీరస్తు—అవిఘ్నమస్తు.

శ్రీగురుపరబ్రహ్మణేనమః.

# శ్రీ కృష్ణ భాగవతము.

## (హరికథ) ప్రథమ స్కంధము

—:o.—

### 1. పరీక్షిత్తు చరిత్రము

మంజ—మునుపు నైమిశారణ్యమందుగల। మునివరులందరుజేరి
వనజనాభు కథలుగ్గడించుబుధ। వరసూతునిదగజేరి
2 మీకరుణను శ్రోత్రములు ధన్యములు। మేయుగుణాకరయయ్యెన్
లోకహితార్థము యితిహాసములు। ఘోషింపగ నయ్యెన్॥

ఆ॥ రాముచరితమెల్ల రామాయణంబని
పాండుసుతులకథను భారతమని
కడమకథలనెల్ల స్కాందంబునాదగు
నామములనుచెప్పి నారుగాన.—

కం॥ తరియించితిమిక నొండొక। వెరిగింపుము భక్తిజ్ఞాన మేముఖ్యముగా
సురభగవత్కథ నావిని। పరమాత్మునికథనువినుడు భాగవతమనన్.

నవరోజు—జంపె.

ప॥ వరమానులిదె భాగ। వతమాలకింపుడీ॥ వర॥

అ॥ స్థిరబుద్ధి మీరగను। దేవవందితమిది॥ వర॥

మి॥ పరమాత్మునిచరితంబున్। భక్తిమీరగావిన్నన్
దురితంబులుదలగున్। చిరమోక్షముగల్గున్॥ వర॥

2 నాకుఁగురుండగు పుణ్యశ్లోకుండైన శ్రీవ్యాసుడు
లోకహితార్థము గాథల । నేకమ్ములుగూర్చి వ్రాసె

మి॥ సకలదుఃఖ సంహారము౯ । సద్బోధవితతాకరము౯
ప్రకటమోక్షప్రదము౯ । భాగవతంబనుకథము౯॥ వర॥

మ॥ అవనీ భారవహుండు భక్తజన రక్షాసక్తుఁడీశుండు దు
ష్టజనోత్కృష్టకీర్తి ధర్మరక్షణకుండై బ్రహ్మాండలి౯ యిర్వదొ
క్కవిధాకారముల ధరించి పోషిమె౯ కైవల్యముంగూర్చి భ
క్తవరాగ్రేసరులం గృపంగనియె సంస్రావాసుఁడై ముందుగా౯.

వచ॥ అవియెట్లన. జలరాశిమధ్యంబున శేషశాయియై నాభికమలంబున విధాతనుసృజించి చతుర్వేదంబులొసంగి చతుర్దశభువన నిర్మాణంబు చేయించె. రెండవదియగు వరాహావతారంబున హిరణ్యాక్షుని వధియించి ధరాదేవింగాపాడె. మూడవది యగు నారదావతారంబున వైష్ణవ మతతంత్రంబు బోధించె. నాల్గవపరి నర నారాయణాభిధానుండై తపంబొనర్చుటలు నేర్పె. నైదవపరి కపిలుండై సాంఖ్యయోగంబెఱిగించె. నారవపరి అత్ర్యనసూయలకు దత్తాత్రేయుండై బుట్టి అలర్క ప్రహ్లాదులకు నాత్మవిద్యగరపె. నేడవపరి నాకూతియందు యజ్ఞుండవజన్మించి స్వాయంభువ మన్వంతరంబునధరాతలంబుగాపాడె నెనిమిదవపరి మేరుదేవికి యురుక్రముండన జనించి పరమహంసమార్గంబు ప్రకటించె తొమ్మిదవసారి మునుల కోరికపయి పృథుచక్రవర్తియై భూదేవిం గోవుగానొనరించి యోషధులం బిదికె. పదియవపరి మత్స్యావతారంబున సోమకాసురుంబొలియించి వేదంబులనుద్ధరించె. పదునొకండవపరి కూర్మావతారంబున మంధరంబు వహించి దేవాళింగాపాడె. పదిరెండవతరి ధన్వంతరియై యాయుర్వేదంబు వెదజల్లె/పదమూడవపరి మోహినియై దేవతల కమృతంబు బంచి యిచ్చె. పదునాల్గవసారి నృసింహమూర్తియై ప్రహ్లాదుని కొరకు హిరణ్యకశ్యపుని వధించె. పదునైదవదియగు వామనావతారంబున

బలిని పాతాళంబునకంపి సురలంగాపాడె. పదియాఱవసారి పరశురాముండై యిర్వదొక్కపరి క్షత్రియులనిర్జించె. పదియేడవపరి వ్యాసుండై వేదపురాణంబులకు శాఖలేర్పరచె. పదునెనిమిదవసారి శ్రీరామావతారంబున రావణాది రాక్షసుల పెక్కురనుక్కడంచె. పందొమ్మిదవపరి శ్రీకృష్ణావతారంబున కంసాది విమతులంజంపి భూభారంబు వారించె. యిరువదియవపరి కలియుగాద్యవసరంబున బుద్ధదేవుండై రాక్షసుల మాయామాయాచారధర్మము చ్చె. యిఁక యిరువదియొకటవపరి కల్కిరూపధారియై విష్ణుయశుండను విప్రునకు జన్మించి ధరాధీశుల మొండగంబుల మాయించునట్టి భగవల్లీలల నెఱిగించు భాగవత పురాణం బఖిలకలుష సంహారకరంబుగాదే—

మంజ— కురుపాండవులతి ఘోరమైన సం। గరము చేయనంద
మరణించిరి కౌరవులు పాండవులు। ధరణికి రాజయె మొంద.

తే॥ మరణశయ్యను వసియించి మానధనుడు
కౌరవేశు డశ్వత్థామ జీరిపుడమి
పాండుభూజానికులములే కుండునటుల
జేయుమని దివికేగెను చింతదక్కి.

వ॥ అశ్వత్థామ యొక్కరుండగుట వేరొండు వెరవులేమి నర్థరాత్రంబున పటకుటీరంబుల నిదురించు పాండవుల వధియింపు దలపెట్టిన యావార్త నెఱింగిన శ్రీకృష్ణపరమాత్మ పాండవుల సెయ్యాలయం దుపపాండవుల బరుండజేసి యమునానదీ సైకత విహారంబులకు పాండవుల గొనిచనియె. అశ్వత్థామ యుపపాండవుల బల్మిని వధించిచనిన ద్రౌపది పుత్రపంచక మారణంబెఱింగి కొంతవడి శోకించి—

శా॥ అన్నామాధవ భక్తవత్సల యిదే మన్యాయమోకాని నే
డిన్నీచుండగు ద్రోణినాకొమరు లన్నిద్రార్తులంజంపె నీ
కన్నన్నాకు శరణ్యులేరి కృపతో గాండీవి నిన్నీచునిన్
వెన్నంటంగొనివచ్చి చంపుమి తని న్నిసోదరిన్ మ్రొక్కెదన్.

మంజ—జనివిలపించెడు ద్రౌపదికడకా । హరినరులరుదెంచి
విభిన్నశ్రాంతము తేరునెక్కి భూ వేల్పుచనినదెసగాంచి
2. పరచినద్రౌణిమెరింగి పాఱి తను । పటిమదూలినిలచి
నరుపై నుపసంహారంబెఱుగని । యట్టివిధి శిరముపైచి.

వచ॥ నంత కృష్ణుం డర్జునా యీ బ్రహ్మాస్త్రంబునకు ప్రతిగా నీ బ్రహ్మాస్త్రంబు ప్రయోగింపుమన నతం డట్లొనర్ప నవి రెండును ఘోరంబుగా పోరుచుండ—

కం॥ హరియానబూనికిరీటి । మరలించికిరీటి రెండుమార్గణముల నా
గురునందనుపెనువెంటనె యరిగికరముబట్టిగొనుము నరయహరియనున్.

కల్యాణి—రూపకం.

ప॥ చంపవలదువిజయ వీని । నాహాసింపకుముపెంపు । చంప॥
అ॥ గంపిలిపారెను పాపుడు । గాకగురుని సుతుడువిడుము॥ చం॥
చ॥ తెంపునఘోరంబుచు భూ । దేవుడాచరించెగాక
చంపరాదు బ్రహ్మహత్య । సైపరానిదేదికైన॥ చం॥
2 ప్రాణహింసకన్నవిడుము । బ్రాహ్మణదూషణఘోరము
గాననితని దూరివిడువ । గావలెద్రౌపదియుమీరు
మి॥ పూనివీనితేరుమీద । బూన్చికట్టి గొంపోదము
మానితకీర్తిగల్గు భూ । మండలినిటు గావించిన॥ చం॥

ఆ॥ వె॥ అనిన మంచిదనుచు నర్జునుండాతని
శిబిరమునకుతెచ్చి చింతనంద
చున్న పాండవులకు జూప నొక్కొక్కరు
దురితభయమువీడి దూరిరతని.

వచ॥ భీముండీ శాలవాంతకు నడచిపుత్తునని గదంగొని లేచిన కృష్ణుడు—

చ॥ పరచినవాని భీతియుతు పారుని మద్యముగ్రోలిదేహము
మ్మరచినవాని కాముకుని మాధవుభక్తుని నన్నుగావు మం
చరచినవాని నిద్రగొనినట్టిని సాక్షినవాని సాధువుల్
ధరజడభాగ్య చంపుటలుధర్మముగా దెప్పుడైనపావనీ.

మంజ—కృష్ణునానపై ద్రౌణితలఁగొరిగి శి। రోరత్నముఁగొంచు
జిష్ణునందనుఁడంపిన వాఁడల। సిగ్గువడ్డరకువచ్చు.

వచ। అంత పాండవులు మృతులగువారలకు పైతృక క్రియలాచరించిరి గాంధారీ ధృతరాష్ట్రుల శోకంబువారించి సుఖానుభూతి రాజ్యంబును పూజ్యంబుగా నేలుచుండ నగ్గురునందనుం డవమాన మొకవంకను దుర్యోధనునకిచ్చిన యభయం బొకవంకను బెనంగొన-

తే॥ గీ॥ ఉత్తరోదర వసిత బాలుండుఁదక్క
పాండవులసంతు లేదు భూమండలమున
వీరితో నేల నిదె గర్భభేదనంబు
చేసి వంశంబు నిర్మూలింపఁ జేతునంచు.

మంజ—తలఁచి బ్రహ్మశిరోనామకా। స్త్రంబుఁబూనివిడువ
వెలఁదియుత్తర గర్భమునందలి। పిండంబును బెగడువ.

వచ॥ అంత నుత్తర గర్భవేదనాభరంబోర్వలేక శ్రీకృష్ణభగవానుం దలఁచి

మలయమారుతము-చతురశ్రగతి.

ప॥ యదుకులనందన శౌరే। గిరిధారీ మురవైరీ-హరి॥ యదు॥

1 మదనజనకముని। మానసనిలయా
సదయహృదయ కే। శవదామోదర॥ యదు॥

2 చెల్లెలికోడల నీ మే। నల్లుఁడు రణరంగమందు
చెల్లెను యీగర్భబాధ। సైరింపను రక్షింపుము॥ యదు॥

తే॥ గీ॥ యిట్లు ప్రార్థించు నుత్తర నిందిరేశుఁ
డడలకుమటంచు నారాయణాస్త్రమునను
ద్రౌణివైచిన శరముచు దరిమిగర్భ
మందుగల బాలుప్రాణంబు లరసిగాచె.

వచ॥ అంత కొన్ని దినంబులకు నుత్తరగర్భంబున నొక క్షత్రియకులాలంకారుఁడగు కొమరుం డుద్భవించె. పాండవు లతనికి పరీక్షిత్తను నామం బొనరించి ముద్దార బెంచుచుండిరి. శ్రీకృష్ణ పరమాత్మ పాండవులందోడ్కొని శరతల్పగతుండగు భీష్మునిదరి కరిగి నమస్క-

రించిన నయ్యవసరంబున కేల్మోడ్చి శ్రీకృష్ణా భక్తపరాధీన దుష్టదమ
నా నీ మహామహిమంబెఱుంగ నెంతవారికేని దరంబే- శిష్టరక్షణ
దుష్టశిక్షణ గావించి భూభార హరణంబొనరింప ధరించిన భవదీయ
లీలామానుష విగ్రహం బిక కొలదికాలమే నిలచి యుండగలదు. నా
దురితంబులు క్షమించి భవదీయావాసంబు ప్రసాదింపుమని ప్రార్థించి॥

పూరికల్యాణి—రూపకం.

ప॥ ధర్మతనయ నీకు రాజ। ధర్మమ్ములు దెల్పెద నిదె। ధర్మ॥
అ॥ నిర్మలబుద్ధి వినుమిక। నీవెఱుఁగనిదే మున్నది। ధర్మ॥
చ॥ మర్మంబెద యుంచకు। మంత్రులగని నిరసించకు
దుర్మదులను రక్షించకు। ద్రోహచింతలో గాంచకు॥ ధర్మ॥
2 ప్రజల కన్నబిడ్డలవలె। పరికింపుము కాటకమున
గజిబిజి గావించు బహు। కష్టంబులు గోరబోకు
చ॥ సుజనుల పండితకవులను। సొంపుమీర పూజింపుము
రజనీచరవంశకీర్తి। రాణింపగ నెల్లజగతి॥ ధర్మ॥

తే॥ గీ॥ అని యెఱింగించి శ్రీకృష్ణు నభినుతించి
యుత్తరాయన మరుదెంచి యొంటనెరిగి
వ్యాసభగవానుఁడొసగిన పరముకతన
యోగమార్గంబున స్వభీష్ము డసువు విడచె॥

వచ॥ అంత భీష్మున కంత్యకర్మంబు లాచరించి సుఖోపవిష్టులైన పాండవు
లంజూచి శ్రీకృష్ణుండు-

మంజి—పాండవులారా బహుకాలంబయె। ద్వారకకేగక నేను
యుండిరో లేదో సుఖగతి యాదవు। లోక్క పరియేగుదేను
2 మీకార్యంబులు సమకూడెనుగద। మేలందుండిక నేను
నా కాంతల పుత్రుల తలిదండ్రుల। నావారల గాంచెదను॥

తే॥ గీ॥ పోయివత్తునటంచన్న మురవిరోధి
కమితచీనాంబరాభరణాదులొసగి
పూజగావించి యరదంబు బూన్చి విజయు
ద్వారకం జేర్చుమని పంపె ధర్మజుండు॥

వ॥ శ్రీకృష్ణార్జును లరిగినపిమ్మట నొకదినంబున రేయి కూర్పర గర్భ జనిత నందన మరణలబ్ధ విచారసాగరంబునం దొప్ప దోగుచున్న, గాంధారీ ధృతరాష్ట్రులకడకు ధర్మాంశంబున జనించిన విదురుం డరుదెంచి॥

కేదారగౌళ చతురశ్రగతి.

ప॥ కురుకులవృద్ధాంధరాజ। గురుబలరవితేజా మహారాజా। కురు॥

అ॥ నిరతిశయ సుఖంబెనీకు। నీభార్యకుపాండవులకు॥ కురు॥

2 నావచనము వినకను నీ। నందనులను సూహ్వరబలి
గావించితె భీమసేను। గదకు పాండుసంతతికిని॥ కురు॥

మ॥ సుతులుఁ వారల పుత్రులుఁ గురువులుఁ జూడంగ నేతెంచు నీ
హితులుఁ వీరులు సైనికుల్ నశించ సి పంక్తిఁ సుబాయు త్తె జ్ఞ
వితతుఁ గోరుమవార నిస్సుమల హృద్భేద్యంపు హాహారవ
ప్రతతిన్ర్వించు విరోధులెచ్చు కబళంబా సించి చిత్రంబుగన్॥

వచ॥ అనినవిని కొంతవడివిచారించి ధృతరాష్ట్రుండు-

కేదా—త్రిశ్రగతి

ప॥ ఏమిసేతునో విదుర నా। కెరుగ జెప్పవయ్య విదుర॥ ఏమి॥

అ॥ నామనంబు దుఃఖాగ్ని గార్గియును
నాశనమందదయ్యె నింక నే। నేమి॥

చ॥ నీమాటలు వినినను మా। కీ దుష్పథుటిల్లకుగద
నాముద్దుపట్టి సుయోధను। డేమిక్కిలి మూర్ఖమూన॥ నే॥

వచ॥ అనిన విదురుండిట్లనియె—

సీ॥ శత్రుసాదముద్దిని సౌఖ్యమందుటకన్న మానవంతునకు మేల్ మరణ మనగ
గావుననావెంట గాంధారితోడను దెమ్ము కాననసీమ దేవభక్తి
బూనివానప్రస్థ మునముక్తిగాంచుదు రనినమ్మబోధించి యతనిదార
యుతముగాగొనిచనుచుండ కాననమున దావాగ్ని ప్రబలి గాంధారినాథు
కబళమొనరింప యమిత దుఃఖమునునామె
భర్తవెనువెంటనగ్నిలో బడియుడంగె

నాకతంబున నిట్టిపెద్ద గాకయుచుచు
యుదధిలోఁబడి పిడిచేరె విదురుఁడంత।

వచ! అంతనిట నుచితకాలంబున పాండవులు కాలోచితకృత్యంబులు దీర్చి
కొని వ్యక్తులంగను కాంక్షసేగి యుదయరాయి విచారించుచు సభా
స్థలంబుఁజేరి రంను పాండవాగ్రజుండు తనకుదోచు దుర్నిమిత్తములు
గురించి భీమునికిట్లనియె—

సీ! నాముందు శునకంబు మోమెత్తి వాపోవు నక్క యరచుచు సూర్యు
దిక్కు జూచు
హయరాజములు కన్నులార్చి నీరము గార్చు గజతండములు నూర్పు
గాంచుచుండె
అగ్నిహోత్రంబులు యూరిపోవుచుండె గోవులు లేగలం గుడువనీవు
గార్ధభంబులు గూసె కడుగృధ్రములు మూగె నాకు మట్టుచు భాను
వాయునందన నాదేహ వామపార్శ్వ (డాంచెచలువ
మదరుచుండెను నారసుం డవియె ధరణి
కాంతకిక కృష్ణపద రజంబింత యేని
దాల్చుభాగ్యంబు లేదని తథ్యమేమొ।

మంజ—ద్వారకనుండియు కీడియుమిత చిం। తాకులమానసుడై
చేరినగని శమనాత్మజుండుయనె। సేమమరయు నాడై॥

త్రిశ్రగతి—కల్యాణి.

ప॥ సేమమా నెల్లరకు। చెప్పుమయ్యా ద్వారకను॥ సేమ॥
అ॥ కోమలాంగులైన కృష్ణ। కామపాలనాత్యకులు॥ సేమ॥
1 మదనసాంబగదులు రేవతి। మొదలగు కాంతలుపిన్నలు
సుదతులు సేవకులు పెద్దలు। ముదమున నాకెరిగింపవె॥ సేమ॥

ఆ॥ వె॥ ఇట్లుప్రశ్న చేయు నిందప్రనందమడతి
శోకమూగ కన్న జనకు నేమి
బలుకజాలక తన తలవంచి విలపింప
యతనితోడమరల యనియెనిట్లు॥

సురటి—రూపకం.

ప॥ శోకింపగనేలపార్థ। సుఖమేగోపాలునకు॥ శో॥

అ॥ యీకరణినిమాటాడ। విడేల ధైర్యముజ్జగించి॥ శో॥

చ॥ ప్రాకటశౌర్యాన్వితుడవు। పడతివో లెవిలపించెద
వేకతమది యెరిగింపుము। వృద్ధులకే కేడజ్ఞానో॥ శో॥

2 ఆడితివో యనృతంబులు। వీడితివో శరణార్థుల
గూడితివో కృతఘ్నుల। నోడితివో శత్రువులకు

చ॥ వేడితివో నీచుల నె। గ్గాడితివో సాధువులకు
పాడిదప్పి స్త్రీబాలుర। పరిమార్చితివో యీగతి॥ శో॥

మ॥ మునుఘోరాటవి సూకరంబుకొరకై ముక్కంటితో బోరుచో
ఘనదేవారుల కాలకేయులనరిన్ ఖండింపగా నేగుచో
వనమందల్ల సుయోధనుంగెలచి పోవన్ దివ్యులంగెల్చుచో
కనులన్నీరెటువంటిదో యెరుగవే గాండీవి యిట్లేటికిన్॥

వచ॥ అనినపార్థుండు—

మంజ—ఎవరికరుణయూ తగద్రౌపది కర। మిట్టిబట్టినామొ
ఎవనికరుణ ఖాండవ వనంబును। యేముగెల్చినామొ

2 గాండీవము గైకొంటి నెవని స। త్కరుణనుమున్నొకచో
దండిరాజులనుగెల్చితి మెవ్వని। దయనురాజసూయమున

3 ద్రౌపదిమానముగాచె నెవ్వడా। ధార్తరాష్ట్రసభను
కోపమూనిహరుగెల్చి శరంబును। గొంటినెవనికృపను.

*కం॥విజయధనుంజయ మానుమ।ధ్వజఫల్గునపార్థపాండుతనయనరమహేం
ద్రజమిత్ర యర్జునాయని। భుజములు తవకడవరాక పోకలచీరున్॥

మ॥ అనఘుండాద్యుడు శ్రీకరుండు ముని సేవ్యాకారు డబ్జాక్షుడెం
దునతుల్యుండు సమస్తకార్యముల చేదోడైమనన్ గాచె నా
దనుజద్వేషి కృపాకరుండు వరబృందారణ్య సంచారి దా
మనలన్వీడి వికుంఠ మేగెను భరింపన్ శక్యమే శోకమున్॥

వచ. ధర్మనందనాదులాలించి కొంతవడి దుఃఖించి యాదవులందరేమై
రన వారలు సురాపానమత్తత నన్యోన్యంబు పోరాడి మృతింగాంచిరి
ద్వారకానగరంబు సర్వశూన్యమాయెనని,

తే॥ గీ॥ కృష్ణనిర్యాణమంతయు గ్రీడిదెలుప
సమితిశోకార్తులై భూమి యందవ్రాలి
పేరెలుంగున మొత్తు న ద్వారకడకు
చేరె హరిగాన రతుడైన నారదుండు.

వచ॥ పాండవాగ్రజుండా నారదునకు నమస్కరించిన నతండు శోకకార
ణంబడిగి తెలుసుకొని పాండవుల కడలకుముని యిట్లనియె॥

కమాచి—త్రిశ్రగతి.

ప॥ విలపింపగనేలరాజ। విదితాఖిల సురభూజా॥ విల॥
అ॥ కలికాలంబుదెంచెను। గద కృష్ణుండెట్లునిలచు॥ విల॥
చ॥ తొలగుధర్మములుయిక పా। పులుతెక్కలేక బుట్టును
తెలమివేదశాస్త్రమ్ములుకడు। హీనమ్మునిదలతురు॥ విల॥
2 మీతలిదండ్రులు విదురుడు। మేలటంచడవిజేరిరి
భూతలంబు విడియాదవ। పుంగవులందరు నేగిరి
చ॥ భీతిదేలపరీక్షితునకు। పృథివినొసగిమీరందరు
నాత్రిలోకవందితుని। యండజేరదగు సమయంబిదె। విల॥

కం॥ నారదుడెఱిగించినవిని। ధారుణినికపాండుసుతులు తలగుట్టకై ధా
త్రీరమను పరీక్షితునకు। జేరిచి రత్యంతప్రేమ చేవిధిగాగన్॥

వచ॥ అంత నసింపగా మిగిలిన యదువులకు అనిరుద్ధుని కుమారుండగు
వజ్రుని ప్రభువుగానియమించి మధురానగరంబున న్నిల్పి సతీయుత
ముగా పాండవులు మహాప్రస్థానికంబున కరిగిరి. అంత పరీక్షన్మహా
రాజు ధర్మంబునాల్గుపాదంబుల చరింప రాజ్యంబేలుచుండ నొకపరి-

మంజ—గోరూపంబున ధరాదేవి క। న్నీరుగార్చుచుండ
కారణమడయుచు ధర్మవు వృషభా। కారంబునుగనియుండ.

సీ॥ మఖములు లేమియమర్త్యులకిటమీదమఘుభాగములు లేకమానువనియొ
రమణులురమణుల రక్షింపరనియొ పుత్రులతల్లి దండ్రుల బ్రోవరనియొ

భారతికుజనుల బ్రాపించుననియొ సద్విప్రులన్నృపులు సేవింప రనియొ
కులిశహస్తుఁడువాన గురియకుండుట బ్రజలుకాటకమున బడుదు (రనియొ
హీనవంశజాతు లేలెదరనియొ రా
జ్యములు పాడిగల్గి జరుగవనియొ
మనుజులన్న పాన మైథున శయనాస
నాదికర్మసక్తు లగుదురనియొ॥

వచ॥ విచారించుచుంటివి గతంబేమియో యెఱింగించుమన గోరూపధాత్రీ
దేవి యిట్లనియె-

2563

హిం॥ తోడి చతురశ్రగతి.

ప॥ ఏమిధర్మదేవత నీ। విట్లుబల్కుచుంటివా॥ ఏమి॥ 296.592
అ॥ నామదిఁజిగులందకేటు మ। నంగలనోయామాచెప్పుము॥ యే॥ G0P

1. కలికాలంబరుదెంచెను। గాఁడేదీన నీపాదం
బులు మూడడఁగెను నిలువ। గలనె శోకవనధి మున్గక॥ యే॥
2. దేవతలకు ఋషులకు పిత్రు। దేవతలకు స్త్రీకు నాకు
గోవ్రులకును వర్ణాశ్రమముల। కును బాధలుగల్గుగాదె॥ యే॥

తే॥ గీ॥ ఇట్లుధర్మదేవతయు ధాత్రీసతియు వి
చారమొనరించు నెడకలి చక్రవర్తి
శూద్రతేజంబునండాసి రౌద్రమూని
కలుషమెన్నక నిర్భరం గాలదన్నె॥

మంజ—పాండవపౌత్రుడు పరీక్షితుడు యా। పాపాత్మునిజూచి
దుండగీఁడయిటు లొనరింతువెనిను। దునిమెదనని కరమూచి॥

వచ॥ నిన్నీగోవృషభంబు లేమిగావించినవి. కొమ్ములంత్రెమ్మినా? పాప
భయంబించుకేనియుంలేక యీపవిత్రమూర్తులం గాలదన్నుదువా?
శ్రీకృష్ణార్జునులుగతించిరని విజృంభింపనెంచితివా? దురాత్మా! యని
ధర్మదేవతం దిలకించి దేవా! నీ వేకపాదవై వర్తించుట కడు విచార
కరంబు కృతయుగంబున నీకు తపశ్శౌచ దయా సత్యంబులను
నాల్గుపాదంబులు గలవు. త్రేతాయుగంబున నందొక్కటి గతించె.
ద్వాపరంబున యింకొండుగతించె. యీకలియుగంబున నొంటికాలి

తో నైనను చరింపనీక యీదండగీను యెడను తలంచె. వీని నిదే
నశింపజేతునని చండతరమూర్తియై కలిమహారాజు శిరోజంబులంబట్టి

తే. గీ॥ ఖడ్గమున నెరజేయగా గడగునంత
కలి పరీక్షిత్తుపాద యుగ్మమునవ్రాలి
శరణుయభిమన్యుపుత్ర రక్షణమవశ్య
ధర్మమగు మీకులంబుకో ధర్మమూర్తి॥

మంజ—అని ప్రార్థించిన కలిపురుషున క। య్యభిమన్యాత్మజుడనియెన్
చనుమువీడితిని నిను నారాజ్య। మ్మున నిలువకయరయన్॥

వచ॥ కలిపురుషుండు మహారాజా నే నెందుండవలయు నానతిమ్మన. ప్రాణివధ స్త్రీ ద్యూత పానంబులను నాల్గుప్రదేశంబులొసంగి చాల వస, అసత్య, మద, కామ, హింస, వైరంబులను స్థానంబులిచ్చి కలి నంపి ధర్మదేవతకు తపశ్శౌచ దయాసత్యంబులను నాల్గు పాదంబుల నుద్ధరించి యనిపిపుచ్చి-

తే॥ గీ॥ ఒకదినంబు పరీక్షిత్తు మృగ్రివనము
లోన వేటాడియలసి దా పూనియొక్క-
పర్ణశాలకు తృష్ణచే పాటవంబు
దూలిచనిగాంచె నొక తపశ్శాలినోలి॥

భైరవి—రూపకం.

ప॥ మునివర మ్రొక్కెదమీకు। భూపాలుడ పరిక్షితుడ॥ ముని॥
అ॥ వనమృగముల చంపుకొంచు। వచ్చియుంటి నలసియుంటి॥ ముని॥
1 దాహంబధికంబయినను। తపియింపం జేయుచుండె
దేవా మీకమండలాంతర। తీర్థము దోయిలియొగ్గితి॥ ముని॥

మంజ—అని వేడిన నాశమీకముని స। మాధిలోన దగనుంటన్
వినడాతని వచనంబులు రమ్మని। కనడెంతయుగడ కంటన్.

ఆ॥ వె॥ దానన్నృపుడు తీవ్రతర కోపమూని యీ
వెడగువాని గారవింపడయ్యొ
నవమానించెపరతు గాకని మృతిగన్న
పాముదెచ్చిచుట్టె వానిమెడకు॥

వచ॥ అంత పరీక్షిన్మహారాజు హస్తినాపురంబునకరిగె. కొంతతడవున కా శమీకమహర్షి కుమారుండగు శృంగి యరుదెంచి తండ్రిమెడం దవిలిన సర్పముం గాంచి-

శా॥ ఓరా! యేమిది సర్పమెట్లుదవిలెన్ యయ్యో యిటుల్ జేసిరే
క్రూరాత్ముల్ జనకుం డెరుంగఁడొ మదిన్ గొంకేక తీయంగ లే
నేరేపుణ్యులు దీనిబాధ దొలఁగన్జేయంగ లారల్ హితుల్
లేరేదగ్గర తండ్రిపల్కవె యికన్ లేవే ననుంజూడవే॥

తే॥ గీ॥ అనుచుచింతించి కోపాగ్ని నెసఁగరచి
పాపభయమించుకంతేని బడకతండ్రి
గళమునం దహిన్వైచిన కలుషచిత్తు
డడఁగు తక్షక విషత సప్తాహములను.

వచ॥ అని శపించిన శమీకమహర్షి తెలివంది చూచి సర్పమ్మున్ దొలంగ ద్రోచి జరిగిన వృత్తాంతంబంతయు నాలించి దివ్యదృష్టివలన నారసి కొడుకుంజూచి,

ఖండగతి—నాటకురంజి.

ప॥ ఎంతపనిచేసితివి। యిలరేని శపియింతె॥ యెంత॥

అ॥ కాంతారముననైన। కడుసుఖింపగజేయు॥ నెంత॥

1 సకలభూపాలుండు సజ్జనగణ వినుతుండు
అకలంకయశోఘనుండు। ఆర్యజనసమ్మతుండు॥ యెంత॥

2 ధర్మమునుదాల్చి పా। దంబుల నడిపెడువాడు
నిర్మలుడు పరిక్షితు। నే శపియింతువెతనయ॥ యెంత॥

తే॥ గీ॥ అనిసుతుని మందలించి యమ్మునివరుండు
తనదుశిష్యుల నిభపుర దంతినగరి
కనిపెశాపంబు తెరగు నాతని కెరుంగ
జేయుడని చింతితుండయ్యె యశేషఘణితి.

వచ॥ భూసురకుమారులు హస్తినాపురంబునకరిగి-పరిక్షిద్భూపాలునింగని,

చ॥ నరవర వేట వేడు కవనంబునుజొచ్చి శమీకమౌని కం
ధరమున సర్పమున్నిడిచి నావని తత్సుతుఁడైన శృంగి భీ

కర తరశాపమిచ్చె నెపగంపగు తక్షక దుర్విషాగ్నిచే
మరణమునందు మీకిట క్షమాగతిలేక నె యేమనాళ్ళకున్.

కం॥ అనియిటు చేసి వారలు । చనిరి నృపాలుండు శోక సమ్మూర్ఛితుడై
పనవివని రెందు కేగెతి । మునికవ మానంబొసర్చి మూర్ఖుడనైతిన్.

నాదనామక్రియ—రూపకం.

ప॥ ఏమిసేతుదైవమా నే । నెందుబోదు తెరవెయ్యది॥ ఏ॥
అ॥ పామరుండనై మానిని । భంగపరచినాడనింక॥ ఏ॥
చ॥ యీమహినిక నాకుదిక్కు । యేమహనీయులుగలరు
యేమిగతియొనాకుయింక । యెట్లుదివిని జేరగలనొ॥ ఏ॥
2. భోగంబులు లేకయున్న । యోగంబులు లేకున్న
యేగతిదరియించెద నా । కింకజన్మము లెన్నిగలవొ
చ॥ ఆగజరక్షణుకడకే । నరుగజాల నైతినిగద నా
కీగతి మరణంబొదవుట । యెరుగనైతి పాపినైతి॥ ఏ॥

తే॥ గీ॥ అనుచు ప్రాయోపవేశంబు నందిదర్భ
శయ్యవసియించి యున్ననా జనవరుకడ
కరుగుదెంచె వశిష్టుండు సురమునియుత
శుకమహర్షినిగూడి యస్తోకభక్తి.

వచ॥ యిట్లరుదెంచి యందరు నృపుననునయించిరి. అందు శుకుండు పరిక్షిద్భూపాలా, యేడుదినంబులు గడువుండ తరింపజాలనని భీతివడ నేల గోవిందనామభజనంబున రెండు గడియలలో ఖట్వాంగుడు తరింపడే, భాగవతసమాకర్ణనం బాచరించిన తిరిగి జన్మింపజాలని గతింగాంతువు. అన దేవా తామా భాగవతకథావిధానం బెరిగింపు డని ప్రార్థించి అందుల కొడంబరచె—నిది శ్రీ మహాభాగవత పురాణంబునం ప్రథమస్కంధంబు.

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ.



శ్రీరస్తు—అవిఘ్నమస్తు.
శ్రీగురుపరబ్రహ్మణేనమః.

# శ్రీ కృష్ణ భాగవతము.

## (హరికథ) ద్వితీయ స్కంధము

—:o.—

### 2. కపిలోత్పత్తి.

తే॥ గీ। అవధరింపుడు శుకయోగి యనియెవర్ణ
ములు అకారాది త్రియముచే పొసగప్రణవ
మదిజపించుచు భగవంతు నాశ్రయించి
ధన్యతనుబొందవచ్చు సత్యంబుగాను.

మంజ—అనన్యపుండు భగవంతుడెందు దా। నలరుచూపమెద్ది
వినిపింపుడు నావ్యాసాత్మజు డి॥ ట్లనియె తెలియుడద్ది.

వచ॥ శరీరంబున నవ్విరాటుండు తేజరిల్లు నెట్లన. పాదమూలంబు పాతాళము, పాదాగ్రభాగంబు రసాతలంబు, గుల్ఫంబులు మహాతలంబు జంఘలు తలాతలంబు. జానువులు సుతలంబు. ఊరువులు వితలంబు, జఘనంబు అతలంబు. నాభినభంబు, వక్షము తపోలోకంబు, శిరము సత్యలోకంబుగా వర్తిల్లు. మరియు-

సీ॥ బాహులింద్రాదులు వదనంబువహ్ని కర్ణంబులుదిశలు ఘ్రాణంబుగాలి
శ్రవణేంద్రియంబది శబ్దంబునేత్రంబు లంతరిక్షంబు దివాకరుండు
రెప్పలుపరికింప రేయుంబవళ్ళు భ్రూమధ్యంబుగనగ బ్రహ్మపదముగును
ధాతువులుజలంబు దగనాలుకరసంబు భాషణవేదాళి పంక్తుపుత్రి
మిత్రస్నేహంబులెమ్ములు మేటిగిరులు
రోమసంఘంబుతరువులు రూఢిస్తనము

లరయధర్మంబు నాడీ జలాశయములు
నా విహారప్రపనకు తనువే విభంబు.

తే. గీ. మఱియు నాతని ముఖము బ్రాహ్మణులు భుజము
లవనినాథులు ఊరువు లనగ వైశ్యు
లంఘ్రియుగలు శూద్రులట్టి దేవాదిదేవు
భక్తిచే గొల్చి తరియింప వచ్చు జుమ్ము.

వచ: సద్యోముక్తియు, క్రమముక్తియు నవి ముక్తిమార్గంబులు రెండు తెరంగులు. నవి భక్తిమార్గంబుచే సులభసాధ్యంబు—

కల్యాణి—చతురశ్రగతి.

ప॥ భక్తినిమించిన సాధనలేదిక। ముక్తినిగోరనయెడల॥
అ॥ శక్తికొలదిహరి స్మరణచేయగను। జాలుజన్మమీడేరున॥ భ॥
1. పశుపక్ష్యాదులవలె సంసార। పంకములోబడి సమయనేలను
వశమే హరిభక్తిని వినుతింపగ। వారిజభవ రుద్రాదులకైన॥ భక్తి॥

తే॥ గీ॥ మున్ను క్షీరాబ్ధివాసుడై వెన్నుడు పదు
నాల్గులోకంబులసృజింప నాకుగాక
యొరుల నియమింపవలెనంచు నూహజేయ
నాభికమలంబున విధాత శోభబుట్టె.

వచ॥ ఇట్లుజనించిన బ్రహ్మ విష్ణునింజూచి అంజలిమోడ్చి-

భైరవి—రూపకం.

ప॥ యీవే సర్వాధారుడ। వెలమిభక్త పోషణుండ॥ ఏ॥
అ॥ దేవానిను పొగడదరమె। దితిజారినుతసూరి॥ యీ॥
చి॥ పావన శయనభుజంగా। పాపతిమిర ఘనపతంగా
నీవిమల కరుణతోడ న। న్నిత్తరి బ్రోవవె శ్రీహరి॥ యీ॥

మ॥ అనిప్రార్థించువిధాత కాహరియనున్ యబ్జాసనా సర్వలో
క నియంతృత్వము చేయగోరి గలుగంగాజేసితిన్ సత్యలో
కనివాసంబున సృష్టిసల్పుము నమున్ గాఢానురక్తిన్ స్తవం
బొనరన్ జేయుచు నా నతండుచనెనో యుర్వీశ యాలించితే॥

వ॥ అంత నావిధాత యాచతుర్దశ భువన నిర్మాణంబునకుం బూనె. నీ భాగవత పురాణం బాద్యంతంబు నారదుని చేఁ గోరంబడి విధాత యెఱిగించి

మంజ—నిగమార్థప్రతి పాదకంబు మా। నిత భాగవతంబీవు
దగ వివరంబు గవిరచియింపుము నా। తనయుజన్మలికరావు.

ఆ॥ వె॥ అనఁగ వల్లెయనుచు నానారదుండు నా
జనకుఁడైన వ్యాస సంయమివరు
కెఱుఁగఁజేయ నతఁడు విరచించెమహాస్తుతి
వేలగ్రంథమిది సవిస్తరముగ.

ఆ॥ వె॥ అనవశిష్టుఁడనియె నధిపయింకొంత కా
టాలకింపుమిచ్చ యతులమోక్ష
మిచ్చునట్టి యన్నియెన్ని యోగ్రంథ సం
తానములను వ్యాస మానిగాంచి.

వ॥ తనివి సనక పున్నామ నరకోత్తారకంబగు సంతానంబు లేదని తపించుచు వీర్యంబు వర్జింప యెదుట నడయాడు నొకకంబు వానిం దాఁ బ్రవసద్యోగర్భంబున నీమహాత్ముం డుద్భవించె. నితండి బ్భాగవతం బాసాంతముం జదివి విరాగుఁడై వస్త్రమ్ము వదలి గమ్యస్థాన నిర్ణయంబు లేక వనింబడి చనుచుండ. వ్యాసుండు పుత్రాభిలాషియై కుమారా యని పిల్చుచు వెంటనంటి పోవుచుండ రంభోర్వశ్యాదులు కొలనియందు చేలంబులు వదలి జలకంబులాడుచు నట్లేయరుదెంచి నమస్కరించిరి. వెంటనరుదేరు వ్యాసభగవానుం గాంచి చేలంబులు ధరించి నమస్కరించిన నతం డాశ్చర్యచకితుండై వారల గతంబేమియని యడుగ మీ కుమారుడు నిర్వికారుండై బంధవర్జితుండైన కతన వీరు సచేలలాచేలా విహీనలాయను విచారంబు లేదు. తామో పుత్రేషణ వదలజాలక విలపించుచు నేగుచుంటిరి అని యెఱిగించిన మరలి యమ్ముని నిజనివాసంబు చేరె నట్టిమహాత్మ్యంబుగల యీపురాణం బాలించిన మోక్షము కరతలామలకం బగుం గాదే యన పరీక్షితుండు శుకయోగికి నమస్కరించి తత్కథావిధానం బెఱిగింపుడన శుకుండిట్లనియె-నిది శ్రీమహాభాగవతంబునం ద్వితీయస్కంధము.

చ॥ సనకసనందనాది మునిసంఘములొక్కపరి న్వైకుంఠ వా
సునిగను కాంక్షతో వెడలి సుస్థిరమానస తత్త్వవస్తులై
వనజభవాది వంద్యులయి పావనులై హరిమందిరంబు చే
రిన నటనిత్యకాపరులు లీలజయా విజయుల్ మదోద్ధతిన్॥

శంకరాభరణం-రూపకం.

ప॥ నిలుమునిలుము బాపలార। యిలవిగాదు నగరు దూరగ॥ ని॥
అ॥ పలువతనము చూపగమీరు। బాలుగాశిక్షింపమ్మాయిది॥ ని॥
1 మునులమనుచు ఘనులమనుచు। ప్రౌఢలనుతామపోను
కొనివైచిరె హరినిచూడ। కూడదిచట మీయాటలు॥ నిలు॥

వచ॥ అని యడ్డగించిన సనకసనందనాదులు కోపించి రందు సనందను డిట్లనె—

తే॥ గీ॥ మాకు చేరరాని తావు లీ మహిని లేవు
యట్టి మముఁ నడ్డగించితి రగుట శాప
మనుభవింపుడు పుడమి దేవారులగుచు
బుట్టుడిక కామక్రోధముల్ కట్టికుడుప-

మంజ—అనిశపియించిన విష్ణుడెరిగి యహో! హా మోసంబయ్యెగా
ననునమ్మిన పరిచారులు శాపా। నలమునగాలగ నయ్యెగా.

వచ॥ అని తలంచి విచారించుచు మునులకు ప్రసన్నుండై జయవిజయు లారా! ఒడలెరుంగక యెంతటిఘోరశాపంబు గాంచితిరి. నేను సర్వ శక్తియుతుండనయ్యు విప్రశాపంబు వారింపనోపను-

తే॥ గీ॥ విప్రశాపంబునకు నేనె వెరతునన్న
వారమడు తీర్చెను దశావ తారిగాగ
వవలభృగుమహాముని తన్నె నల్లైననేమి
చేయజాలను రొంతనను స్మృతియెగాక॥

మ॥ తెలియాజేయుదు మీహితంబెటులో పృథ్వీన్ రాక్షసాకారులై
చెలిమిన్నేడు భవంబులన్నను గనన్ చిత్తంబు వైరంబునం
దెలమిన్మూడు భవంబులం గవగ మీయిష్టంబు యోచించి నా
విలసద్భక్తి జయుండును న్విజయుఁ డవిష్ణున్ మదింగోల్చుచున్॥

మంజ—అనఘుయేను జన్మంబులవరకే। మనసిలోనిలువలేము
విను మూఁడైన వైరమైనను త్రిజన్మలే। విధిమాకిటులన్నిమము.

వచ॥ అని సనందనుంజూచి మాకు రాక్షసాకారంబు లిచ్చి జన్మింపం జేసితివి. మేము జనించినపుడెల్ల నీవును మాతో జనించి హరినామ స్మరణంబును మాకర్ణంబుల జొనుపుమక వల్లెయని రంత జయవిజయులు హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులై పుట్టినపుడు సనందనుండు ప్రహ్లాదుండయ్యె. రెండవపరి రావణ కుంభకర్ణులైనపుడు విభీషణుండైజనించె. మూడవపరి శిశుపాల దంతవక్త్రులైనపుడు విదురుండై జనించె, నన—

తే॥ గీ॥ విని పరీక్షితు డామీఁది విధమెట్లంగ
దెల్పుమని వేడ శుకయోగి దెల్పు తన
విభుని కశ్యపుఁగని దితి వేఁడఁ దానను
గు రతిఁగోర నాతఁడా తరుణిఁ గనియె.

కేదారగౌళ—చతురశ్రగతి.

ప॥ చాలుతగదు నీకోరిక। చానాసమయముగాదు॥ చాలు॥
అ॥ గోలయించుకంతతాళుము। కోర్కెదీర్తు నమ్ముముయికు॥ చా॥
1. తలపగ భానుడుపశ్చిమ। జలధిమునుగ నరుగుచుండె
వలదుప్రాపసంధ్యకనిమ్మ। బాధింపకుతాలగుముసతి॥ చాలు॥

మ॥ వనితా కాలముగాదు తాళుమనుచున్ వారింపగానామె నే
మనజాలన్ కుసుమాస్త్రమార్గణతతిన్ మారాడకుండుంచు నా
తని దా కౌగిట బిగ్గనొత్తగను కాంతా నీహితంబేమి నే
యను కానిమ్మని కశ్యపుండు సతికామ్యంబప్పుడే దీర్చినన్.

వచ॥ దితిసద్యోగర్భంబున నిరువురు కుమారు లుదయించిరి వారింగాంచి కశ్యపుండ బాలా సవతియగు నదితి సంతానవతియగుట సహింపజాలక యీ కానికాలంబున నన్నుం గూడితివి గాన యీయిరువురును క్రూరాత్ములై జగద్విరోధు లగుదురు వీరల నాహరి వధింపంగలడన దితిశోకించి నాథా నాకిట్టి పుత్రుల గటాక్షింప న్యాయమాయన

నీత్వర యట్లు గావించినదే నేమిసేతు నైనను వీరియం దగ్రజుని కుమారుండు దేవవంద్యుండగు ననిన విని యామె సంతసించె.

కం॥ వారలకు కశ్యపుడు వే । డ్కరుపరచె దితినిగూడి ప్రేమంబున దా
నారయ హిరణ్యకశిపుడు । ధీరహిరణ్యాక్షుడంచు దివిరెత్తుగతిన్.

కం॥ వారలు వృద్ధినిగాంచుచు । క్రూరతమునివాసములను గూల్చుచు మునులన్
గేరియుగ్గాడిపరచుచు । ధీరతతో పెరిగిరంత ధీరుడనుజుడున్॥

వచ॥ దక్షప్రజాపతి దౌహిత్రుడగు హిరణ్యాక్షుండు నవయవ్వనంబున యమిత పరాక్రమాలంకారుండై దిక్పాలుల గారించుచు తనప్రతాపంబు వెలయింపందలంచి పశ్చిమ దిగీశుండగు వరుణునిం డాసి-

తోడి-రూపకం.

ప॥ వరుణదేవ నీతోనే । దుర మొనరింపగవచ్చితి॥ వరు॥

అ॥ శరసంధాన మొనర్పుము । సమరరంగమున నిలుపుము॥ వరు॥

చ॥ శరణని మ్రొక్కినవీడను । శౌర్యంబును చవిజూపక నా
కరములు కండూతింగొనె । గానరమ్ము రథమెక్కుము॥ వరు॥

2. సురలందర నిర్జించితి । సరినాకెట లేడరయగ
విరివిగ దిక్పాలుర సే । వింపగ మెలగంగలాడ

చ॥ దొరవటనాకీవొక్కట । మెరిగెదనీ బాహుబలము
పిరికితనంబిక విడువుము । బీరముచూపుమురమ్ము॥ వరు॥

ఆ॥ వె॥ అనిన వరుణుడనియె నసురరాజా నిన్ను
పోరులోన గెల్వ వారు లేరు
రాక్షసాంతకుడగు దక్షునితో బోరు
మొనరణము మున్నె మానుకొంటి.

మంజ—నినుబోలంగల వీరుండొక్కడె । నెగడు శ్రీహరియనంగ
రణమొనరింపగ నీ వయ్యెడకతి । రయమున నొప్పుచనంగ.

వచ॥ ఆతండిప్పుడు యజ్ఞవరాహ రూపంబున రసాతలంబందు నిలచి

యుండెనని యెఱిగించిన కనకాక్షు డుత్సాహంబున నరిగె నని యెఱి
గించిన పరీక్షిన్నృపాలుండు శుకయోగి కిట్లనియె-

ఆ॥ వె॥ శుకమునీంద్ర విఘ్నదుఃకతంబు లేకున్న
సృష్టి యేప వేల యెత్తువాని
కత నెఱుఁగఁ జేయు మతికుతుకంబగు
నాఁగ వానికాత డని యెనిట్లు.

వచ॥ స్వాయంభువుఁడను మనువు చిరకాలంబు రాజ్యంబుచేసి తపో
యజ్ఞాది నిర్వాహణంబున సత్యలోకంబునకుం జన చతురాననుండు
ప్రజాసృష్టి చేయుమని నియమించిన దేవా అంతయు జలమయంబు.
యెనేడ సృష్టిగావింతునన విధాత యిట్లనియె॥

చ॥ ధరణితలంబు కన్నమును తథ్యమునీరము గల్గునందు నా
హారికరుణారసంబున స్వయంబుగ భూమి జనించె నిష్టు నా
శరధిశయానుడే మరల సాగరముఁ భువి జేయు వాని స
చ్చరణములం దలంచిన విచారము లేదు నిజంబు పుత్రకా॥

ఆ॥ వె॥ అనుచు హరినుతించు యజ్ఞసంభవు నాసి
కాంతరంబునుండి యజ్ఞసృష్టి
యగుచు పద్మనాభు డావిర్భవంబుందె
ద్రెక్కిరమరులెల్ల ముక్తిగోరి॥

వచ॥ నాయజ్ఞవరాహంబు సంద్రంబు నింకించి భూమిని గల్పించి యది
మరల జలంబుల మునుంగకుండ కొమ్ము న న్నిల్పి రసాతలావాసంబు
చేసె నతనింగనులకై హిరణ్యాక్షుండు-

మంజ—భూమినిచాపగ జుట్టిసంద్రమున। ముంచి వేసెనంతటను
యామురారి గన్నించునతనితో। యాహవమొనరించెదను॥

వచ॥ అని యత్నించుచుండ నావరాహమూర్తియే యరుదెంచి యతని
మార్కొని సంగరంబాచరించి కొమ్ముతో నేత్రంబు వ్రచ్చి వధించె-

తే॥ గీ॥ అతని మేధస్సుపడుటచే నయ్యె మేది
నీయనంగ నిభూమి విజ్ఞేయవినుము
అట్టి స్వాయంభువాఖ్య మన్వంతరమున
నతనితనయను కర్దముండ నెడుమౌని॥

వచ॥ పరియించె నట్లన. కృతయుగంబున కర్దముండను ముని విష్ణుస్వం
గూర్చి ఘోరతపంబాచరింప నవ్వెన్నుండు ప్రసన్నుండై-

పాటు—త్రిపుట.

ప॥ మునికర్దమా। నేటికి చింత॥ ముని॥
అ॥ ఘనతపమునను। ఎనియించితివిక। ముని॥
చ॥ ధనములోకములో। దాసీజనములో
ఘనసౌధములో। వనులో తనయులో॥ ముని॥
2. నీవలెతపము ము। న్నెవ్వరొనరింపరు
దేవావళి నిను ను। తియించెదరుగ
చ॥ భావంబునని వే తల। పం దియిటులొనర్చినావో
వేవివరింపుముదీర్చెద। వేమతలంపబోకుమింక॥ ముని॥
ఆ॥ వె॥ అనినకర్దముండు యనియె నీపాదార
విందసేవనంబు విబుధసేవ్య
మైనజ్ఞానయోగ మరయంగఁగోరెద
నివియొసంగి బ్రోవవే రమేశ॥
మంజ—అనదామోదరుడనియె। మునివరా అటులెగాని వినుము
ఘనస్వాయంభువ మనువునీకు। తనతనయ దేవహూతి
2 నొసగి పెండ్లిగావించునాయమకు। నొగికుమారికలను
విశదంబుగ తొమ్మండ్రఁగాంచి పై। వినుమదంశమునను
3 నొకనందను కపిలాచార్యుండన సకలకలాత్మకుగ నెదు
ప్రకటాత్మార్థము వానిచె నెరిగి బ్రహ్మపదముగ నెదు॥
వచ॥ అని యెరింగించి హరి యంతర్ధానుండయ్యె నంత కొంతకాలంబు చన బ్రహ్మనందనుండగు స్వాయంభువ మనువు కులసతియగు శతరూపంగూడి తనయయగు దేవహూతింగొని కర్దమునివాసంబు సమీపించి యతిథిసత్కారంబులంది యిట్లనియె.
మా॥ అనఘా మత్సుత దేవహూతియును। కన్యారత్నముఁ బ్రేమ్మై గై
కొనగా నోచ్చెదీయ వాహమిటు। మాకున్ జ్ఞైపుట యొక్క మదీ
యమతుల్ గొంచు వరింపుడంచనిన। నయ్యా నాకు వైకుంఠుఁడ
ల్లన దెల్పెన్నిది యిట్టులే యనుచు। పెండ్లాడెన్ను భాశంభుడై॥

వచ॥ కర్దముండు తపోమహిమంబువలన విమానంబును సహస్రసంఖ్యా దాసీసంఘంబునుగల్పించి సతియగు దేవహూతింగలసి యిచ్ఛకొలంది పుణ్యస్థలంబులం దిరుగుచుండె.

ఆ॥ వె॥ కార్దమంబు యతని । కాంతగర్భంబున
జొచ్చి ప్రేమమయల । సుతలగల్గ
జేసె నంతపైని । శ్రీనివాసునియంశ
మునను కపిలమౌని । జనకుడయ్యె॥

వచ॥ అతండు దినదినప్రవర్ధమానుండగుచు బాల్యంబున నెవిరాగియయ్యె. వతడుతన్ను పుత్రీప్రేమంబుచే గనుతల్లిదండ్రుల నాలోకించియిట్లనియె.

జైకా—రూపకం.

ప॥ వినుడు తల్లిదండ్రులార । వివరించెద సర్వమునిదె ॥ విను ॥
అ॥ జననము మరణము దుఃఖ । సహితము సుఖయుతముగాదు ॥ విను ॥
చ॥ వనజనాభుభక్తిని భ । జనముసేయుట మేలయ్యొను
మునులు సురలు తరియించెదు । మూలమార్గ మికనరయుడు ॥ విను ॥
2. ఘోరదుఃఖసాగరము । సంసారము తరియింప లేము
నారాయణ భజనమనెడు । నౌక, నెక్కకున్న మనము
చ॥ తారక సాంఖ్యమ్ములదెస । నారసి గ్రహియించియవల
నారయవలె జన్మరహిత । మమనస్కంబను యోగము ॥ విను ॥

చ॥ మలమూత్రంబులు ప్రేగులున్నెముకలున్ మాంసంబు చర్మంబు కం
డలు చీముకా క్రిమిసంఘముంగలిగి హేయంబైన దేహంబుపై
తొలగన్బోని భ్రమణ వహింప జనునే దుర్వార ప్రేమంబువీ
డిలవంబేని హరింభజింపదగు తల్లీ నీమదిన్నమ్ముమా॥

వచ॥ జీవుండు దేహధారియై యనేక కార్యంబులాచరించు నవి పాపపుణ్య భేదంబులచే నొప్పారు మహాపాపకర్ముండు ముహూర్తత్రియ కాలంబును సామాన్య పాపుండు ద్విముహూర్త కాలంబును యమయాత న లనుభవించి తిరిగి శరీరధారులై మాతృగర్భంబుల మెలంగుచుందురు. అదియెట్లన! పురుష రేతో సంబంధియై వధూగర్భగోళంబు జొచ్చి తొలిరాత్రి గలలంబగు నైదుదినంబుల బుద్బుదంబగు పదిదినంబులకు

పిండంబగు, ఒక్క నెలకు మస్తకం బేర్పడును. రెండు నెలలకు చేతులు కాళ్ళేర్పడును. మూడు నెలలకు నఖరోమాస్థి చర్మంబులు గల్గును. నాలవ నెల సప్తధాతువులును, యైదవ నెల ఆకలి దప్పులును, ఆరవ నెల మావిచే గప్పంబడి తల్లికుక్షి దక్షిణభాగంబున మసలుచు మాతృభుక్తాన్నరసం బాస్వాదించి తృప్తిగనుచు నేడవ నెల గర్భనివాసిత క్రిమిభక్షిత శరీరుండై యుండుండజాలక వెలికరుదేర నేరక భగవంతుని ప్రార్థించుచుండును. పిమ్మట నెలలు తొమ్మిది గడచిన మూత్రద్వారంబున జనించి గర్భంబునందున్న స్మృతిలేక పాపంబు లాచరించును. సర్వదా తవస్మరణ చేయుచు దినములుబుత్తును రక్షింపుము యీ చెరనుండి వెడలింపుమని భగవంతుని ప్రార్థించిన దంతయును మరచి యిహసుఖంబులమరిగి, కన్నుమిన్నెరుంగక చరించి కొంతకాలంబునకు మరణించి మరలజన్మించును.

మంజ—గాన ఇట్టిదేహంబులందాశ । మాని హరిని దలపోసి
మానితమోక్షార్థంబగుజ్ఞానము । పూనియెరుగవలెజూసి॥

తే॥ గీ॥ పంచభూతమయంబు । ప్రపంచమందు
దేహమందునభ్రమ । వీడి దివ్యమోక్ష
రాజ్యవాసము గావింప । రహినిచెల్లు
నీశరీరంబు పాప । పంకిలము నిజము॥

ఆ॥ వె॥ కామక్రోధ లోభ । ఘనమోహ మదమత్స
రంబులనెడు వైరిరాజవర్గ
ములను యుజ్జగించి మోక్షసిద్ధికిని సం
కల్పమును జయించగాన గునిక॥

వచ॥ అనియెరింగించి కపిలుండు తల్లియనుజ్ఞంబొంది యోగమార్గంబు నెల్లర కెరింగింపుచు నెందేనింజనియె. నాదేవహూతియు కపిలోక్తజ్ఞాన మార్గంబాలించి హరియందు లీనంబయ్యె నీకపిలదేవహూతి సంవాదంబను యితిహాసం బాలించిన గోవిందు చరణారవిందంబులం గాంతురని శుకుండు పరీక్షన్మహారాజున కెరింగించెనన్నది. శ్రీమహాభాగవతంబున తృతీయ స్కంధము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



శ్రీరస్తు—అవిఘ్నమస్తు.

శ్రీగురుపరబ్రహ్మణేనమః.

# శ్రీ కృష్ణ భాగవతము.

## (హరికథ) చతుర్థస్కంధము

———:౦.———

### 3. పార్వతీపరిణయము.

మంజ—స్వాయంభువమను వాత్మజలం దొక వనితను దక్షునకిచ్చెఁ
శ్రేయంబెసఁగ నోకిదంపతుల చిత్తమలర దీవించెఁ.

తే॥ గీ॥ అవలదక్షుఁడు మనుసుతవలనఁ బ్రసూతి
వలనఁ బదియార్వురు సుతలఁ బడసెవారి
యందు పదమువ్వుర నొసంగె నాస్తధర్మ
నకును నొకకాంత నగ్నికి నాతిఁజేసె।

వచ॥ యొకర్తును పితృదేవతలకును మరియొకర్తు నీశ్వరునకునిచ్చె.

ఉ॥ ఎంతయు బ్రేమఁబడిన్వలచె నీశ్వరుఁడార్య సుతుండు భ్రాంతి
కాంతుని పొత్రినిన్నతిగ గాఢతఁబోరతి వెండికొండపై
కొంతసుఖంబు గాఁగడిపె కొన్నిదినంబులు దక్షుఁడొక్కెడన్
గాంతమటంచు రాహరుఁడు గాఢతఁబాబు నొనర్చుచుండుటన్.

వచ॥ ప్రచేతసకుమారుండగు దక్షుని గౌరవింపమి నతండు రోషాకలిత హృదయుండై—

ముఖారి—రూపకం.

ప॥ తెలిసెబో నీనిగర్వము । తెరగుసాంగముగనాకు॥ తెలి॥

అ॥ యిలపైదానొక ఘనుఁడని । యెంచుటపొగరెక్కనేమొ॥ తెలి॥

శహానా—చాపుతాళము.

నాధావినుమా। ననుపయనించుమా। నాథా॥

అ॥ వేధవినుత నా। విన్నపమురయుమా। నాథా॥

1 నాజనకుడు నవ। నము జేసెనటనట
వేజనుదివ్యులు యోగింపరిప్రియ। నాథా।

2 మనమరిగింతు నా। ముఖముచుగని వసి
చనుచెంతను నీ। చనువునతోశక్తి। నాథా।

మంజ—అని వేడిన భవుడని యె నాకంతో యంగనరో యివితగను
జనకుండైనను పిలువని యెడనవు జనగా మోసముగలదు

2 నావిని దాక్షాయణి యనె నో ప్రియ నాథా యట్టులేలా
నావేగంబుగ వచ్చెనునిన నా। యభవుడవి యెగుణశీలా॥

కం॥ పిలువని పేరంటమునకు। నలడేగగ నందునేమి వచ్చుటహీనం
బు లలన నీవే గంగను। దలచిన నీయిష్టమనిన తిరుణి యిటులనున్॥

తే॥ గీ॥ దంద్రుడు లోకరించుజన్నంబు తనయపూడ
దగదె గాన నేనేగక తప్పదింక
శలవు దయచేశిపంపుడి చని గని యిట
కేగుదెంచెద చెలియండ్రడ హితలసుతుల॥

వచ॥ అనిన శంకరుం డబలా నీకట నమర్యాదగలుగును మానవతివగు
నీనా యవమానంబు భరింపజాల వందువలన నెపదుపోడదుక మా
నదు. నీవంగరిగిన యీశరీరంబుతో మరల నన్నుం జూడజాలవని
తెల్పినను వినక దాక్షాయణి దక్షుజన్నంబు విలోకింప నయ్యాజ్ఞ
శాలకుంజనిన-

సీ॥ వచ్చువారలకర్ఘ్య పాద్యంబులిచ్చెడు పరిచారికలును యాపలికరిగిరి
యాజ్యంబువహ్నికి నర్పించుదిక్పాలు రవనికిశిరములు నంటవంచి
చెల్లెంద్రుకంట వీక్షించి దౌదవ్వల తొలగిరికోప మూర్ఛలులగించి
కన్నకూతురుగదా యన్న కనికర మేని గాంచకతల్లియు గడకుతొలిగె
ఎంతసేపున్న నెవ్వరు నేమియనుచు
నేనిబలుకరు విప్రులు గానిదక్షు

పురోహితుల యమపురవాసులం గావించి దిక్పాలురదిక్కులకు జో
దోలి రాజబంధుగుల రణంబున వధించి, నతిథుల నడంచి గంధర్వు
లగాఱించి, యక్షులశిక్షించి, సురల బరిమార్చి-

మంజ—కరవాలంబు ధరించి దక్షుతలదఱిగి హోమమునవైచి
ధరణినిపీనుగు పెంటజేసి క్రోధంబుదీరకను నార్చి.

వచ॥ వీరవిహారంబు గావింపుచుండ బ్రహ్మవిష్ణులు నారదువలన గతం
బాలించి శంకరునకడకు-

ఘంటారావ—దశాద్రశతి.

ప॥ హరహరపురహర శంకర। యడిగిచాపకరక్షీర॥ హర॥

అ॥ దురితదమన వృషభగమన। తోయజారిశిఖర శిరవర। హర॥

1 లోకపాల కరుణాలోల। నీకన్నను దిక్కేకీ
తేకువనీ వీరభద్రుడు। తేజము సహియింపలేము॥ హర॥

తే॥ గీ॥ అనుచుప్రార్థింప సురలకు నాదిదేవు
డనియె లోకంబురక్షించు పనియెనా క
వశ్యమట్టుగాన వెరువగా వలదటంచు
వీరభద్రునివారించి చేరెదరికి।

వచ॥ పిమ్మట నిలింపాది దిక్పాలురం గరుణించి పేరోల్పిన ప్రసూతి
శంకరుం జేరి-

మ॥ అనఘా సర్వచరాచరంబులు త్వదీయాజ్ఞను బద్ధంబులై
దనరుఁ బోవగ మ్రొందజేయు శివచేతఃప్రీతి మన్నాథు గ
ర్వనితాంతు స్మరిమార్చియాగమును విధ్వస్తంబుగావించి తై
నను నాకుంకుమబొట్టు నిల్పగదె దీనన్భక్త సంరక్షణా॥

తే॥ గీ॥ అనుచువేడు ప్రసూతికిట్లనియెగర్వ
మెంతవానికేనియు చెల్లదింక నీవు
కోరినట్టులు జేయ నీ క్రూరుశిరము
హోమమున భస్మమయ్యెగా కేమిసేతు॥

వచ: కానిమ్మని వీరభద్రునింజూచి కుమారా తూర్పుతలనిడి నిమరిం చుట పాపాకరంబు గాన యోజీవియె నట్లున్న తత్తలం ఖండించి తెమ్మన నతండొక నొజీయుతలం దెచ్చిన-

మంజ—హరుడదివక్షుని మొండెమునకు దగ నతుకంజేసి యూపైని చరియింపుము తలనెత్తకనీక్గన। ధరణీస్థలిపైని॥

తే॥ గీ: అని వరంబిడి నామతిం బంపనిన్ను యెల్లవారలుప్రాణంతు లింకపుడమి వీరభద్రియటంచని వెలదిలేని నాకు తపమొక్కటే శరణ్యంబటంచు।

వచ॥ తపంబొనరింప దారుకావనంబను కాంతారంబున కరిగె నద్దాక్షా యణి యల్లు చితింగూలి మరణించి పునర్జన్మంబున హిమవంతుం డను పర్వతరాజునకును మేనకయను యప్సరసాంగనకును జనించె. పర్వత నందనియగుట పార్వతియనియు హిమవంతుని తనయయగుట హైమవతి యనియు బేరులం శుక్లపక్ష చంద్రకరుంబోలి పెరుగు చుండె—

సురటి—రూపకం.

ప॥ (శ్రీ)పార్వతి యొనరించెను। చిన్నతనపు పనులువినుడు॥ (శ్రీ)॥
అ॥ కోపంబరయ దొకించుక। గూడుతోడి బాలికలను॥ (శ్రీ)॥
చ॥ ప్రాపుగబొమ్మలపెండ్లిం। డలిశయ ప్రేముడిసల్పును యేపగుదా గురుమూతలు। దాపచ్చీసులనాడు॥ శ్రీ॥
2 చెలులతోవియ్యాలంబును। చిరుతపాటలన్పాడు అలిబిలి యచ్చెనగాయల। నాటలయందెవ్వారీడు
చ॥ పొలయలు కంబవ్వళించు తలిదండ్రిదుల గలంచు కిలకిల నవ్వుచు లేచు కీజ్జెడముద్దుగ వైచు॥ (శ్రీ)పా॥

తే॥ గీ॥ పార్వతీ సతిబాల్యంబు వదలిజవ్వ నంబొకించుక పొడసూపినంత కేళి

కావనంబున విహరింప గాంచి నార
దుండు. శంకరు నెరిగించె నిండుభక్తి।

మంజ॥ అంతటుతనకాభవుడే ధవుడని యాపార్వతి దలంచి
మంతనమున నాతని భజియింపుచు మాతాపితలంగాంచి॥

వచ॥ నాకాపురారింగూర్చి తపంబాచరింప కౌతుకంబయ్యె నానతీయవని యెట్టకేలకు సమ్మతింపంజేసి కాంతారంబున నొక పవిత్రస్థలంబునం దపమాచరింపుచున్నంత

తే॥ గీ॥ శంకరుడు పాపజన వినాశంకరుండు
తపమొనర్చుట దుష్టు లుద్దండులగుచు
సురల మునులను బాధింప జొచ్చినంత
దివిజులా హరిజేరి ప్రార్థించి రిట్లు॥

సావేరి — చతురశ్ర తి.

ప॥ సురముని వందిత। పరమ దయాకర॥ సుర॥
అ॥ కరుణింపుము మము। శరణాగతులము॥ సుర॥

1. భూసతి భారం। బును భరియింపమి
మీసన్నిధి కేతేరెను। యిదిగోకను॥ సుర॥

2. దుష్టుల బారికి। తాలగలేము మా
కష్టము లడపగ। గతినీవేగద। సుర॥

తే॥ గీ॥ అనుచు ప్రార్థింప శంకరు డధములడచ
యింపక తపంబొనర్ప జనించె నిట్లు
యని తలంచి వారల చింతలను దొలంగ
జేసి హరిమది యోచన జేసెనిట్లు॥

వచ॥ శంకరునకు కామంబు ఘటింపకున్న తపోవిఘ్నంబు గలుగదు. తపోవిఘ్నమైనగాని పార్వతీ పరిణయంబు గాదు. సతిలభించినగాని కర్తవ్యంబు నిర్వర్తింపదుగాన, ముందు హరునకు కామము గల్గింప వలయునని తలంచి, కుమారుండగు మారుంజేరి॥

వచ॥ అని ప్రార్థించు నామెతో బ్రహ్మాదిదేవతలును, దేవా కాముండు లేనిచో లోకము నశింపదా! రక్షింపుమన శంకరుండో రతీదేవీ నీకు నీమగండు కోరినప్పుడే యనుభవింతువు గానియెల్లరకు ననంగుండై చరింపగలడు. ముందు యీవిష్ణుని కృష్ణావతారంబున రుక్మిణీదేవికి కుమారుండై జనింపంగల డికపొమ్మని దీవించిపంపి దామోదరునను మతంబున తపంబు చాలించి హైమవతి తపంబు తెరంగెరింగి యామె మనోనిశ్చయం బెరుఁగంగోరి-

మంజ— వృద్ధభూమి సురుసూపంబున నావెలది సమీపము జేర
శ్రద్ధనామె చెలికత్తెలునతుల౯ సల్పిరి కోరికలూర
2. వారలకా కైతవ విప్రుండిన పార్వతినింజూపి
యీరామామణి యెవ్వరు యింతతపమేలజేయు శ్రీమకోపీ!

చ॥ జలజభవాన్వయా వినుము సర్వనగాధిపు ప్రీతిమేనకా
లలనకు పార్వతీయభిఖ్య రంజిల బుట్టిన పట్టిశంకరు౯
చెలువునిగా గ్రహింప వనిచేరి తపంబొనరించు నీమె కో
ర్కెలు ఫలియించునో వితయొ ప్రేముడి మాకెరిగింపుడీ త్వరి౯॥

కం॥ అనునయ్యెడ పార్వతి తన। కనుదెరచినమస్కరించి కరములపద మ
ర్ధన గావింపుచునని పావన। చరితా తమయభిజ్ఞ పల్కుడు వినగ౯॥

వచ॥ అనిన మాయాభూసురుండు చిరునగవున బాలా నేనొక తాపసిని నీవు పార్వతియనియు, నీశ్వరు వరించిశివనియు, నీచెలు లెరిగించిరిది నిక్కువంబే యన-

మ॥ అనఘా తామెరుగంగరాని విధమొందెనం జగంబందు లే
దనగా నియ్యది యెంతనావలన సత్యంబాలకింపంగ గో
రిన యట్లై వినుడుల్లమందు హరుసంప్రీతి౯ మనోనాధు గా
గని తద్దర్శన భాగ్యమంద తపము౯ గావింతు నశ్రాంతము౯॥

వచ॥ అను పార్వతి వచనంబులకు నవ్వి శంకరు డిట్లనియె—

మంజ—చురచురజూచుచు తెలిసెనయ్యెను నిక। నరుగుదు మీవాని
మరిమాటాడక నిలువక మంబిమీ। మాన ప్రాణములు నోరి

2. అనుచు నరుగ నుంకింపగ బాలా। యతనుకు వేధించు
మనజాలను నీకౌగిట సను పే। మంబున లాలించు॥

తే॥ గీ॥ మని కపటభూసురుడు పార్వతిని కరంబు
పట్టి కౌగిట దార్చె ము క్తిసంత
పర్వతాత్మజ వికసించి పరవిమాన
భూసురుడు మారెపన్నగ భూషణుడుగ॥

వచ॥ పార్వతీదేవి అంజలి మోడ్చి—

[illegible]—త్రిశ్రగతి.

ప॥ జయజయ శంకర। శివమనవ శంకర
అ॥ జయజయ దురితా। పయనా శంకర ।జయ॥

1. తవదర్శనముకై। తప మొనరించితి
భవనాజన్మము। పావనంబయ్యెను ।జయ।

వచ॥ అని ప్రార్థించు పార్వతిని దనయక్కున జేర్చుకొని భక్తజనవశంకరుండు విదా! నీ తలిదండ్రుల వలన నిను బరిగ్రహించెద గాని చోరత్వమేల నిక తపంబుడిగి నిలయంబున కరుగుము. యని యనిపి పుచ్చి నారదాదిమునుల పెండ్లిరాయబార మంపిన వారిఁగని హిమవంతుడు—

జేగత—చతురశ్రగతి.

ప॥ ఎట్టులిత్తును। తనయా నాబూచికాని ॥కెట్టు॥
అ॥ పెట్టసొమ్ములేదు। గట్టబట్టలేదు ॥యెట్టు॥
మి॥ పట్టెనియా శంకరునకు గట్టుటయా యెల్లరునను దిట్టుటయా
బళిబళిముని జెట్టులార యెట్టులాడిరిట్టుల ॥యెట్టు॥

2. లేకలేక గల్గినయీ లేమపార్వతి
చీకాకులేక పెం। చిన ముదవతి

మి॥ శోకమునా సాక్ష్యము గనలేకగనా। మశేసంబున యస్తోకత నా
శంకింపగ నిలుచు గాని వాలకీమి న్యాయ॥

తే. గీ॥ అదియవమానజాల కయ్యగ్నికములు
వాక్షాసను రేగించి కలిసె యతి
దారసామంబు కొరగాని సహానుమాన
సం ఘటించని హిమవంతుచకనె నిటు

వచ. నీకుమారియగు నాత్మజాత పూర్వజన్మంబున శంకరుని దారయగు దాక్షాయణీదేవి పితృయాగంబున నశించి నిచిరపుణ్య ప్రాభవంబున నీకుమార్తెయై జనియించెను. గాన, నా యమనయ్యాఘునకుగూర్చి ధన్యాత్మలై మాయెల్లర సన్నుతులందుము. కాదేని మదీయ వజ్రాయుధంబే గలదని హిమవంతుండు వెరచి యీశ్వరుని రావించి సకల దేవముని ప్రకాండంబు నెదుట సాలంకృత కన్యాదానంబు గావించె।

మంజ—స్వాయంభువుమను వంశంబాదున జననంబందెను ఘనుడు
శ్రీయుతుండు యుత్తాన పాదుడన చెలువారు నతండు
2. అవనిపాలుని సతులిద్దరు గల రధిక సౌందర్యవతులు
దీనావనులు జ్వలగుణ తేజోధిక నిధిములు॥

వచ॥ సునీతియు, సురుచియను నామంబుల చెలంగువారు నరపాలుండు సురుచియందు బద్ధానురాగుండై ధరా పాలనంబాచరింపుచుండ సునీతికి ధ్రువుండును, సురుచికి యుత్తముండునను కుమారులు జనించిరి. నృపతి చిన్నభార్య కుమారుండగు నుత్తముని యంకతంబునం గూర్చుండబెట్టుకొని సురుచీ నిలయంబునందుండ—

తే॥ గీ॥ ధ్రువుడు యుత్తానపాదుని దవులకరిగి
అనుజునింబలె తన తొడనధివసించ
నెంచిన ధరిత్రి పాలుడగ్గించి కరము
పట్టితివియుడు సురుచిదా భయము కతన॥

భైరవి—రూపకం.

ప॥ ఏర బాలకా తగుదని। యిట్లులు జనుదెంచితేర ॥ఏర॥

పెన్నెమ్ములుంగల ప్రదేశంబులం బాటి సాలతాలహింతాలాది తరు సమాకలితంబై కరాళకంటక శిలాభూయిష్ఠంబగు కాంతారంబునం జనుచున్న ధ్రువునకు త్రిలోకసంచారియగు నారదుండెదురై —

యమునాకల్యాణి — త్రిశ్రగతి.

ప॥ బాలకా ఎవ్వరివి ॥బాల॥

అ॥ ఏల యిట్లు । చనుదెంచితివి ॥బాల॥

1. నివయసున యేమికాన । నావాసంబది యేడ
నీవిటు రానని యేమి । నిజమువివరించుము ॥బాల॥

2. జననీజనకులు లేరా । చనునె యిట్లు నినుపిడక
గానకొని యెందరగుదురో । వినచెప్పుము మరచియ్యోకు ॥బాల॥

చ॥ అనుకలహాశనుండని దయార్ద్రస్వాంత ధ్రువుండుపేరు మ
జ్జనకుడు ధీరుడున్నుగుణ నాంద్మరియు యుత్తమపాదుడేను యా
తనిదరిజేరి యంకమున తమ్మునితో సముండె నెంచ హా
మ్మని మెడబట్టిగెంటె చినమాత తపంబొనరింప నేగెదన్॥

మంజ — అనుబాలుని వచనంబు కెంతయు నలరియిట్టులనియెన్
నినుమెచ్చితి హరినార్చితపము మానితముగజేయుహొమ్మనియెన్

2 నారాయణ యష్టాక్షరిమంత్రము నారదుడాతని కొసగెన్
కోరి హరిని మది ఘోరతరంబుగ కుంభిని తపమునవమునిగెన్॥

వచ॥ పెద్దకాలంబు మధువనంబునం దపంబాచరింప నత్తపోవేడిమి నింద్ర లోకంబు దహింపనుండ శక్రాది దివిజులాతని తపోవిఘ్నమాచరింప యత్నించి వశంబుగామి వైకుంఠుని దరిం జేరి —

వసంత — త్రిశ్రగతి.

ప॥ కరుణగనుము శౌరీ । గిరిధారీ మురవైరీ ॥కరు॥

అ॥ సురవరకిన్నర వినుతా । సుజనావన మునిలాలన ॥కరు॥

1 దీనదయా కరుణాకర । దిక్కెవ్వరిక వేర
నీనెనరిపుడున్న చాలు । నీబాధను దలగగలము ॥కరు॥

ఆ॥ వె॥ అనుచు ధృవుఁడతి తపమునం గష్ట బాధలు
నెరుగఁ జేయమీర లరుగుదేను
తపము మాన్పెదంచు దామోదరుఁడు బాలు
నెదుటనిల్చి కరుణ నిట్టులనియె॥

కం॥ చిరుత తనంబున తప మిా। కరణిని గావించి మెప్పుం గంటివిబళి యే
వరమైన గోరుమిచ్చెద। నరవరసుత నాగ ధృవుఁడు నారాయణుతో॥

చ॥ జనకుని యంక వాసమెటు సాధ్యమునాకు జపింపకున్న నీ
కనిపిన తల్లి గెంటిన మహాత్మ్యయిటుల్ చనుదెంచి మిమ్ము గాం
చిన పయితుచ్ఛభోగముల నేగనుకోర్కె. నటించె మోక్ష ప
ట్టన వసితున్న నన్నరప్ప గరుడధ్వజ మాత్రె నెరణ్యాత్తినాప్రభూ॥

వచ॥ నారాయణుండలరి డింభకా! నీవలెయింత ఘోరతపంబున నన్నల
రించినవారు యిాపరకు లేరు. ముందుంగలుగబోవరు. నీకోర్కె
కానందించితిని నీతండ్రి నీయందలి ప్రేమంబున నెమకుచు వచ్చు
చున్నాఁడు గానపురంబునకరిగి పెద్దకాలంబు ధరాపాలనంబాచరించి
యిరువది వేలేండ్లు చన నక్షత్రమండలంబు పైనున్న మండలంబధివసించి
యద్దానిం ధృవమండలంబని ప్రకాశింపఁజేయుము యని యాశీర్వ
దించి హరి యంతర్ధానుండయ్యె—

తే॥ గీ॥ అంతనుత్తాన పాదుఁడు యింతులతో ఘ
నాటవికి బాలుకై వచ్చి తనయునిగాంచి
ప్రేముడిని ముద్దులాడి దీవించి పురికి
తోడుకొనిపోయె యెల్లర వేడుకలర॥

మంజ—పదపడి ధృవుఁడా రాజ్యంబున పట్టభద్రుఁడై చెలగి
ముదమున పాలించుచు భూజనముని జనుతుఁడై మెలగి॥

వచ॥ కాలాంతమ్మున ధృవమండలంబుఁ జెందె—

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు—అవిఘ్నమస్తు.
శ్రీ పరాత్పర బ్రహ్మణే నమః.

# శ్రీ కృష్ణ భాగవతము.

## (హరికథ) పంచమ స్కంధము

—————:o.—————

### 4. భరతోపాఖ్యానము.

ఉ॥ అంగదనామ భూవరుడు యజ్ఞమొనర్చి కనెన్ సుమాంగ దు
స్సంగుని దీర్ఘకోపుని నిశాట హితుంబర భంగకారు న
న్యాంగనమానహానికరు నార్యవిదూరుని దుష్టచిత్తు చా
ర్వాంగమ దేవమాన్యుని త్రిపాకరు నీచుని వేనునొక్కనిన్॥

వచ॥ అతని దుర్మార్గ కృత్యంబులు సద్భేదవలన మరలమి తద్విచారం
బున నతనిలే జవ్వనంబుననే అంగుండు డరణ్యవాసియయ్యె. నతని
నెడబాయజాలక సునీథయునడచె. నిక వేనుండే రాజై యిష్టోప
భోగంబుల దేలియాడుచుండ—

మంజ—జనులువాని దుండగముల నికపై సైపలేక గుమిగూడి
జననాయకుడగు వేనుని దరిసిచంపిరి దగనురుమాడి॥

గీ॥ యీ విధంబు సునీథయెరింగివచ్చి
పుత్రునికళేబరముదాచి పొగులుచున్న
రాజులేమినియెల్లరు ప్రబలకోప
యుతులై పోరొనర్చుచు నుండిరంత॥

వచ॥ లోకంబనేక యాపదల కాకరంబైన మునులు యంగదవంశం బుద్ధ
రింపందలంచి వేనునిబాహువులు మధింప నందునారాయణాంశంబున

వృషభుండును లక్ష్మి యుండెడు వక్షియును కాంతియు జనించి దంప
తులై ధరాపాలనం బొనరించుచుండిరి——

గీ॥ అంత కొన్నిదినంబుల కవనినాథ
వంతమునుపెడి కంటలు గంపకున్న
మోహపాశంబులేక వ్యాధులనొగిలి
మానిజనులు జనులుచున్నను వార్షికమొసర్చ॥

మంజ—వృషభనిర్గోపగతి గావించియు నిత్యక్రియములకు నొసగుల
వృషభుని బిడికె నతిసంబరమునమునుపి పితృమాతృలం బొదల
2 నంతకొంతకాలంబు సౌఖ్యగతి నవనితలమును నేలి
వింతైన పెంపంబుల విడిగి కడు పరితంబును దగనోలి॥

వచ॥ ఇది చతుర్థస్కంధము. ఇందు నొకకొన్ని మహావాలా భగవల్లీల లెఱుంగు
ట కష్టము. కాన కామంబులను జయించి ప్రేమనడంచిన తరించుట
సులభంబు ప్రేమంబొరంగజాలక భరతుండును మును పెక్కుజన్మములం
గాంచెనని. పరీక్షిత్తుండు——

మంజ—భరతుండెవ్వరు యోగివరులగనె పరమప్రేమ నొందుం చె
మగితుదకెట్టులు మోక్షముగనెనో జ్ఞానినాథ వివరించు॥

వచ॥ అన శుకుండిట్లనియె——

నవరోజు—ఆదితాళము.

ప॥ నజనాభంబను నగరము । త్రిజగంబుల ఘనతరము ॥నజ॥
అ॥ సుజనజనాకర్ణము కడు । శోభాకరమును దివ్యము ॥నజ॥
1 సురగురు నిరసించు విప్ర । వరులు వీరక్షత్రియులు
సరసులు విట్కులులు శూద్ర । లరయభక్తి తత్పరులు ॥నజ॥
2 పతిభక్తిని దేజరిల్లు । పడతులు సమ్మోదకరులు
సుతులు మాతృపితృసేవా । గతులు పొగడతరముగాదు ॥నజ॥

మంజ—ఆనగరము ఋషభుండను నొక నవనినాయకుడు యేలుక
మానితబుద్ధిని యనిశముగొల్చుచు మాకాంతా హృదయలోలుక॥

సీ. ఆఋషభ భూమిపాలకు నాత్మజుండు
భరతుడనువాడు విశ్వరూపుని సుతను
పంచజనినామ కామిని వలచి రాజ్య
మేలె జనకునివలెనె ప్రోత్సాహపడిని।

వచ॥ భరతుండు పాలించుటచే తన భారతదేశంబన బరగె. నట్లు పెద్ద కాలంబు కాభరతుండు పంచజనీనామ కామినియందు సుమతి రాష్ట్రభృత్ సుదర్శనావరణ ధూమ్రకేతులను నల్వురు కొమరులంగాంచె-

మ॥ చిరకాలంబు ధరిత్రి నేలి పరమున్ చింతించి పుత్రాళి కు
ద్వర సర్వంబును నొప్పగించి మదిలో లక్ష్మీశు గీలించి భో
గరమున్వీడి యరణ్యమధ్యమున సత్కాసార తీరంబునన్
గురు గాంభీర్య తపంబొనర్చె మునులున్ గోవాసులు న్మెచ్చగన్॥

వచ॥ పులహాశ్రమంబున తపంబాచరించు భరతుండు యొకనాడు కుతప కాలంబున—

మంజ—యమునానదిలో మున్గిసూర్యునకు యర్ఘ్యమిచ్చుచుండ
యమిత దాహమున నిండుమాలుగల హరిణి యాభరతుడుండ॥

చం॥ జలములు ద్రావుచున్నతరి చండభయంకరలీల వ్యాఘ్రి కే
కలిడ భయంబునంది వడిగా పరువెత్తుచు గర్భవేద నా
జలమున భూమిపైబడి వివస్వత సూనుపురంబు జేర నం
తలో హరి పాపయాభరత తాపసిగాంచ జనించెదానికిన్॥

వచ॥ యచ్చిరుత కురంగము నాభరతుండు గాంచి—

కేదారగౌళ—రూపకం.

ప॥ దైవవిధిని మీరదరమె। ధారుణి యెవ్వారికైన ॥దైవ॥
అ॥ యీవిధిహతమాతయైన। యీహరిణార్భకమే గాక ॥దైవ॥
1. కనులుతెరువదింక బాల। తినజాలదు యాహారము
జననికింబాసెను యికనే। చాయబ్రదుక గలదో గద ॥దైవ॥
2 క్రూరమృగంబులు కన్న। గుట్టి దీనినిం చంపవె
యేరీతింజనదు దీని। నిందె విడచి మందబుద్ధి ॥దైవ॥

గీ॥ అనుచు తలపోసి పిక్కటేనట్టిగాని
కాశ్రయ మొసంగి పాలింపయుట పుణ్య
కరముగా నెంచి ప్రేమనా హరిణ శాబ
కంబుఁగొని తనదు నిలయంబుఁ జేరె।

సీ॥ సాటిఋషుల పర్ణశాలలో వెచ్చి గోక్షీరములుపోసి కొన్నినాళ్ళు
నూసరధాన్యంబుచే సరిగా వండి యన్నంబు పిసికించి కొన్నినాళ్ళు
కాసారములదరిగల పచ్చికంగోసి కొనివచ్చి మెసవించి కొన్నినాళ్ళు
అలఘుశాకాహారములు రుచ్యములుగ గొని తెచ్చి యిచ్చుచు కొన్నినాళ్లు

గీ॥ యిటులు హరిణార్భకవు పోషణేచ్ఛ నవలి
తపమొనర్పక గనుమూయు తఱినిహారిర
మృగములరుదెంచి దీనిని మృత్యువాత
వైచునని తపముచుమాని భరతుడంత।

వచ॥ నాహరిణపోతమ్మును భరతునిపై నెక్కి త్రొక్కుచు యారవైచిన
యతని వస్త్రంబులంటించుచు పర్ణశాలలో గంతులిడుచు పెద్దదియై
యొకనాడు భరతుని కనుమొరగి యెందేనింజన దానింగానమి నతం
డమిత చింతనంది—

నాదనామక్రియ—చతురశ్రగతి.

ప॥ హాముద్దు హరిణము। అకటా యెందేగితివె ॥హా॥
అ॥ యేమృగమైనను। హింసించెనేకట ॥హా॥
1 తల్లి యెడబాసిన। దాదినిను బెంచితి
యుల్లము దెట్టులు। యొప్పె నన్నెడబాయ ॥హా॥

గీ॥ ఇట్లు విలపించుచడవిలో నెంతయొ శ్రమ
కోర్చి వెదకి కనుంగొని యొగిని ముద్దు
లాడుచు నిలయముం జేర్చుగూడు బెట్టు
నిటులభరతుని బెదిరించు నటుహరిణము॥

వచ॥ తపోవిహీనుండై కురంగ దత్తచిత్తుండై వర్తించు నాభరతునకు
యవసానకాలంబాసన్నంబైన—

రటులగావించి వారిమ్ముచట్టి కలిసెయు
గంజెయోదార్చి కాలంబు గడుప్రచుండె॥

వచ॥ వృషభంబుంబోలి చరింపుచు పైచీరగప్పక రజోపటలమ్మొన గప్పంబడిన దివ్యమాణిక్యమట్లు కనుపడవి బ్రహ్మవర్చసుండై మలి నాంబరమషీలిప్త యజ్ఞోపవీతుడంగుట బ్రాహ్మణాభాసుండుగా కుల జులు పాటించిరి. సవతితల్లి బిడ్డలు భరతుని వ్యవసాయంబునకు గ డంగంజేసి నూక, తవుడు, పొట్టుమాడుతబ్బెడలం బెట్టినను యమృ తోపమానంబుగా దలంచి భుజించుచు కాలమునం గాపున్న యొక నొక్కనాడు—

మంజ—కలడానగరంబున నృపలుండను నిలకేడుబలుండు
తలపమ్మట కార్యాచరణుండితి తామసుండుఖలుండు
2 సంతానార్థము కాళికాంబ నతిశయభక్తి భజించుచున్
చింతింపక నరబలి నొక్కొక్కడ చేయుచు సంతోషించున్॥

ఉ॥ ఆతడు నొక్కనాడుమది నంబనజింప దలంచి దేవికిన్
బ్రీతిగ నేడు మానవ బలిన్నొనరించెద తెండు యొక్కనిన్
పూతచరిత్రనంచు భటముఖ్యుల నంపగ మంచెనున్న న
వ్వ్రాత భయాత్ముడా భరతు వేగొనిపోయిరి రాజుపాలికిన్॥

వచ॥ ఆనృపలుండను నృపాలుండును సమాంత్రికంబుగా దేవినర్చించి అం జలింబట్టి—

భైరవిరాగం—త్రిశ్రగతి.

ప॥ శంభురాణి నీ। వే దిక్కుమాకు ॥శంభు॥

అ॥ శంబరారిజనకు। సాహ్లాదకిదేవి ॥శంభు॥

1 అంబదేవికరుణ। నాదరింపవే
కంబు కంఠిహేమ।గాత్రి సుచరిత్రి॥

మి॥ దంభములన్విడిచి ప। దంబులనున్ బట్టితి
జృంభణాతన్ సుతునిడగాన్। జూడవె కాపాడవె ॥శంభు॥

వచ॥ ఎనుబదినాల్గులక్షల జీవరాసులలో మానవజన్మంబు శ్రేష్ఠంబగుట యుత్తమంబు. పూర్వపుణ్యఫలంబునం గాని, అందును పురుషజన్మంబు లభింపదు. అట్టియెడ పాపంబులాచరించుచు పుట్టుచు గిట్టుచుండుటలు శ్రేయంబే. ప్రేమానుబంధవశంబున జన్మమ్ములు తప్పవని నా చరిత్రము తెల్పుచున్నది. గాన—

చ॥ అరయఁగ పంచభూతములయందము దేనికి కానుకోరిక ద
ష్కరమగునారు దుర్గుణవికారములు న్వెలువంచునైన ద
స్తరతరదార పుత్త్రులను సంపదమునందలి జంతుజాలము
న్కరుణవిడి పీకుచుండుకేడకర్ణ నకేయుండు జనించు వెండియున్॥

వచ॥ కావున యీసంసారసాగరం బీదుట నల్పమైక యోమనస్కయోగంబెరిగి తరింపుమని బోధించి యతని గడతేర్చి పంపి కొంతకాలంబున కా జ్ఞానయోగభరితుండగు భరతుండు దేహంబు వాసి హరినివాసంబు చేరెనని పరీక్షన్మహారాజునకు శుకయోగీంద్రుండెరింగించెనని శౌనకాదిమహర్షులకు సూతుండు దెల్పె. నిది శ్రీమహాభాగవతాంతర్గత పంచమస్కంధము—

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.





శ్రీరస్తు—అవిఘ్నమస్తు.

శ్రీమత్పరబ్రహ్మణే నమః.

# శ్రీ కృష్ణ భాగవతము.

## (హరికథ) సప్తమ స్కంధము

——:o.——

5 వృత్తాంతపరవర్త.

వచ॥ శౌనకాదులు సూతునింజూచి పరీక్షిన్మహారాజునకు శుకయోగీం
ద్రుడికేమి యెఱింగించెనన—సూతుండిట్లనియె—

మంజ—జననాయకవినుకన్యాకుబ్జంబను నగరంబొండు
దనరుదానిలో నజామిళుడను ధారుణీసురుండుండు॥

శహన—త్రిశ్రగతి.

ప॥ అజామిళునిచరితమువిను। నఖిలకలుష సంహారము ॥అజ॥

అ॥ త్రిజగంబులలేదుసాటి। ధీమహితా గుణభరితా ॥అజ॥

చ॥ అజవంశంబునబుట్టెను। యఖిలక్షేత్రములు మెట్టెను
సుజనుండను మినుముట్టెను। సుందరాంగిచేపట్టెను ॥యజ॥

2 వేదంబులవల్లించెను। విష్ణుశివులబూజించెను
బీదలసంరక్షించెను। పితృమాతల సేవించెను

చ॥ సాధువులంగలసిమోక్ష। సాధన లారంభించెను
మోదమ్మున శిష్యుల విద్యా। దైతుల గావించెను ॥యజ॥

సీ॥ ఆయజామిళు డొకపరి యయ్యకోర్కె
వనఫలంబులుదేర కానసముకరిగి

వచ్చువానెవ్వఁడో పూర్వపు మగఁడుకదో
నోకి తెరమియుంచు పటుగను నోక్కఁగడియు।

వచ॥ ఆస్త్రీ యిరువురు ప్రేమయుత సంగమమిాక్షించి మదనబాణవహ్ని
తప్తదేహాంత్రై యచ్చోటువిడిచిరాలేక పెద్దకాలం బచ్చటనిలచిన—

ఉ॥ ఆతనిగాంచిజారుడు భయంబున నింటికిఁజేరె ప్రాణసతి
పాతకిబోవనుండగని పాపజలప్లైవచు మారుకేళిలో
ప్రీతిగనేలుమంచమిత ప్రేలఁద్లై ప్రతిమాలనద్ది యూ
హా తగునాయిటుల్ గనగ నక్షులచెవ్వుబుములన్న నాతఁడున్।

ధన్యాసి—రూపకం.

ప॥ ఇటులనకుము నీవేగతి। యింకే మగుపోషించి ॥యిటు॥
అ॥ కటకటబ్రమకను నినువిడ। గాంచుము నచుకరుణతోడ ॥యిటు॥
1 నిచులసంపర్కంబిది! నీకేటికినను నిహడము
యోచిలుకలకొలికి నాకు। నన్నుసర్వమప్పించెద ॥నిటు॥
2 చాటుమాటములు పాపిణ। సంకేటములు నీవెరుగవె
యేటికి దంపతులభంగి। యిలనుందము ముదమాదుము ॥యిటు॥

గీ॥ అనుచుప్రార్థించజామిాఘు కనియెనీచ
వర్తనాంగన నినునేనుభర్తగతిని
స్వీకరింతును నన్నునీప్రేమసతిగ
నేలుదువెయన నతఁడొప్పె నిష్టమగుట॥

వచ॥ అంత నజామిాళుండా తెలికులాంగన దారగా నవ్వనియందే పర్ణ
శాల నిర్మించుకొని కాపురంబాచరించుచుండె—

సీ॥ కుసుమాస్త్రరణరంగగోష్ఠివర్తించుచుగురువేదవిదుల సద్గోష్ఠిమానె
లలనామణీమాన రతినినుండుటనుదా భవ్యనాటక కలాప్రౌఢిమానె
సతిచిత్తవృత్తిని సంచరించుటచేత దేవదేవాదులసేవమానె
అంగనాబద్ధచిత్తాబ్జుడైమెలగుట కులమతంబులజోలి తొలుతమానె
నీచకామిని సంపర్క నియతివలన
నీచవర్తన మలవడెనెత్తి పెట్టు

కొనుచునాకాశంబున గొల్చుకొనుచు కాపు
రంబుసల్పుచు నన్యకాలంబునందు।
సీ॥ కొడుకుపుత్రులు పదియుత్పత్తియగుజాడ
కొమరాండ్రెల్ల తనయులు వారికప్పుడు
బాపమిరంతుగ కడవానిపుత్రునైన కతి
ప్రేమనారాయణాయను పేరుబెట్టి।
మంజ—వారలపోషణ కజామిళుడు దారలుగొట్టుచును
క్రూరకర్మముల ధనమార్జించుచుకొంతకాలమీదగను॥
చ॥ మరణమునందుకాలము క్రమంబుగదాకొని రోగపీడలన్
దరుచున్నాఘలనిని సుతాదులపైనగలేక ప్రేముడిన్
చిరుతసుతున్దలంచి మరిచింతిలియాతని నామముల్లనన్
వరుసపఠింపుచున్ననుపు బాసె నజామిళుడంతలోపలన్॥
ద్విపద॥ యమదూతలరుదెంచి। యాతనిబట్టి
శమనులోకముజేర । జనగయత్నింప
2 కేశవుదూతలు కేరుచునటకు
భాసవిమానంబు పట్టితెచ్చియును
3 యమదూతలంగాంచి యనిరిమీరిట్లు
క్రిమమెవచ్చుటనొందు కడకనాన్ వారు॥
మ॥ వినుడీవిష్ణునిదూతలార యితడీ విశ్వంభరన్ పూజ్యమా
వన జాతానసువంశమందు జననంబై ప్రేమనాపుంశ్చలీ
తనయాళిన్నగి పోషణంబానరుపన్ దారుల్ నిరీక్షించి పాం
థనికాయంబునుజంపి పాపములచెందన్ మీకు రాజెల్లనే॥
గీ॥ గానవీనికృతాంతుని కాయమునకు
గొనిచనివచింపరాని విధినికతినపు
శిక్షలనుభవింపగ చేయచెల్లుగాని
విష్ణుమందిరముంజేర్చు విధముగలదె॥
కం॥ నావుడువిష్ణునిదూతలు। యేవిధమీతండు బ్రదికియేమొనరింపన్
జీవంబువీడునప్పుడు। భావించివచించె హరినిపాపము తలగన్॥

వచ॥ కావున విష్ణులోకంబు కానవచ్చును కాని యమయాతనాస్థానము కాదు. వదలుండన యమకింకరులు పాపాత్ముడీతడనిన్యాయము. జీవితంబంతయు పాపసంకులంబుగాగడపి మృత్యుగహ్వరంబునుండి హరిందలంచిన పాపంబెల్లనశించి వైకుంఠనివాసంబుచేయుటా? అడియును హరివలనిభక్తిగాక కుమారుని మమతచేతఁబిలచె నిట్టివానికా వైకుంఠము అని నడిగిననారాయణదూతలిట్లనిరి—

ఆనందభైరవి—త్రిశ్రగతి

ప॥ హరినామ స్మరణము విను। దఖిలకలుష సంహారము ॥హరి॥

అ॥ దురితాత్ముండైన నొక్క। పరిపిలచిన మోక్షకరము ॥హరి॥

1 భక్తినైన రక్తినైన। పరిహాసంబునవైన
శక్తినైన పుత్రమిత్రు। జాలనామమువినైన ॥హరి॥

2 బ్రతికినంత కాలమెంత। పాపసంఘ మొనరించిన
మృతివేళను హరినిదలుప ముక్తిలేపమోక్షమబ్బు ॥హరి॥

వచ॥ గానమీరీతిని విశదపరచిన వారలు మాపరేతపతియాన మీరాజాలము యితనివిడువ్రమనిన విష్ణుదూతలు యమకింకరుల దండింప వారతనివిడచి యమాలయంబునకేగి యంతకునకెరిగింప—

శా॥ ఘోరా మెంతటివింతవిష్ణునిభటుల్ యోసీమ వైకుంఠముఁ
జేరంగొంచరుగం దలంచిరెమముఁ శిక్షించిరే నారుషా
కారంబున్ వినరే పదుండనుచు పీక్షామాత్రి సిగ్గెన్న స
ర్వారాతివప్రిజుడై యజామిళు గృహాంబాస్త్రంజనెన్ నంతటన్॥

మంజ—యిట్టులరుదెంచియు విష్ణుదూతలను హింసింపగబూనన్
పటుశోకంబున వారునేగి యావాసుదేవునకు దెలుపన్॥

వచ॥ గరుడవాహనారూఢుండై ముకుందుండరుదెంచి—

గీ॥ దండధర నీమహాబల్య మండనంబు
నాకుజూపెదె మరణంబునందువేళ
నన్నుస్మరియించెగాన నీకెన్నడిటకు
వచ్చుటకువీలుగాదు పోవచ్చునింక॥

వచ. మున్ను మార్కండేయమహర్షిచేత శంకరుండు నీకేమెఱింగించె. హరిహరభక్తులపైన కినుకవలదనిగదా, మఱచితివే. యిప్పటికి క్షమియించితినిపొమ్మనియముం డమ్మహారికి నమస్కరించి సంయమనీపురంబేగె. నంత నజామిళాఖ్యుని దివ్యవిమానారూఢుం గావించి ముందు గరుడారూఢుండై హరి నడువ విష్ణుదూతలు వైకుంఠముం జేర్చిరి. యోపరీక్షిద్భూపాలా హరినామస్మరణకిన్న మిన్నయగు మోక్షార్థపదార్థంబు లేదింకొక యితిహాసంబాలించుము—

మంజ—మున్ను శూరసేనాఖ్యదేశమును । భూవరుండొక్కఁడేలుఁ
యెన్న చిత్రకేతుండను పేరున । యెల్లరి ప్రేమను జూచుఁ॥

ఉ॥ ఆనరనాయకాగ్రణికి యంగనలుండిరి కోటిమంది యా
చానలలోన నొక్క జలజాక్షికి నేనియు సంతు లేమి దుః
ఖానకృశించినుండి నరకంబు దొరంగెడు దాటఁగోరి సం
తానము కల్గినంగిరస తాపసిసేవ నొనర్చె భక్తితో॥
గీ॥ ఆమునీంద్రుఁడొక్క యాగంబు పుత్రకా
మేష్టినాగసల్పి మిష్టములరు
దనియఁగజేయ నాతఁడావిధిసల్పి
పాయసంబు సవనవహ్నిఁబడసె॥

వచ॥ దానిం దనప్రథమకళత్రంబగు కృతద్యుతికొసంగ నాయమభుజించి తత్ఫలంబుగ గర్భభారంబు వహించె—

సీ॥ అన్నమసహ్యమైయున్నపై భ్రమగల్గె నొకింతలుగడు నొప్పియుండె
బడలికమెండాయె పాలిండ్లుబిరుసెక్కె చూచుకంబులు నల్పుతోఁచెవెల్గె
జఘనంబుబరువయ్యె శ్వాసలుమెండయ్యె వళులుచూడగరాక పారిపోయె
నిద్దురమెండయ్యె నిలుచుండలేదయ్యె పిండివంటలమది మెండుగోరె
నారుగననయ్యె చెక్కులనంగ తెల్పు
కెక్కె మేనది పాలిపోయెను దినంబు
లొప్పుగానయ్యె నీవిధి లేమమాలు
బలసియొకమంచిదినమున ప్రసవమయ్యె॥

మంజ—కొమరుగనిరొ నతిసుకుమారుని కోమలగాత్రుని శశికిఁ
సమమగు తేజము నెసగువాని జయజయ ధ్యానంబులు చేరఁ ॥

వచ॥ చిత్రకేతుండు పుత్రోదయసంతసంబున ధనకనకవస్త్ర వాహనంబు
లవనీసురులకుం దానంబులాచరించి క్రమక్రమముగా జాతకర్మనామ
కరణ అన్నప్రాశనాదు లలరించి ప్రేమయుతంబుగా పెంచుచుండ,
కడమకాంతలందరొకచోఁ జేరి—

ధన్యాసి—త్రిపుట.

ప॥ వింటిరే చెలులారా మన। విభుని మనసు మారిపోయె" విం॥

అ॥ తుంటవిల్తు బారికిటులు। దుర్గుణమునల కంటచూడదు ॥విం॥

మిం॥ తంటకారిసవతియింట। తారులాడుటొకాక
వెంటబుడుతనిడుకొని పుని। పిషులరుగుటొపని ॥వింటి॥

2 బాలుడుద్భవింపకమును। పనుమెమితోడ మనల
నేలెనిప్పుడా మగువయ్యె ప్రేమపాత్రమయ్యెజూడుడి

మి॥ చాలుచాలువిభుని ప్రేమ। సంగ్రహింపకున్న బ్రతుకు
తెలజప్పనంబదేల। యేమొనర్తము యోచింపుడు ॥వింటి॥

చ॥ అననొక చంచలాక్షియనె నాతని ప్రేమ గడింపనెంచుచో
తనయునిచంపగావలె వృథాయతనంబుఫలంబు లేదు యా
తనిమది వానికై సవతి దండవసించెను వాడు లేమి య
వ్వనమునసించినట్టి సతిపంచను నిల్చునెభూమిపాలుడుఁ ॥

వచ॥ అన యీచకవిచారించి మెల్ల రందులకుసమ్మతించి విషంబుక్షీరం
బునంగల్పి యొసంగిన గ్రోలి బాలుండు మృతుండయ్యె నవార్త
నాలించి కన్నతల్లి—

నాదనామక్రియ—త్రిశ్రగతి.

ప॥ హామోహనాకార। అకటామృతినందితివే ॥హా॥

అ॥ ప్రేమవనధిమము। వెలార్చియింతలో ॥హా॥

1 లేకలేకగల్గిన సుతుడీవని। మాకన్నులనిను పెట్టిపెంచితిమి
ఆకాలుని కనుగుట్టైనెతనయా। అవనిపైని యెటులుందును ॥హా॥

రెను చెను కర్మదా కొనియె ప్రేమత్యజించి హతుఁడైతి నా
కని విలపింప నేమి ఫలమత్యధికంపు ఫలంబుగల్గునే।

మ॥ మరణంబే శరణంబు జీవులకు పేర్మిన్ స్వర్గముల్ నేను మెం
దరి గర్భంబుల బుట్టినానొ ధరణీనాథుండనై నిత్యంబె పో
తిరమె రాజ్యసుఖంబు శ్రీశ్వరుని భక్తింగొల్చి సన్మోక్ష రా
జ్యరమాలింగన సౌఖ్యమున్గనక యీ కాల్మజాని దుఃఖించునే।

వచ॥ అని మరణించిన నృపాలుండు శోకాంధకారంబును పుత్రశోషిత తేజంబున ఛేదించుకొని నారదునకు ప్రణామంబాచరించి దేవా! యింక నీ రాజ్యంబు లొల్లను హరిచరణ సమారాధన తెరంగెరిగింపు డన నారదుండు—

కే.ద—ఆదితాళము.

ప॥ పరమపావనము దురితహరణమును। హరిచరణారాధనము నృపాలా॥
అ॥ చిరమోక్షము శ్రీహరిమంత్రము। తెలియింపుము జపియించి నిశ్చలత॥ప॥
1 సురవర సేవ్యము నరకోత్తీర్ణము। నెరిగించెద నారాయణ కవచము॥ప

వచ॥ అని నారాయణ కవచంబను మంత్రం బుపదేశించి సప్తరాత్రంబులు జపించిన హరిదర్శనం బబ్బునని సురముని యరిగిన చిత్రకేతుండట్లు జపించి నారాయణదర్శనంబంది హరివలన విద్యాధరాధిపత్యంబును తలచినయెడ కరుగు శక్తియు వడసి సుఖంబుండెనంత—

మంజ—చిత్రకేతు నరపాలుండొకపరి। రజితగిరి కర్ధనరిగి
ఆ త్రినేత్రుని దివ్యపాద। కంజాతాళికి దగ నెరగి—

గీ॥ దేవమునులు గొల్వ దేవిని వామార్ధ
భాగమందు నిల్పి బాయకున్న
శర్వు జూచి నృపతి చాలమిక్కుటముగ
నవ్వి నవ్వి హరున కిట్లనియెనె॥

కేదారగౌళ—రూపకం.

ప॥ ఏమి చోద్యమయ్యో శర్వ। యీ నీ నడతనుగనగ॥ ఏమి॥

అ॥ కామహరుండన్న శైల కన్యకాళ్ళు చేసికొనిరి యేమొ॥

మి॥ శ్రేయుడై భూర్న్యస్త్రీ పడియంగడలి యింపరిలో
కోమలిసతులు కానిదెంతె కనుకనె లోకములకింక నేమి॥

2 మగవాడన్న స్త్రీలశాక మసలినట్టివ కీర్తకవె
నగరే నూడువానునిన్న జగతిని వెలచేసియయే

మి॥ జగదాధారునినొంటి నగనందన యింతకీన
మొగవర్తించిన పేరుకు మునులెట్టుల నైచిరకటా యే॥

కం॥ అనిపల్కు చిత్రకేతుని। గనిశాంభవికోపమూని కలుషాత్మయిటుల్
ననుభవునిదూలనాడుచె। ననుమిక తత్ఫలము రాక్షసుడవైధరణిన్॥

వచ॥ అని శపించిన న్యాలుండు చిరునగవున నంబా నీశాపంబునకు వెరు
వను నిన్ను మరల శపింపగలశక్తి శ్రీహరి సమారాధనవలనం బడ
సితి. గాని జగన్మాతవగుట నట్లాచరింపదలంపను భవదీయ శాపం
బున రాక్షసుండనై పుట్టియు హరిపదారాధనంబున ముక్తింగాంతునని
పల్కి యోగాగ్నియం దుమికి మృతింగని త్వష్టయను మునీంద్రు
డాచరించు యాగాగ్నియందు వృత్రుండను రాక్షసాకారంబున
జనించి——

సీ॥ యొకపరిపాషాణ నికరంబుచేబూని దేవలోకముమీద విసిరివిసరు
నొకపరిమునివాస ములనుగ్గునూచంబు గావించినేలలో గల్పివైచు
నొకపరియాగంబు లున్మూలనముజేశి యగ్నికుండంబుల నార్పివైచు
నొకపరినిర్జర ప్రకరంబుహింసించి సురలోకమంతయు చూరగొనును
యిట్లు వృత్రాసురుండు బాధించుచుండ
నిందుడడలుచు సురలోక మెడలిపద్మ
గర్భశంకరులను మ్రొక్కి గావుమనుచు
ప్రార్థనమొనర్ప వారలు పల్కిరిటులు॥

మంజ——వృత్రాసురు మ్రిందింపగల్గు। నవ్విధమెరుంగరాదు
ధాత్రీధవుడగు విష్ణునికడకిక। దరలుదు మనపనిగాదు.

వచ॥ అని విష్ణులోకంబునకేగి వృత్రాసురుం డాచరించు దురితంబు వెర
గింప నవ్వనమాలి యిందునకిట్లనియె॥

చం॥ జలజభవాన్వవాయమున జన్మమునంది సమస్తభోగ భం
గులు నిరసించి పెద్దకము ఘోరవనాంతమునం దధీచి నా
విలసిత నాముడొక్కఁడు తపించెను నాతని వెన్నుపూస నీ
విలునకుదార్చి బాణగతి వేశినవృత్రుఁ డడంగు వాసవా॥

వచ॥ బ్రహ్మహత్యా పాతకంబునకై వెనుకాడిన వృత్రాసురుండు వేరో
కంట హతుండుగాడు నాకు పరమభక్తుఁడు దధీచియు నట్టివాడే
భక్తుడు భక్తునివల్లనే నశింపవలయు నెట్లన నినుము నినుమువల్లనే
ఛేధింపబడునని యంతర్భావంబైన నింద్రుఁడు—

రా॥ వస్తి — రూపకం.

ప॥ ఏమిసేతునాదధీచి। నెట్లుచంపువాఁడను నే॥ నేమి॥
అ॥ యీమహావృత్రాసురవధ। కీవతప్పక నెరవులేదీ॥ కేమి॥
1 కులమునవిప్రుఁడు ఘనుఁ। డుజ్వలతపశ్శక్తియుతుడు
జలజాక్షుని భక్తుడెట్లు। చంపుదుగతి వేరులేదీ॥ కేమి॥

గీ॥ పాపమునకుజంకి వాని చంపకయున్న
వృత్రుఁడెట్లుచచ్చు పృథ్విజనులు
సుఖమునందుటెట్లు మూడగాద్వంద్వ సం
కటమునోచెనాకు గతియికేమి॥

వచ॥ అని విచారించి వేరొండుమార్గంబులేమి-దధీచిమహానిందరిసి ప్రాంజ
లియై, దేవా! తమవలన ముల్లోకంబులు సుఖింపగల తరుణం బరుదెం
చినదన. నతండు మహేంద్రా ముల్లోకంబుల కధిపతివగు నీవర్థివై
వచ్చిన కొదువేమి—

గీ॥ కోరుమెద్దానివాంఛించి చేరితిటకు
నాగ నింద్రుడు వృత్రాసురాగమనము
తనకువిఘ్నం జెరుంగ జేసినవిధంబు
తానరుగుదెంచు విధము నాతనికిదెల్పె॥

వచ॥ మానవలోకంబున హస్తినాపురంబేలు చంద్రవంశ వర్ధనుండగు నహుషుండొక్కరుండ సకల సద్గుణాకరుండు చతుర్వేద పఠితుండు శాస్త్రాధ్యయనుండునుధాతదయాపరుండు తొంబదితొమ్మిది యజ్ఞమ్ము లాచరించినవాడునతండొక్కడే ముల్లోకంబులనింద్రపదవికిన ర్హుండెన.

మంజ—కొరతవడిన యొక యజ్ఞఫలముం గూడ యాతనికొసంగి
సురపతిజేయుద మనుచు నిర్జరులు జూచి వానిక డకరిగి॥

వచ॥ స్వర్గంబునకు జేర్చి తత్ఫలంబునొసంగి చిరంత చింతామణి రత్నపీఠం బుచు జేర్చుటకు సప్తర్షులు బంగారుపల్లకింబెచ్చి యతని నందునిచి మోయుచుండ నహుషుండు-

చ॥ సురపతినైతి నాప్రతిభ చూపెదనంచు దలంచి పీఠముం
దిరమును సత్వరంబనియె నెంచుచు నెంచుచుల సర్పసర్పయం
చరచు చగస్త్యమౌనిగని యాగడి మొప్పగ దండనం బోన
ర్పరుడను యమ్మునీశుడు నృపాలశపించెను సర్పహాపురా॥

వచ॥ నహుషుండు వెరచి యతనిపాదంబులంబడి ప్రార్థింప నాశాపం బమోఘంబు అయిన నించుక కరుణజనించినది నీవొక సర్పాకారం బున హిమాలయప్రాంతంబున చరించుచుండుము. యీద్వాపర యు గాంతకాలంబున పాండురాజనందనులు దాయాదద్వేష ఫలితంబుగా పంద్రెండుసంవత్సరంబులు వనవాసంబాచరించుట కందరు దేర ధర్మజ దర్శన సంభాషణమాత్రంబున నీశాపంబు దీరునన నతండట్లనయ్యె వన వాసకాలంబున మీభీమసేనుంబట్టుకొన ధర్మజుండతనిశాపంబుదీర్చె నంత బృహస్పతి యింద్రునిపాపంబును నాల్గుభాగంబులు గావించి యొకటి నీటియందును, వేరొకటి వృక్షంబులయందును, మరొకటి యగ్నియందును,యింకొకటి స్త్రీలయందునునిచె. తత్ఫలంబుగా నీటికి నాచును, వృక్షంబులకు బంకయును, అగ్నికి నిపురును, స్త్రీలకుబుతు మతి యగుటయు గలిగె. నంత పాపవిమోచనుండై మహేంద్రుండు ముల్లోకాధిపతియయ్యె. నిది శ్రీమహాభాగవతంబునషష్ఠస్కంధము.

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ.



శ్రీరస్తు—శుభమస్తు.

శ్రీ గురుపరబ్రహ్మణేనమః.

# శ్రీ కృష్ణ భాగవతము.

## (హరికథ) సప్తమ స్కంధము

———:o.———

### 6. ప్రహ్లాద చరిత్రము.

వచ। మున్ను హరిమందిర ద్వారపాలకులగు జయవిజయులు సనకసనంద నాదు లొసంగిన శాపంబు కతంబున దితిగర్భంబున హిరణ్య కశ్యప హిరణ్యాక్షులై జనించిరిగదా- అందున చిరుతవాడగు హిరణ్యా క్షుని శ్రీహరి యజ్ఞవరాహరూపంబున వధించెనని పరీక్షి ద్భూపా లా వింటివిగదా. ఆతని యగ్రజుండగు కనక కశ్యపుని శ్రీహరి నర సింహావతారంబున వధించెనన - పరీక్షన్మహారాజు శుకయోగికి యిట్లనియె—

మంజ—యేవిధమున నా కనకకశ్యపుని హింసించెను యానృహరి
దేవానామది కౌతూహలమయె దీసిదెల్పుజడదారి.

తే॥ గీ॥ అనుడు శుకమౌని వినుమిక నల్లెయనుచు
హరినిప్రార్థించి వ్యాసుని నాత్మదలచి
పాండువంశాగ్రణికి నిట్లు పల్కె కనక
కశ్యపుడు సోదరుని చావుకై గడుసరి॥

వచ॥ సభారంగంబుసొచ్చి మంత్రులంగాంచి యిట్లనియె॥

కన్నడదర్బారు—త్రిపుట.

ప॥ వింటిరే మంత్రులారా। వింటి।

అ॥ తుంటరియా పిరికిపంద। తోయజాక్షు నౌదరించినపని॥ వింటి॥

1 నాతమ్మునకోడి పంది। ఘాతుకుండవల నెన్నఁబ్రచు
పాతకుండు మోసంబున। పడిమార్చినాఁడు మీరు॥ వింటి॥

2 నాదుబలం బెఱుగరే మీరు। మాధవుఁడు క్రొవ్వినవాని
సాధించెదఁ బాధించెద। చండతనము చవిచూపెద॥ వింటి॥

మ॥ జలజాతాక్షుని చంపకున్ననికి మీసంబా విధింగూర్చి కా
ననలో ఘోరతపంబొనర్చి వరముల్ సైకొంచు నేనెంతు మీ
రలు నారాజ్యరమన్ విరోధులను చేరంగనీక నేనున్న య
ట్టులె పాలింపుడు మత్సతీమణిని మీరుండెల్ల సౌఖ్యంబులన్॥

తే॥ గీ॥ అనుచు మంత్రుల నియమించి యడవిఁజొచ్చి
యొకట నాహారపానంబు లుడిగి దక్షి
ణాంఘ్రి యంగుష్ఠమున నేల యందు మోపి
యూర్ధ్వకాయుండునై తపంబుఁ జేసె నధిపు॥

మంజ—ఇట్లు కనక కశ్యపుఁడు తపంబున కేగిన విధ మెఱిగి
గట్లవైరి తనపగ సాధింపగ గడగి సేనతో బరగి.

వచ॥ అమరాలయంబు సమీపించి భీకర కదనంబున కనకకశ్యపు మం
త్రులం గాఱించి స్వర్గాది సురలచే లగ్గలబట్టించి నగరంబు స్వాధీనపర
చుకొని పరమపతివ్రతయు నిండుగర్భిణియు పతి విరహితాంతః కుల
మానసయు నగు లీలావతీదేవి యంతిపురంబు ప్రవేశన-

కం॥ ఆలీలావతి నిద్దుర। లోలత నుండంగ మూడు లోకంబుల వే
పాలించు నింద్రుఁడామెను। కేలంగొని యెత్తిచని యొక్కపణుండగుచున్॥

మంజ—పాపభయంబడి దలగి స్వర్గమునకై పోవగ నడుదారిన్
ఆపె మేలుకని తనయవస్థగని యనెనిట్లు బలారిన్॥

కోసలము—రూపకం.

ప॥ వేలనన్ను బట్టితివో। యింద్రుఁడా నీకేమిఘనశము॥ యేల॥

అ॥ గోలను గర్భిణినిసతిని। క్రూరత్వము జూపగనిటు॥ ఏల॥

వచ॥ ఆవల నాకుమారునివధించి యీయమను విడతునన మహేంద్రా
యీయమ గర్భస్థుండగు బాలునే చంపనెంచితివా. అతండు-

సీ॥ సకలభూతంబులనొకభంగితనవోలె సముహితంబుగ బ్రేమ జరుపువాడు
పెద్దలగాంచిన వినయంబునండాసి శుశ్రూషలను జేయు చుండువాడు
పరకాంతలంగన్న భావంబుతో మాత్రు రూపంబుగా భక్తి జూపువాడు
అర్థులగనుగొన్న నతిప్రేమపుత్రుల గతి వారికోర్కులు గడపువాడు
సోదరులభంగి సఖులను జూచువాడు
మానసంబున హరిభక్తి నూనువాడు
సకలసద్గుణజాలముల్ వికసితముగ
నలరయశేమందు గలడు ప్రహ్లాదుడనఘ॥

మంజ—ఆతనికతమున కనకకశిపుని నాశనము వినిక్కంబు
యీతల్లివిడుమువిన శచీపతి యిటులనె గనియనుమానంబు॥

వచ॥ అయ్యా కుమారునకతంబున ముల్లోకవిజయుండును, విధాత వరం
బుల గినవున్నవాడును, నగు హిరణ్యకశ్యపుం డంతరించునే యిట్టి
కట్టుకథ లెంతైనగలవే యన నారదుండిట్లనియె॥

తే॥ గీ॥ ఇతడు హరిభక్తుడాతని కిడరుచింప
మదముగుమంచ నివారించునొప్పకున్న
క్రూరహింసలపాల్జేయు కుధరధరుడు
భక్తునింగాన నాతని ముక్తిపరచు॥

వచ॥ అనియోగించిన యింద్రుండు లీలావతిస్విడి. సురలోకంబున కరిగె
నంత నారదుండు లీలావతిం దన పర్ణశాలకుం గొనిచని యామెచే
నారాయణ కథాసుధారసంబు గోలించుచు-

నవరోజు—త్రిశ్రగతి.

ప॥ హరిచరితము। పరమపావనము॥ (శ్రీ)హరి॥

అ॥ దురితాటవి భీకరకుఠారము ॥ హరి॥

1. జననమరణ దారుణహరణము మా
ననీయమగు మహిమాస్పదము॥ హరి॥

తే॥ గీ॥ అనుచు హరిభక్తి బోధింప నామె వినుచు
లోన మున్నీనయుదరంబు లోననున్న
బాలకుండును హరిభక్తి పరుడునగుచు
కొంతకాల సుఖముగా గర్భమున నుద్భవించె.

వచ॥ నారదప్రియో జాతకర్మాది కంబులుదీర్చి ప్రహ్లాదుండను నామ
ముంచె నతఁడెట్టివాఁడన-

చ॥ నిలచిన కూరుచుండినను నిద్దురనందిన భక్తవేళలన్
జలములుగ్రోలుచున్న నటనంబొనరించిన పాడుచున్న నా
జలజభవున్మదిన్నిలిపి సంస్తవముం బొనరించుగాని దా
వెలలడు క్రీడలన్నలుప విజ్ఞత నెంత పవిత్రమూర్తియో॥

వచ॥ యివ్విధంబున లీలావతీ ప్రహ్లాదులు నారదాశ్రమవాసంబు గావిం
పుచుండ నట హిరణ్యకశ్యపుండు హిరణ్యగర్భుంగూర్చి తపం బాచ
రింపుచుండగా-

మంజ—చిరకాలంబుగఁదింప మెచ్చి సురజ్యేష్ఠుండటకరుదెంచి
యురుతపమొనరుచు కనకకశ్యపుని యొప్పుమీరగాఁగాంచి॥

మ॥ అరరే దానవనాథ నీతపము నత్యాశ్చర్యముంగొల్పె నీ
కరణిన్ మున్నెవరున్నొనర్పరు విరాగంబార దేహంబునం
దిరుగన్పుట్టలు బెట్టె సర్పములకెంతే న్నివాసయోగ్యంబుగా
కరుణన్మెచ్చితి కోరికన్దెలుపు మింకన్ లెమ్ము నన్దానవా॥

వచ॥ అని మంత్రోదకంబులు ప్రోక్షించిన కనకకశ్యపుండు తెలివంది
లేచి హిరణ్యగర్భునకు నమస్కరించి-

కేదార—రూపకం.

ప॥ కరుణింపుము కమలాసన। శరణార్థిని నమ్మియుంటి॥ కరు॥
అ॥ నిరతమునీ నామస్మరణ। మరువను జీవితముదనుక॥ కరు॥
చ॥ దురితంబుల సైరింపుము। పరమొసగం దలచితేని
మరణం బాడవనీకితిని। మన్నింపుము దయనింపుము॥ కరు॥

2 సురలచేతనైన కిన్నరులచేతనైన
నరగరుడోరగఖేచర నాకపులచేతనైన
మి॥ హరికరిభల్లూకవ్యాఘ్రంబాదిమృగములచేత
వరశస్త్రాస్త్రంబుల కరవాలంబున మరణింపమి॥ కరు॥
3. గాలివలన వహ్నివలన। ఘనపిడుగుల వర్షమునను
రేలైనను పగలైనను। పృథివినైన నభమునైన
మి॥ నాలోగిటనైనను బయటనైనను చీకటిని
వెలుగు తేజంబున మృతియే లేనటు వరమిమ్మిక॥ కరు॥

తే॥ గీ॥ అనుచుఘోరు హిరణ్యకశ్యపునకనియె
దనుజనాయక తొల్లి యేమునులుగట్టి
ఘోరతపమున మెప్పించి కోరరిట్టి
వరములను సరినిత్తు సిద్ధికై కతన।

వచ॥ వరగర్వంబున కన్నుగానక సంచరింపక న్యాయమార్గానుగామివై వర్తింపుమని పలికించి యంతర్హితుండయ్యె. నంత హిరణ్యకశ్యపుండు నిజపురంబుచేరి మంత్రులవలన దేవేంద్రుడాచరించిన యకార్యం బాలించి-

మ॥ భళిరా యెంతటి ఘోరకార్యమును యాపాకారిగావించె మ
ద్బలదర్పంబులు జ్ఞప్తిలేవె బ్రిదుకన్వాంఛింపడే లెండు యు
త్తులు నన్మత్పటుశాతఖడ్గమున దున్మింతున్నేడే ముల్లోకముల్
విలసత్స్వైర్య పరాక్రమక్రమమునన్ వేపాలనంజేసెదన్॥

వచ॥ లెండని మంత్రుల సేనలంగొని సురపురంబుపై దాడివెడలిన॥

సీ॥ యింద్రునిబలమెల్ల సంద్రవాసంబందె వీతిహోత్రుండోడి భీతిబారె
సంయమినీశుండు శరణొనర్చి తొలంగె వరుణుండు జలమున పాశముంచె
పవనుండు మూలలంబడి పారిపోయెను యక్షేశుబలము యలక్ష్యమయ్యె
యీశానుడేమియు నెరుగక గిరిదాగె గంధర్వులవనిపై గానరారు
మునులు ఘోరవనంబులం దునికిగనిరి
మానవంతులు బ్రతుకును మానవలసె

కనకకశ్యపు పెక్కుమార్గములవలన
సజ్జనులు మెచ్చలోక్కలచే జూడగనిరి.

వచ॥ ఇట్లు సకల జగజ్జేయ మహావిజయుండై నిజ నగరంబున కరుదెంచిన హిరణ్యకశ్యపుని దరికి నారదమహర్షి సుతయుక్త లీలావతిం గొనివచ్చి—

సీ॥ దనుజవర్యుడవు తపమునకై పోవ
దివిజనాథుడు తనదేవిబల్మి
గొంచుబోవుచుండ గాంచివానిబారి
నుండిగాచినాడ దండనుంచి।

మంజ—పాలింపగ నీలీలావతి యీ బాలకునొక్కని గనియెగా
యేలుకొనుము నీనాతిమణి సుతు నెత్తుకొనుమింక ననియెగా॥

వచ॥ హిరణ్యకశ్యపుండు నారదునకు నమస్కరించి యుచిత సత్కారంబుల దన్పిన సంతసించి యమ్ముని యరిగె. నంత దానవేంద్రుండు బాలుని యెత్తి ముద్దాడి-

మోహన—త్రిశ్రగతి.

ప॥ కన్నతండ్రి యిక చదువుకోరా॥ కన్న॥
అ॥ పున్నమనరకంబును బోగొట్టరా॥ కన్న॥
1. గురుపదసేవా దికములసల్పుచు
సరవిశాస్త్ర కావ్యార్థంబులదగ॥ కన్న॥

మ॥ వనుగన్నయ్యా యటంచు శుక్రసుతు చండామార్కులం జేరి భ
క్తినిబూజించి కృపన్మదీయ సుతుపృథ్వీంగల్గు శాస్త్రార్థ వే
దము నేర్పుండని యప్పగింప నతడెంతో సంతసంబంది బా
లుని కేలందిజనెన్ని కేతనము కార్యార్థి ధనాకాంక్షియై॥

వచ॥ ఇట్లు ప్రహ్లాదుని గొనిచని శాస్త్రపురాణాది వాఙ్మితంబు లెరింగింపుచుండ నతండు సర్వము నెరింగి యున్నట నామ్యుండని చెప్పంబడు పరమాత్మయందు ద్విగుణీకృత భక్తి యుక్తహృదయుండై యుండె నంత కొంతకాలంబు గతింప-

గీ॥ దనుజపతి సుపుత్రకుఁ దనయుఁ జేసి
చదువ నొసరించి కొన్నాళ్ళ చదువ రితవ
మేమొ మెఱుగంగఁ గోరి నా ప్రేమరాశి
తనయు వెమ్మని రాజు సేవకునికి చెప్పు।

వచ॥ నతండరిగి చండామార్కుల సహితంబుగా బాలునిఁగొనిరాఁగ దను జేనుం జెనుకుచని కుమారుని నెత్తుకొని ముద్దాడి అంకతలంబున నిల్పి యిట్లనె.

ఉ॥ విద్యలనేర్చుకొనఁగ పెక్కుదినంబులు నెల్లె గుర్వుతే
వ్యాసపురాణశాస్త్రములు నెన్నిటిఁ జెప్పిరో వానియందుమేల్
పద్యమొకండు వాకొనుచు భావము వెల్లడి చేయుమన్నరో
వేద్యముగాఁగ త్వత్పఠిత విద్యనెఱంగఁగ పెక్కు లేటికిన్॥

వచ। అనిన ప్రహ్లాదుం డిట్లనియె.

ఓలవాః—రూపకం.

ప॥ చదివించిరి ననుగురువులు। చదివితి ధర్మార్థమెల్ల॥ చది॥

అ॥ మొదలో శ్రీహరినామా। మృతమే ఘనమని నమ్మితి॥ చది॥

చ॥ సుదతులు ధనభోగంబులు। మదినమ్మి నధోగతిబడి
పడకుట శ్రేయమె శ్రీహరి పాదంబులె గతిగానను॥ చది॥

2 సంసారము నిస్సారము। శాస్త్రంబులు మది చెరచును
హింసాకర మీదేహము। ధ్వంసంబగు శౌర్యముగన

చ॥ హంసగమను జనకునిమది। యందునమ్మి కొల్చినముని
హంసలగని హరిదలంచి। యధికమోక్షముంగొనుమని॥ చది॥

గీ। అనుచు వచియించు ప్రహ్లాదు నంకతలము
నుండి బడద్రోబ్బి యీబుద్ధి నొందుగూర్చి
నట్టిదెవ్వరు నీచుడా హరినిగొలిచి
నాకు కోపంబుగల్పింప బోకుమెపుడు॥

సీ॥ అబ్జాక్షుగనలేని యక్షిద్వయంబేల హరికడకరుగని యంఘ్రులేల
నథవుపూజింపని హస్తంబులవియేల శ్రీహరిందలపని చిత్తమేల

వించెను. నాచెప్పిన దాలింపుడు- మనకు తలిదండ్రాదు లెందరో యీవరకు గతించిరి. మన మెన్నిజన్మములు లెత్తితిమో యిక నెన్ని యెత్తవలయునో, సంసారసాగరంబున దరిఁగానక పుట్టుచు గిట్టుచుండుటేకాని పరమాత్మను భజించి తరించి పునర్జన్మ రహిత సాలోక్యంబందుట సులభంబైనను గ్రహింపజాలక మూఢభావంబున చరింపనేల. శ్రీహరిమార్గమును భజించి కడతేరుద మని నారదోక్తమార్గంబున వారల నందర భక్తిపరులుగావించి వారితోఁగలసి సంకీర్తన నర్తనాదికం బాచరింపుచుండ గురువులరుదెంచి విభ్రాంతులై దండించి యిక నీతిమార్గంబికిట్టు నావలనగాదని ప్రహ్లాదుని గొనిచని హేమకశ్యపుంజూచి-

మంజ—అసురవర్య బాలుఁడిందర కితడీ। హరిభక్తివిబోధించి
పసరులగావించె నీవెల్లలో। పలువిధములసాధించి
2 హరిభక్తి విడనాడచేయుమా। కలవిగాదనుచు నతను
యరిగిన కనకకశ్యపుండు కడు కోపి। భావ్యుడగుచు దుర్మనుడు॥

భైరవి—చతురశ్రజాతి.

ప॥ అద్దిర నాయెదుటను నాహరి। దలచెదవా తులువ॥ అద్ది॥
అ॥ బుద్ధిలేద యీపాపజాతు। వినుతుడానీకు॥ అద్ది॥
1 పందిరూపమూనినాడు। ధాత్రిజంపునతడా ఖలు
డెందుజేరె నేవెదకిన। నెందైనంగానరాడు॥ అద్ది॥
2 అతనిదలచెదేనినిన్ను। హతుమొనరించెదజూడుము
సుతుడనిదయజూడనతడు। చోరుడు క్రూరుడు దూరుడు॥ అద్ది॥

వచ॥ అనిన ప్రహ్లాదుం డాతనికిట్లనియె. జనకా హరిని నిందింప దగునా-
సీ॥ అతనిపాదమెసుమా పతితపావనదివ్య జననుతగౌతమీ జన్మభూమి
అతనివక్షమెసుమా శతదివాకరదీప్తి రాజిలు శ్రీవత్సరంజితంబు
అతనిబాణమెసుమా దనుజమహోన్నత పర్వతఖండన వజ్రతుల్య
మతనిహస్తమెసుమా క్షితిసర్వదీన రక్షాదక్ష దివ్యదీక్షాకరంబు



శ్రీరస్తు—అవిఘ్నమస్తు.

శ్రీగురుపరబ్రహ్మణేనమః.

# శ్రీ కృష్ణ భాగవతము.

## (హరికథ) అష్టమ స్కంధము

———:౦.———

### ౧. మహాపీఠికాభాసము.

గీ॥ ధరణీనాథ విను దుగ్ధరాశిలో త్రికూట
పర్వతంబు శృంగ భాగ త్రితయము
మగుచు దనరు దివ్యమగు నెలయేరుల
కిన్నరాళి విలయ మున్నగంబు॥

వచ॥ మఱియు నమ్మహీధరంబు మాతులుంగ లవంగలుంగ చూత కేతకీ
మందార భల్లాత కామ్రాతక సరళపనస బదరీవకుళ మందారజంబీర
వంజుల కుందకురువక కురంటక కోవిదార నారికేళ ఖర్జూర జంబు
మొదలగు నానావిధ వృక్షసమూహ సంయుతంబును తుహినకర
కాంత వజ్ర వైడూర్య నీలగోమేధిక పుష్యరాగ మనోహర కనక
కలధౌత శిఖరంబును గంధగజగవయ గండభేరుండ ఖడ్గకంఠీరవ శర
భశార్దూల శశచమర శల్యభల్లూక సారంగ వృకవరాహ మహిష
మర్కట మహోరగ మార్జాలాది మృగసంకుల సంరంభ సంయు
తంబును నై వెలయునద్దాన-

మంజ—కరిణీసంఘము నాథుండై । యొకగజరాజం దలనారుఖ్
వరబలసాహాయ్యంబున । వనమృగవర్గంబును దగమీరుఖ్

మంజ—తనుబట్టినమకరంబును । జంపందలచి యమ్మదగజంబు
పెనుబలమున పదకరముల । తాడింపంగ నాజలచరంబు॥

వచ॥ పట్టినపట్టును వీడకున్న నావనచరద్వయంబు నన్యోన్యజిగీషాయత్త
చిత్తంబున హోరాహోరిం బెక్కుదినంబులు పోరిన—

గీ॥ అన్నపానీయములులేమినలసిగజము । చిక్కెసగమయ్యెజలచరంబుక్కు
మిగిలె । స్థానబలమున నెవ్వారికైన స్థాన । బలమె బలముగుతన భుజ
బలముతగదు॥

వచ॥ అంతనగ్గజేంద్రుడు సొమ్మసిల్లి నీరాటంబునకోడి తనరక్షణకు కర్త
శ్రీమన్నారాయణుండేనని తలంచి కరంబెత్తి భక్తిరసావేశంబున—

పూర్వికల్యాణి—చతురశ్రగతి.

ప॥ కరుణింపరా । కనకచేలా ॥కరు॥
అ॥ పరమోదారా । స్వాహాసా శ్రీహరి ॥కరు॥
1 జలచరమునకుచిక్కి । చావనుంటినేనయ్య
తలచిబ్రోవుమింక । ధామోధరాహరి ॥కరు॥

మ॥ బలమానన్నగిలెన్ తలంబులెడలెన్ ప్రాణానిలంబుల్ నిడూ
ర్పులుహెచ్చెన్ తనువన్నసన్నగిలె మూర్ఛోద్రేకముల్ గ్రమ్మె బ-
ధులుసర్వుల్ చనిరొండుచోటులకు తోడ్తోవన్నురక్షింపుశ్రీ
లలనాధీశత్వమేవ యద్ధినయితిన్ లక్ష్మీసమేతంబుగాన్॥

మంజ—అలవైకుంఠపురంబుననగరులో । అతులపూవనంబునను
జలజేక్షణలక్ష్మీదేవితో । సౌఖ్యంబు గనుచుండగను
2 కాసారంబుననుండియెచ్చు । నగ్గజపతి మొరవినుపింపన్
చేసెదనాహాయంబని । హరిలేచెను జనయనుకంపన్॥

అఠాణా—రూపకం.

ప॥ వడిచనుదెంచెను శ్రీహరి । వారణపతిగాపాడగ ॥వడి॥
అ॥ కడువడిరమచేలచెరగు । కరమునదగిలినవీడక ॥వడి॥
1 సిరికిన్ జెప్పకచక్రము । చేతదాల్పకురువడితన
పరివారంబునుజీరక । వైనతేయుపయి నెక్కక ॥వడి॥

2 తన వెంటన్ సిరి యామియా । దచునవరోధ జనంబా
వెనుకను పక్షీంద్రుడు వెను । వెంటన్ శంఖచక్రములురా ॥వడి॥

వచ॥ ఇట్లరుదెంచి హరి కాసారంబు సమీపించి గజేంద్రుని వెరువకుమని సుదర్శన చక్రంబుం గొని—

మం॥జ—మకరంబుచు దునుమాడి గజపతిని । మరుపుమనుచు చక్రంబు
మకరాలయమున వైచిన మొసలిని । మ్రింగించెను నిర్వక్రంబు॥

కం॥ నీ రాటంబడి హతమైయా రాటంబుడిగి హూహూ యను గంధర్వా
కారంబున నదివెలువడి శ్రీరమణీనాథు బాగడి చేరెను దివికిన్॥

వచ॥ గజపతియును యింద్రద్యుమ్న నామ భూపాలుండై విష్ణునిం బ్రార్థించి సెలవంది ద్రివిశ దేశంబునకరిగె. హరి లక్ష్మీసహితుండై గరుడ వాహనంబధిష్ఠించి వైకుంఠంబునకరిగెనన పరీక్షిన్మహారాజు శుకునిం జూచి ఆమహారాజేకతంబున గజరూపంబందె. ననశుకుండిట్లనియె-

మ॥ ధరణీనాథకనందలంత్రైమును యింద్రద్యుమ్న భూపాలుఁడీ
శ్వరునంఘ్రిద్వయదత్తచిత్తమున కశ్వద్యోగ సంయుక్తి మా
నరతిన్నుండన గస్త్యుడయ్యెడకురా నాతండు లేవండటం
చురుడాయుత్తత శాపమిచ్చె నృపునిన్ శుంభద్గజంబౌనటుల్॥

వచ॥ ఆశాపంబీహరి దర్శనస్పర్శనంబునదీరె. నదిగాక సముద్రమథనంబున శ్రీహరిగావించినలీల లనంతంబులన నవియెరిఁగించుడన వ్యాసాత్మజుండిట్లనియె—

సీ॥ వాసవుకడకు దూర్వాసుడొక్కపుడేగు మంజులపుష్పదామంబొసంగె
నద్దాని నైరావతాగ్రకుంభస్థలి నుంచగా నద్దాని ద్రుంచివైచె
మునికోపియైయిట్లులనియె స్వర్లోక సంపదలంబునిధి యందుమబడునటంచు
నదికతంబుగ లోకమైశ్వర్యములబాసి కాటకంబునగడు గాసిలగని
దితిజులమరావతింబట్టి గతివిహీను
లగుచు విందాద్రి మలారమా మగనిచేరి
విన్నపమొనర్ప క్షీరాబ్ధి వివిధగతుల
తరువ సంపత్సహాను నిర్జరులకనియె॥

మంజ—సురలందరు తన్మథనో। పాయము మురవిరోధివలన
నెఱిగివితిజులనుడాసి। వైరమడిమరచి మైత్రికలన॥

వచ॥ మంచిగావించుకొని యందరుంగలసి మందరాచలంబతియత్నంబున పెకలించి తెచ్చి క్షీరాబ్ధియందునిచి వాసుకినింబట్టి రజ్జువుగానమర్చి ఓషధులుపెక్కుంటినందువైచి సర్పశిరంబు దనుజులును, పుచ్ఛంబు నమరులునుబట్టి, బలంబమర, కుడియెడమల, యెడమకుడికిందిప్పు చుండ శేషుండుబాధభరింపజాలక తోకలాగికొన దేవతలచేతులు జార మందరగిరిబుడుంగున జలంబులన్మునింగె. నంత దేవాసురులు వెలవెలంబోయి చేయునది లేకమురారింబ్రార్థింప నతండు కూర్మా కృతిందాల్చి మంధరంబు వీపుపైధరించిపైకిలేపిన—

చ॥ సురలసురుల్ పయోదధిని చుట్టి మథింపజనించినట్టి భీ
కరతర కాలకూటమును గాంచివిరించి ముఖామరెల్ల ని
ర్జరులును తింప శంభుడుబిరాన విసంబునుమింగిలోకముల్
కరుణదలిర్పగాచిహరి గౌరవపూజలునందియేగినన్॥

వచ॥ హాలాహలాపహరణానంతర మప్పాలకుప్పయందు యర్థిజనరక్షణా సక్తినమృతంబు జల్లుజల్లునజల్లించు స్తనచతుష్కంబుగలవేల్పుమొ దవుజనించె. దానినిండమయాగాది కంబులకువలయు సంచారంబు లొసగుననుపేరాసం దేవమునులుచేపట్టిరి. ఆపైనిపక్షయుతయగుచు నుచ్చైశ్శ్రవంబను హయరాజంబును నాపిరుందకల్పవృక్షమును నా పైని శ్వేతకాంతుల న్వెదజల్లునైరావతంబను మదగజంబును, అమిత సుందరులగు రంభోర్వశీమేనకాద్యప్సరసాతండంబును, శీతకరుండును జనించి రనంతర మప్పాలవెల్లిలో—

సీ॥ తేటలాకరినాచుదాటులాసీలంపు గూటులాకరిమబ్బుదాటులొక్కొ
కల్వలాకరిపుల్గు చెల్వలానెరిమీను చెల్వలాతుమ్మెద చెల్వలొక్కొ
పండులాబంగారుగిండులా క్రొందమ్మి చెండులా జక్కవగండులొక్కొ
మించులాపవడంపుసంచులారిక్కలమించులా హరిందీవసంచులొక్కొ

యనగ నెరికీల పెరకెమ్ముల్ యక్షియుగళి
కుచయుగంబును మెయికాంతి కులుకుమీర
సకలలోకైకమాత భాగ్యాళినేత
తావలచెలికాని తోబుట్టుదోచెలచ్చి॥

రాగ — చతురశ్రగతి

ప॥ పరిణయమాడెనుపురుషోత్తముడాసిరిని। పాండువంశాగ్రణిజనవర॥పరి
అ॥ సురమునినికరముజోహార్లిడగా। సురకాంతలు పైసేసలుజల్లగ ॥పరి॥
మి॥ మరితౌఘంబులు వల్లగ। తోసమెల్లలోకంబులనిండగ
పరమాత్ముడు జగన్మాతయని। భక్తజనులమది యుల్లసిల్లగ ॥పరి॥
చ॥ జగములకన్నతండ్రియగు చక్రిజగత్రయి మాతనిందరన్
దగకరమూనిదాడిగిచిదార్చె నురంబున నెల్ల సంపదల్
మగుడచెలంగె నాకమున మంజులమై తగుకౌస్తుభంబు దా
నాగివిడె నబ్ధిరాజు ముదమొందుచు నల్లునకున్నభక్తితో॥
వచ॥ ఆపై నాసముద్రంబున వారుణియను నామంబున పెద్దమ్మజన్మించె
నావల కొంతతడవు దరువ-

అఠాణ — రూపకం.

ప॥ పుట్టెనమృతకలశమును। చేబూని దానధన్వంతరి॥ పుట్టె॥
అ॥ పట్టెనామము పీతాంబర। ముట్టిపడగ నవయవ్వను
మి॥ పట్టెయున్నతోరస్కుం। డరుణాక్షుం డమరవెజ్జు
డిట్టాయుర్వేదిపావనుడు। దీర్ఘబాహుడమలమూర్తి॥ పుట్టె॥
2 మిక్కిలికౌతుకమున సుర। లోక్కమొగిని నిక్కిచూడ
రక్కసు లమృతమువీరికి। చిక్కెంతుమె యనితలంప
మి॥ నొక్కటబాములుసర్వమునుం। దొలగెను నాకటంచు
తక్కకవాసుకిదలంప। తామరసాక్షుడు మెచ్చగ॥ పుట్టె॥
వచ॥ అయ్యమృతకలశం బసురులు లాగికొని సురలకీమి రెండు తెగలకు
సంతుల సమరంబయ్యె. నంత శ్రీహరి-

గీ॥ అమరకుండల కేయూర హారకంక
ణాదులై పాదమంజీర నాదమొలయ
నల్ల నవ్వులపద్మ దళాక్షుండసుర
పతులనడగింప నాడురూపంబుదాల్చె॥

మ॥ ఇటులన్మోహినిరూపమూని దనుజాళిన్మాయలో ముంచి యా
ఘటముం గైకొని మాయభావయనుచుం గాంచి వాల్చూపులం
దిటముల్ దూల్చి సురాళికిం బోక గొలందిం జాల్చి సర్వంబు మీ
కటు పైతావగ బోతునంచని యమున్ శ్రేణి కిన్నిట్లనున్॥

మంజ—అమరులార మీరందరొక్కచో। నధివసించవలయు
కరిమత నమృతము పంచిమీకిడెద గాన దావవలయు॥

వచ॥ అని అమృతంబంతయు సురలకే వంచుచుండ. రాహు కేతువులను
రక్కసులు గ్రహించి సురలలో మాయరూపంబుల దాల్చి సుధం
ద్రావుచుండ సూర్యచంద్రులెఱిగించ హరి చక్రంబున వారినివధించె.
వారలు గ్రహంబులై పర్వంబుల సూర్యచంద్రులంబట్టి బాధించు
చుండిరంత. మోహిని యమృతంబంతయు దేవతల కొసగి యంతర్ధా
నంబైన సురారులు దివిజులపైగవిసి సంగరంబాచరించ నమరులగుట
నిర్జరులేజయించిరి. యివ్విధంబంతయు నారదువలన శంకరుండాలించి
హరిందరిసి—

చక్రవాకరాగం—రూపకం

ప॥ చూపవేముకుందనీవు। సుందరమోహినిరూపము॥ చూప॥

అ। పాపవే మత్సందియము। కృపాపర జగదాధార॥ చూప॥

చ॥ యీపట్లను నారదుండు। యెఱిగించెభవల్లీలలు
తేపకు సందియము బా। ధించుచుండె నమ్మజాల॥ చూప॥

2 పరమపురుషుడనగ నీ। ప్రపంచమెల్ల గావుచు
సరసిజాక్షివై దనుజుల। సంభ్రమమాపి నుంచితెల్లొ

చ॥ మురవిరోధికామారినినవు। మోహపర చగలదేమాత్రము
సురమునియోగి ... తెరంగున। సుండ... చూప॥

వచ. అనిన శ్రీహరి యుచితసత్కారంబుల నవి యిష్టంబేలయని యనిపి
పుచ్చి హరుండరుగు మార్గంబున నొక సుందరతరారణ్య మధ్యభా
గంబున ప్రాప్తకింశుకిత రసాలభూజ శాఖనాశ్రయించి యించుక
మేను వాంచి కార్తిక రాకాసుధాకరు నవఘళించు నెమ్మొగంబును,
విశాలాంబుజ పత్రాక్షులును దర్పణంబులగేరు చెక్కులును సంపగి
పూవుందూఁగు నాసికయు, బింబాధరంబును, కంబు కంఠంబును,
యున్నత వక్షోజంబులును, తామరతూండ్లం దులకించు హస్తంబు
లును, చీమలబారుందూఁగు నూగారును, హరిమధ్యమును రంభోరు
యుగళయు, తూణీరోపమ జంఘులును పద్మపదంబులును గల్గి
మూర్తిభవించిన సుందరంబోయన చిరునగవున విపంచిధరించి గా
త్రంబున గవమెళవించి త్రిస్థాయి గ్రామమూర్ఛన లొప్పార పంచమ
షడ్జమ కైశిక నిషాదాది స్వరభేదంబు లలర భైరవ్యాది షట్త్రింశద్రా
గంబుల నాలిపించి మోహులు చిగుర్ప గావించు సంగీతమునకు
విపంచికా జంత్రములపై నాట్యంబుసల్పు కరంబులందలి కంకణ
ఝుణఝుణత్కారంబు తాళమానంబు రచింప వాఃబ్జాపుల నిరువై
పుల నలరు తరులకు తోరణంబులుగట్టుచు నిల్చియున్న జగన్మోహి
నిం దిలకించి ధైర్యంబుదూలి యప్పశుపతి యిట్లనియె॥

గీ॥ మదనుశరమనంగ మహిఁజెల్లువిన్నువో
యిందువదననీవు యెవ్వరితవు
నామమేమియుందు నడయాడఁగానేమి
కతముచెప్పుమనగ కలికిబలికె॥

నవరోజు—రూపకం.

ప॥ మునిరంజన ఖలభంజన। ముదితాఖిలలోకజన॥ ముని॥
అ॥ వినుపించెద మచ్చరితము। వేధాత్మజనవనిరధ॥ ముని॥
చ॥ దనుజారినిభకీర్తిన్। వినుతిసేయు వేడ్కన్
వనమందిటులుంటిన్। ఫలములుగొని తింటిన్॥ ముని॥

2 అవివాహితనయ్యా నే । నదిరిధరుసినోరయుంటి
 ప్రవిమల సుమములకొరకు । బరగితి నాచెలులతోవని
మి॥ భవితం జేవిధిని । బరగునో యెవరా రసిరి
 తవదర్శన భాగ్యంబిది । దరమే నుతిసేయనన్నా । మునీ॥
వచ॥ అను మోహినింగాంచి కామాతురుండై వెంటందగిలిన శంకరునకు
 యాపె యిట్లనియె-
సీ॥ ఉండకొంపయు లేక పండమంచము లేక కొండపై కాటియందుండినావు
 కట్టపాతయు లేక పెట్టసొమ్ములు లేక పులితోలుపాముల బూన్చినావు
 యెక్కతత్తడి లేక మెక్కబోలెయు లేక పసుకపాలంబుల బట్టినావు
 పెట్టుకున్నాలికి కట్టుకున్నాలికి సిరముతినువు నెరజేశినావు
 యిట్టినీవెడ సౌఖ్యంబు లిచ్చువేడ
 చాలు మగతనమన సగవాలుగావె
 మదనునకు నీకు వైరంబు గద యిటెట్టి
 సుఖమొసంగెదు మరుకేళి జొచ్చినాకు॥
వచ॥ అను మోహినిం వెంటందవిలిన శంకరుంజూచి నీబిగికౌగిటం జిక్కు
 నన్నాకాలాహలులు విషానల తప్తుజేయవే. ఘనసార చందనలేప
 నంబున నలరారు మద్దేహలతకీ పాడుబూడిదె యలదుదే. నీవేడ నే
 నేడ సంపర్కంబేడ నో కాటిరేడ వలదిట్టి యడియాస మానుమని
 కొంతదవ్వున కరిగి తనవెంటంబరతెంచు శివునకెంతో యాపగో
 ల్పుచు, రమ్మొ అబలతోనడువజాలవా అర్ధనారివిగాబోలునని మేల
 మాడుచు అందకాడా! నీయందమేమి. నీనిశ్చయంబారయ నింతకాల
 యాపన మాచరించితినిగాని వేరుగాదురమ్మొ రమాలింగనాభాగ్యం
 బుప్రసాదింపుమనుచు సమీపించు శంకరునిచెంపపై నొకదెబ్బందగి
 లించి పరువిడుమ్మోహినికై శంకరుండు గుట్టలనక, పుట్టలనక పరు
 విడుచు రొమురురాళ్ళతాకున బోరగిలంబడుచు లేచుచు కైలాస
 ప్రాంతమ్మునకరుగ పార్వతిగాంచి కోపించి మోహినింబట్టుకొనయిరువ్వ
 రకు కయ్యంబుదొడరె. నందుపార్వతి——

కల్యాణిరాగం—రూపకం.

ప॥ ఎవ్వరితవె చెలిచెప్పు త్రి। కేలఁబట్టు తారసిల్లి। ఎవ్వ॥
అ॥ యివ్వనినాలిఫలనిగలసి। విహరింపగదలచినావె
చ॥ జవ్వనినేనెవరినియిటు। నాహరించితో లోకము
లివ్వసుధాతలమందునిల్వగలదె। నేశక్తినామంబునువినవో ॥యెవ్వ॥

మోహిని:—

2 చాలుచెడిపెనందునతో రు। జారబోకుమేలుగాదు
శూలిరాణిసికోపము। చూచివెరచువారులేరు
చ॥ బాలనీమగండువిన్న। వదలి ననువరించెని
కేలపెక్కులోసవతి నాకీవు। సేవసేయవలయు ॥ఎవ్వ॥

గీ॥ ఒండొరులుయిట్లు దూషించుకొనుచునుండ
సమయమనియెంచి వెరపులజ్జలుత్యజించి
శంకరుడు మోహినీదేవి సరసకరిగి
కౌగిలింపగ పుండరీకాక్షుడయ్యె॥

వచ॥ అంత వెలవెలంబోవు శంకరునూరార్చి, చూచితివా నామోహిని
రూపంబని యెరింగించె. నావల శ్రీహరి వామనావతారంబున బలీం
దుని రసాతలంబునకనిచి లోకంబులగాపాడెనన పరీక్షన్మహారాజు
శుకమహర్షి కిట్లనియె—

మంజరి—యేకారణమున హరివామనుడై। యెవ్వరికుదయించెఁ
నాకెరిగింపవె శ్రవణపేయముగ। నావిని మునివచియించెఁ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



# 8. వామన చరిత్ర

మంజ — దేవేంద్రునకోడి బలియు నెడు । దితి జేసుం జాలక నాడు
భావంబున జింతించి మొరలిడియు నె । భార్గవగుని యొక్క నాడు

గీ॥ దేవ, గురువరశుక్రుండు చేవగల్గి
బాధలిడ చేయునది లేక బలికి వచ్చి
యున్న దానవులనంటి దీక్ష కింకొక్క తెరవు
చూపుడని ప్రార్థన మొనర్ప శుక్రుడలరి।

వచ॥ బలీంద్రా విశ్వజిద్యాగంబు నిర్విఘ్నంబుగా సేయంజాలుదువేని నీకెల్లెడల జయంబౌన గూడగలదన నతం డద్దాని నాచరించి కృపీట యోని వలన హయరథగజ కార్ముకాది సాధనంబులంబొంది దేవాది ముల్లోకంబుల జయించి యేకచ్ఛత్రాధిపత్యంబుగా చక్రవర్తియై పాలించె-

గీ॥ అమరులందు బాము లదితీ సతీమణి
యాలకించి కశ్యపాఖ్య బ్రహ్మ
మంతనంబు జేరి మహనీయ నాభిష్ట
లసురవరుల చేత నగడుపడిరి॥

నవరోజు — త్రిశ్రగతి.

ప॥ నాథా వినుమా । నా వెతగనుమా॥ నాథా॥
అ॥ సాధు శ్రీ నిర్జరుల । బాధల రయుమా॥ నాథా॥
1 దితిసుతు లతిశయ । తేజోనిధులై
వెతలందించెద । రేమి సేయుదును॥ నాథా॥

వచ॥ ఇది నా కుమారులకేగాక ముల్లోకంబులకును భరింపరాని కష్టములు గల్గించుచున్నది యింక దేని తెరవుంజూపరేయని ప్రార్థించిన

మంజ — తెరవా నారాయణమంత్రంబును దెల్పెద నీత్తరి వినుమా
మరువక సతతము భజించిన నందను మానితనిర్జరుగనుమా॥

గీ॥ అనుచు నారాయణంబను నట్టిమంత్రి
రాజ మొసగంగ నదితి పర[illegible]గు

చిత్తమున జనించిన గర్భమ్మొ వనితపడవ
మాసమునవోక్క చిన్ని కుమారునగనియె॥

వచ॥ అబ్బాలుండు కడుపొట్టివాడగుట వామనుండను నామంబడి
పెనుచుచుండ దినదినప్రవర్ధమానుండై -

బిలహరి — రూపకం

ప॥ అంతట నెనిమిదియేండులు । యాబాలకునకునిండెగా ॥ అంత ॥

అ॥ స్వాంతములను విర్జనులు । వంతబాసిముదమందగ॥ నంత॥

మి॥ బాలక్రీడలుజరుపుచునరి । బాలురతోనాడుకొనుచు
లీలజనని ముద్దులుగొనుచు । ప్రేమదనరి మెలగుచుండు॥ నంత॥

వచ॥ అంత నబ్బాలునకు కశ్యపుండు మహర్షులంగలసి యుపనయన
కర్మంబు నిర్వర్తించిన సవితసావిత్రి మంత్రంబుపదేశించె. బృహస్పతి
యజ్ఞోపవీతంబొసంగె. కశ్యపుండు ముంజియు అదితి కౌపీనంబును
భూదేవి కృష్ణాజినంబును, సోముండు దండంబును, ఆకాశదేవత
ఛత్రంబును బ్రహ్మ కమండలువును సరస్వతి యక్షమాలయు,
సప్తర్షులు కుశ పవిత్రంబులు నొసంగిరి—

*కం॥ భిక్షాపాత్రికనిచ్చెను । యక్షేశుడు వామనునకు నక్షయమనుచున్
సాక్షాత్కరించి పెట్టెను । భిక్షునకు భవానిపూర్ణ భిక్షనరేంద్రా॥

వచ॥ ఇట్లుచితకర్మ నిర్వర్తితుండై యమ్మాణవకుండున్న యెడ-

మంజ — బలియొనరించెడు జన్నంబునకా । పారులుజను నెడగాంచి
పలికెమిార లెటకేగెద రెచ్చట పప్పన్నంబిపుడెంచి॥

వచ॥ అనిన నాభూసురు లర్భకా భూలోకంబున నెందరో వదాన్యులు
గలరు అర్థులందన్పుచుందురు గాని బలిచక్రవర్తియంత వాడెందును
లేడు—

కం॥ అడుగుట మొతడ వర్ధుల। నుడిచొప్పునభాగ్యమణులనుగ్రపనిచ్చున్
నడతురు పలుచరుయాతని । కడకుధనాపేక్ష విప్రకాండముపింటే॥

మంజ — లోకంబులురక్షింపగ । వామనుడాకర్ణించి తదుక్తుల్
తేకువజననీ జనకుల । మానతితో కదలెనువీకన్

2 మార్గమధ్యమున పావనియగు। నర్మదనదిని దరించెఁ
దుర్గమాటవుల దాఁటియుత్తరము। తోఁప జనిదగఁ గాంచెఁ॥

జంఝూటి—ఆది.

ప॥ బలియజ్ఞవాటము। పావనబుధజనకోటము॥ బలి॥
అ॥ విలసితమంత్రాకరము। వివిధవస్తుసంకలితము॥ బలి॥
1 అతిశయ హోమావృతము। యాజ్యగంధవహము ప్రమో
దితయద్విజనాళిదీవ। నతతిని మాఱుమ్రోగు॥ బలి॥

వచ॥ కనిడాయంబోవు నక్కుహనావటుం దిలకించి యచటివారలు-

సీ॥ శంభుఁడో? కాఁడు యాచర్మాంబరము శూలముక్షేత్రయుముదోఁచదయ్యెఁగాన
విష్ణుఁడో? కాఁడు దీపితసుదర్శనశంఖ ములు కౌస్తుభముగన బోఁడుగాన
ధాతయో? కాఁడు సంతత వేద వాదన ముఖచతుష్టయముండ బోదు గాన
చండాంశుఁడో? కాఁడు సర్వజనాక్షి తా కాఁడై యలరారుగాన
యింకనెవ్వరో కడుమహనీయుఁడితఁడ
టంచు చూపరు లానందమందుచుండ
సామగానంబులాలించి చని బలిగని
చిరుతపాఁడుండు యిట్టులా శీర్వదించె॥

మంజ—స్వస్తిజగత్త్రయ విజయునకును। సర్వామరవినుతునకు
స్వస్తిమునీంద్ర నుతాకర యజ్ఞ నిర్వర్తిత సద్గుణగణికి-

మ॥ అని దీవించిన యవ్వటుంగని మహాత్మా యెవ్వరివెందు నీ
కనువౌ తావు యిటేలవచ్చితివి నీ యాకారమత్యంత హ
ర్షనదిన్ముంచెను తల్లిదండ్రులెవరో సర్వంబథిష్టించి పా
వనతంజల్పుము నాదుకర్ణముల నాబాలుండు దానిట్లనుఁ॥

నవరోజు—చతురశ్రగతి.

ప॥ ఎవ్వరివాఁడనం। చేమని తెల్పుదు
అ॥ ఎవ్వరికైనానే। నేగతిజుమి ॥యెవ్వ॥
1 ఒరులుగారు నాకు। యొరులకు నేనౌదు
ధరణి యంతకు నేన। తల్లిదండ్రిని నేను

మి॥ ఉరుబలవంతుడ చుట్టం। బొక్కడేని లేడునాకు
సిరియుతొల్లిగలదయ్యాది। చెరడిపుడునను విడిచెనె ॥ మెవ్వ॥
2 ఇదినా నెలవని। యెట్లువక్కాణింతు
పదియునాల్గులోక। పాళినావాసమె
మి॥ కుదురుగనావాసమువిను। గుణగణ సుజనులయెడ
పదిలంబుగ నుండుదాతవని। వచ్చితివినుయాచింపగ ॥ మెవ్వ॥
మంజ——వరచేలంబులొ మాడలొ ఫలములొ। వస్త్రంబులొ గోవులనో
హారులొ రత్నములో కాంచనమో। అన్నమొకన్యలనో
2 కరులనొ రథములనో నిలయంబుల। గ్రామంబుల భూములనో
ధరణీఖండమొ యెమడిగెదొనను। ధాత్రీసురయుర్వరలో-
గీ॥ అనినదను జేసునకుపట్టుండవిమె మీకు
లంబువారిలొ నెన్నసలవియ యనఘ
నుండొకండైనగలండే మునుపుహిరణ్య
కశ్యపునిపుత్రుడైనలేని ఖ్యాతిగనడె।
వచ॥ అదిగాక మీమూడవతాత హిరణ్యాక్షుండు గదాయుధ ధరుండై
ముల్లోకంబులజయించి సాటిలేనిమేటియన నలరారుచుండ హరి వరా
హాకారంబున బొలియించిన యతనియగ్రజుండు భ్రాతృవైరంబుం
దీర్ప నాహరికొరకెల్లెడలవెదకి తుదకు వికుంఠముంజేరిన యతనికి
భయమంది శ్రీమన్నారాయణుండతని గర్భకుహరంబునం జొరబారె
నతండు మీకడిదొమహుండు——
మంజ——పురుహూతాదులు వేడిన। జీవంబులు మీజనకుండొసగెగ
చిరకీర్తిని యాచంద్రార్కముగా ధరణినిల్పిమెసగెగ॥
ఉ॥ అట్టికులంబునంబొడమి యత్యధికోన్నతి నందివైరులన్
గొట్టితిరిలోకముల్ నొకట గూరిచిధర్మము గాగనేలుచు
న్నట్టి నినున్నుతింపనగు నాఫలదాతవు నిన్నుకోరగా
నెట్టివరంబునైన కృపనీయవె కోరెద దానవేశ్వరా॥
వచ॥ చుట్టపక్కంబులులేక నిలువనీడలేక యేకాకినై యలరారు నాకు
నివసించుటకొక మూడడుగులమేర భూమినొసంగినం జాలు బ్రహ్మాం

డం బ్రాసంగినట్లు గాంచి ఆనందముండగలను.

గీ॥ అనిన వామనునకు బలియనియెవాత
కొలదిదలపక యర్థికి కోరదగునె
బాలుడవు కోరనేర్పు భవ్యమణుల
భూములో గ్రామములో గోర పోలునని॥

నాటకురంజ—రూపకం

ప॥ ఏలరిత్తకోర్కులు దాన। వేంద్రనాకు తగవుగాను॥ యేల॥
అ॥ చాలుబ్రహ్మచారిని మను। లేల నెత్తిగొట్టుకొననె॥ యేల॥
మి॥ చాలవె మూడడుగులు। జపమాల కేల బూనితిప్ప
కోలునె యీగలవటంచు। పుడమితగని దాసగోర॥ నేల॥
2 వడుగునైన నాకేమియు। వలదు కమండలువో
గొడుగో జన్నిదమో నాకు। న్మొంజియొ మరిచర్మమొ
మి॥ వడయుట తగుగాకరిత్త। వాంఛలు భూరథహయగజ
మడిమాన్యంబుల వేటికి। అడుగులుమూడిమ్ముచాలు॥ ఏల॥

వచ॥ అనిన నాబాలభూసురు వచనంబులకలరి బలి పదత్రయం బొసంగ
సిద్ధమైయుండ శుక్రుండిట్లనియె-

మంజ—పొట్టిపాఱు డడిగిన యీ। వరమెట్టులునిత్తువు దీనర్
గట్టువెఱికోరికపై వచ్చిన। కంజాక్షుండిత డిడినర్॥

మ॥ సురసామ్రాజ్యమునంది యింద్రుని రణక్షోణిన్ వినిర్జించు నీ
చిరకీర్తిన్ వినియచ్యుతుం డిటులునిన్ జేరెన్ పదంబుల్ త్రియం
బురయంబొప్ప గ్రహించిలోకముల నామూటికిన్ హరింపంగలం
డెరుగంజాలవు నాహితోక్తివిని నీవీదాన మీబోకుమా॥

గీ॥ అనినబలియను గురునకు సంతవాడు
లోకనాధుండుననుగోర నీక మాను
టెట్లు రాజ్యంబు కోరకున్నె యిట్టివేళ
సవ్యతమాడంగ నోడుదు నార్యవర్య॥

సావే—త్రిశ్రగతి

ప॥ గురునాథా వినుశ్రీహరి। యేనేడీలాగున వరు వెంచెనా మేలు॥ గు॥

1 పరమాత్ముడిట్లు గోరగా। స్థిరమా రాజ్యాధిభోగములు
తిరమా కలికాలమొక్కగతి! జరుపుకేడిక్కైనగాని। గురు॥

2 కారే మనుచరారాజులు। యీరే యర్థులకునుగోర్కెలు
వారే యెడనశియింపరె। పేరేయిల నిలచుగాని॥ గురు॥

మంజ—నిరయంబైన నిబంధమైన ధరణీ। నిర్మూలనమైనఁ
మరణంబైన కులాంతమైననే। మాటదిరుగజాలఁ॥

గీ॥ అనుచుగురునకు మారాడితనసతి జల
కలశముంగొని సిరోవ్వయగా వటునకు
అర్ఘ్యపాద్యంబులన్నిచ్చి యమలభక్తి
నూనిమదిని మూడడుగుల దానమిచ్చె.

వచ॥ శుక్రుండా దానకలశ రంధ్రంబున కడ్డువడిన జలంబురామి నమ్మా
యావటుండు గ్రహించి కుశనొండుగొని యందునంబొడువ భార్గవుని
కన్నొకండడంగె దానంబుపరిగ్రహించి బలింగని వామనుడిట్లనియె॥

గీ॥ భళిరదాతవనంగ నోబలిదితిసుత
నీకయే చెల్లు నాపదా నీకమొగిని
కొలచిగ్రహియింతు నంచని కుహనవటుడు
ప్రౌఢిమెయినంత విశ్వరూపంబుదాల్చె॥

దేశాక్షి—త్రిశ్రగతి

ప॥ హరివిశ్వరూప। మపుడుదాల్చెను॥ హరి॥

అ॥ సురగరుడోరగ ముని। సంస్తుతులు మిన్నుముట్టుచుండ॥ హరి॥

1 ఇంతింతైవటు। డింతయంతయై
అంతుగానరాక పెరుగుచు। నభముకంతయై॥ హరి॥

2 పదునాలుగుభువనంబులు దానై
తుదిలేకను శాశ్వత రూపుండయి॥ హరి॥

వచ॥ భూలోకంబునకుంబొడవై భువర్లోకంబుమీరి సువర్లోకంబు దాటి,

మహర్లోకంబుగడచి జనోలోకంబునకు మీఱై తపోలోకంబు నిర్గమించి సత్యలోకోన్నతుండై చరణతలంబు రసాతలంబును పాదంబులధరాతలంబును జంఘుల మహీధ్రంబులును ఊరువులమరుద్గణంబులును, గుహ్యంబున ప్రజాపతులును, జఘనంబున దానవులును, నాభితలంబు నభంబును, ఉదరంబున సప్తసముద్రంబులును ఉరంబున తారాగణంబును, హృదయంబునధర్మంబును, స్తనంబుల ఋతుసత్యంబులును, మనంబున చంద్రుండును, వక్షంబునలక్ష్మియు, కంఠంబున చతుర్వేదంబులును, భుజంబులనింద్రాదిదేవతలును, కర్ణంబులదిక్కులును, శిరంబున నాకంబును, శిరోజంబుల మేఘంబులును, నాశికయందు వాయువును, నేత్రంబుల సూర్యచంద్రులును, ముఖంబున నగ్నియు, వాక్కున నఖిలఛందోవిశేషంబులును, రోమంబుల నోషధులును, నఖంబుల శిలలును, బుద్ధి విధాతయు, గాత్రంబు నఖిలజంగమస్థావరసంఘంబులును, విలసిల్ల శంఖచక్రగదాఖడ్గ అక్షయబాణతూణీర విభ్రాజితుండును, మకరకుండలకేయూర కిరీటముక్తాహారకంకణకౌస్తుభ మణిమేఖలాంబర విరాజితుండునై విజృంభించి—

మంజ—ఒకపాదంబున నుర్వియంతయును । నొప్పమీఱగ గ్రహించి
యొకపాదంబున నభోతలంబును । యొగిదాహరియించి॥

గీ॥ మరలవామనుడై బలీశ్వరునిచూచి
భూమియంబరములు చెల్లిపోయె పాద
ద్వితయమున నింకమూడవదేమిగలదు
సత్వరముచూపుమో బలిసార్వభౌమ॥

వచ॥ అనిన బలీంద్రుండు హరిమాయావిధినెరింగి తరించితినని దలంచి దేవా నీవే సర్వమున్నివుగాని దేమిగలదు. నీపదత్రయంబున కీనశ్వర లోకాదులుచాలవు మదీయతను మనధనంబులు నర్పించితినైనను భవదీయ తృతీయపాదంబు మదీయశిరోగ్రతలంబలంకరించి నన్ను భవత్కింకరునిగా కృపంజూడవే యనునంత ప్రహ్లాదాదిపరమభాగవతశిఖామణులరుదెంచి హరింబ్రార్థించిన వామనుండు—

మ॥ బలికై స్వర్గ్వర దేవతాత్మకతకు నా భావంబు హర్షించె నీ
వలపాతాళవిభుండవై మనువు సావర్ణాఖ్యు కాలంబునం
దెలమిన్నింద్రపదంబు నొందు నిక నే నెక్కాలమున్నీదు కా
వలికాడై చరియింతునంచని బలిన్ పాతాళమున్జేర్చినన్॥

వచ॥ అతనితోడం గూడి ప్రహ్లాదుండును రసాతలావాసం బాచరించె శ్రీహరి వారిద్వార రక్షకుండై యుండె నిలచెనని శుకుండు పరీక్షన్మహారాజునకు వామనచరిత్ర నెరింగించిన నలరి మునీంద్రా మత్స్యావతారం బేవిధింగలిగెనన శుకుండిట్లనియె- మున్ను కల్పాంతవేళ——

మంజ——ద్రవిళదేశమును పాలించెడు। నొకధారుణీవరుండు
పరిమలశాంతుడు సత్యవ్రతుడన। పరమేశ్వరుభక్తుండు
2 కృతమాలికయను యేటిజలంబున। కృతస్నాతుండై హరిని
నుతిజేయుచు దోయిటనీరంబున। నతిచిరుమీనమునుగని॥

వచ॥ మరల జలమధ్యంబున విడువ నమ్మీనార్భకంబు——

గీ॥ జ్ఞాతిఘాతులు యీజలఝషములెల్ల
చిరుతనగు నన్ను చంపునం చెంచి నీకు
దోయిటం జేర రక్షింప కోయి మరల
నీటద్రోయుదు వేమది నెనరు లేదె॥

వచ॥ అదిగాక జాలరులు వలలగాలంబులంబట్టి మ్రింగింతురు. దీనజనావనుండవని నీయండ జేరితినని మనుజభాషణంబులవచియింప నాసత్యవ్రతుండాశ్చర్యంబున నాశకుల శాబకంబును కమండులువున నిడుకొని నెలవునకుం చేరె. నదియొక్క రాత్రింబున కాకమండులువునిండి తనకుండనిమ్ము చాలమి నారాజన్యున కిట్లనియె——

మంజ——త్మ్మావర నేనుండుట। కీకుండికచాలదు వేరొకచో
భావించియు విడనాడుము। నానరపాలుడు గనిదానొకచో॥

సీ॥ గండకంబును దెచ్చినిండుకలశంబున విడచెనయ్యదియును పొడవుచాల
గున్న చోమడువునకుం జేర్చె నదిచాలమిని హ్రదంబున రాజు మీను చేర్చె

దానికి నదికస్సై ధరణీసురేశుండు విష్ణుపాలదనంగ నృపతిదాని
బూని మహత్త్వమునఁ దెలిపి నంతనామీనంబు నరపాల మేలెఱుంగ్ని

జనములు ధరించియుఁ గాంకి వనధిమూసిరి
కొని మొసలిపసఁ బ్రమింగఁగా కోరియు తె
యనగ సత్యవ్రతుండు యత్యంతభక్తి
భరితమానసుఁడై యంత బలికెనిట్లు:

వచ॥ దేవా పరాత్పరా! నీమాయల నెఱుంగ నాతరంబుగాదని యెంత
యోప్రార్థింప నామీనాకార శ్రీహరియిట్లనియె. నరపాలా నేటి
కేడవదినంబున రాత్రి వచ్చునప్పుడొక పగలు నిండు నాకతంబున
ముల్లోకంబులు విలయాంభోధిని మునిఁగి నశించినంతయు జలార్ణవం
బగు నద్దానినొక నావయిట కుపెంచుచు నాదయచే దానియం
దోషధులును, బీజరాసులును, సప్తమహర్షులును యుందురు.
ఆనావ ప్రళయవాతాహతిఁ మునుఁగకుండ నేనద్దానికిఁ దూరి
నాతల్పంబగు శేషుని సాయంబున వాతంబును హరింప చేయుచు
కాపాడుదును. నీవును ఆసరికిం దరుపెంచి దానినెక్కుమని మీనంబు
జలరాశిమధ్యంబునం దూరె నంత సత్యవ్రతుండు నగరంబు చేరి దర్భ
శయ్యయందు తూర్పుతలగడగాని యమితకాలంబున కెదురుచూచు
చుండ——

మంజ—అంబరమున మేఘంబులుడారెను। యమితచీకటులు గ్రమ్మెన్
అంబుధారలొక విధిగా రేబవ లమితమ్ముగ దాఁగురియన్॥

గీ॥ కడలులన్నియు చెలియలికట్ట దాటి
మిట్టపల్లంబులేకమై మేదినీ త
లంబు లేకుండనప్పు జగంబుసృష్టి
చేయుటలుమాని కనుమూసె సృష్టికర్త॥

కం॥ అపుడు హయగ్రీవుఁడు దా। కపటతఁదో తెంచి ధాత కడ వేదంబుల్
కృపణత గొనిచని జలనిధి। నపుడే డైకదూర హరిమహామీనంబై॥

క. జలనిధిలోనడగి జలచరంబులబారి
బడిగికేకనాడ నర్తి దైత్యు
జంపి వేదములను జలమత్స్యముసఁడాచె
నెన్నఁదలపియగునె యావమహిమ!

వచ॥ అంత సత్యవ్రతుండ యరుదెంచి యానావపై నెక్కి సుఖంబుండె
మునులుం దాను నమ్మీనాకార పరమాత్మునుగాంచి-

కమాచి—చతురశ్రజాతి.

ప॥ సకలలోకావనా। సుకృతభక్తపాలనా। సక॥
అ॥ వికసితాబ్జనేత్ర సురస్తోత్ర। విమలగాత్ర నుతపాత్రా॥ సక॥
చ॥ నిర్మలాంగనిర్వికార। నిఖిలపాపసంహార
కర్మదూర గరుడగమన। కనకచేల దీనపాల। సక॥

వచ॥ అని ప్రార్థించిన హరి సత్యవ్రతా నీవిక వివస్వతుండన బరగు సూ
ర్యునకు శ్రాద్ధదేవుండను పేరునంజనించి వైవస్వతుండను పేర నేడవ
మనువుగాగలవు అని యెరిగించె. నంత పెద్దకాలంబునకు విధాత
మేల్కాంచ ప్రళయంబంతరించె. జలమంతయునింకి మేదిని గనం
బడియె నపుడు శ్రీహరి మీనాకారంబువదలి వేదంబులు విధాత
కొసంగి మునిజన నుతుండై యంతర్హితుం డయ్యెనని శుకమహర్షి
పరీక్షన్మహారాజా యిది శ్రీమహాభాగవతమం దష్టమస్కంధము దీని
నాలించిన పఠించిన చిరమోక్షంబు లభించునని యెరిగించిన-ఆవలి
కథావిధానం బానతీయవేయన-

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీరస్తు—అవిఘ్నమస్తు.

శ్రీగురుపరబ్రహ్మణేనమః.

# శ్రీ కృష్ణ భాగవతము.

## (హరికథ) నవమ స్కంధము

—————:o.—————

### 9. అంబరీషోపాఖ్యానము.

మంజ—మునుపరీక్షిద్భూవరునకు । శుకమునినాథుండిట్లనియె
వినుముసూర్యవంశంబెరిగించెద । విష్ణుప్రధాతనుగనియె
2 ధాతకుమరీచి నాబడుఘనుండు । తనయుండై జన్మించెన్
ఆతనికొమరుడు కశ్యపుండు । నానవనిని దగ జెన్నొందెన్॥

వచ॥ ఆకశ్యపుండు దక్షునిపుత్రియగునదితివలన సూర్యునిగాంచె. నయ్యాదిత్యుడు సంజ్ఞాదేవియందు శ్రాద్ధదేవుండను మనువునుగనియె. నతండు శ్రద్ధయను సతివలన సంతానవిరహితుండై-

గీ॥ కులగురుండు వశిష్ఠుండు కూర్చినముని
గణముమెచ్చగ సంతాన కాంక్షమఖము
సల్పకాతనికొకపుత్రి జననమందె
నేల పుత్రికయని రాజు జాలిదూలె॥

వచ॥ వసిష్ఠుండదిగాంచి తపోబలంబు నాయిలాబాలను సుద్యుమ్నుండుగామార్చిన యబ్బాలుడు పెద్దయై రాజ్యంబుచేయుచు-

మంజ—ఒంటొకతరి ఘోరాటవిమృగముల నొంచుకాంక్ష శ్రేష
దండిసైనికుల గొనిచనిదునిమెను । దరిమెనుశూరతజూపి॥

వచ॥ అట్లరణ్యంబున చనిచని కుమారవనంబు జొచ్చినంత-

సీ॥ హాయనుచు నశ్వమయ్యె యబలలై జనంబు
రాజమురలెల్లొక్కట రమణియయ్యె
ననిన సుకుమారుంచి యనపేక్షుడిదిమె న
ప్పౌరుడు కేమికతను నానతిమ్ము॥

వచ॥ శుకుండిట్లనియె లోకపతి శార్వాణియు సభవుండు నవ్వనంబున విహరించుతరి మును లరుదెంచి పరికించి వెనుదిరిగిచని రదికారణం బుగా నీవనంబు నొచ్చిన వారెవ్వరైన నబల లగుదురు గాకయని పార్వతి శాపంబిచ్చె నాకతంబున సుద్యుమ్నాదులు తరుణులై రట్లు కాంతలై విహరించుచుండ-

మంజ—చంద్రుని కొమరుడు బుధుండాలోకింప నా సుందరాంగిఁ బొడగాంచి
డెందమువశమై మదనవికారముల । డెందమువానిగాంచి

2 యిలయును మదనోద్రేకంబున । నాయింపు తనయుగోరి
పలవించుచు కేళీరతమైచుట । వాసంబానరించెను మీరి॥

వచ॥ వారలకు పురూరవుండను కుమారుండుదయించి చంద్రవంశము నకు మూలకందంబయ్యె. నట్లు సుద్యుమ్నుండు యటవీకరుగు కతన మనువుమరల యజ్ఞంబాచరించి యిక్ష్వాకుడు, నృగుడు, శర్యాతిదిష్టుడు, దృష్టుడు, కరూశకుడు, నరిష్యంతుడు, బృషద్రుండు, నభగుండు నవియను కుమారులం గాంచెను. వారివారివంశంబులు వేరువేరుగా పొడవైన వందు దిష్టునికులంబెరిగించెద నాలింపుడు—

మంజ—ఆదిష్టునిగర్భంబున బుట్టెను । యాభాగుండను వాడు
నాదటకర్మవశంబున । వైశ్యుండై చెలంగెగననత్తడు॥

వ॥ నాభాగునకు హాలంధనుడు, అతనికి వత్సప్రీతియు, నతనికి ప్రాంశువు నతనికి బ్రమతి, యతనికి ఖనిమిత్రుడు, వానికి జాక్షుషుండు, వానికి వివింశతి. వానికి రంభుడు, వానికి నఖనినేత్రుండు, వానికి గరంధనుడు, అతనికి యవిక్షిత్తు, వానికి మరుత్తను చక్రవర్తియు, నతనికి దముడు, నతనికి రాజవర్ధనుండు, అతనికి సుధృతి, యతనికి సౌధృతేయుడు, వానికి గేవ

లుఁడు, వానికి బుధుఁడుంతుఁడు, వానికి వేగవంతుఁడు, వానికి బంధు డును, వానికి తృణబిందుఁడు జనించె నదిగాక మనువునందనుఁడగు బృష ధ్రుండు తపోవని కరిగె నిక శర్యాతి వంశం బాలింపుము.

మ॥ మనుశర్యాతి నృపాలుఁ డాత్మసుత సొంపుప్మీర తోఁ స్త్రీజనా
వనులం గ్రుమ్మరుచోఁ సుకన్యక మహావల్మీకముం డాసి దా
నన నవ్యామ్మృత కాంతిఁ గాంచి తృణముం గ్రక్కొంచు గ్రుచ్చన్ ధరా
జనసంఘంబొకమారె యంధులయి రాచందంబు చిత్రంబుగాన్॥

వచ॥ నృపాలుం డిందుకేమి కతమోయని విచారించి గతం బెఱింగి వల్మీకంబు డాసి యందు తపం బాచరించు చ్యవనమునిం గని నమస్కరించి తన కుమారికి నాయనఘునకొసంగిన నాయువమునిపాలంగ నమ్ముని యాబాలికం గూడి కాపురంబున్నెడ నశ్వినీదేవత లరుదెంచి యాతిథ్యంబువడసి యమ్ముని నమితయవ్వన విలాసునిగావించిరి. ఆశర్యాతి నృపాలునకు ఆనర్తుఁడు, ఆతనికి రైవతుండు, వానికి రేవతీయను బాలిక జనింప నామెను బలరామునకొసంగెను. నంతతో వానివంశ మంతరించెను. యిక నాభగునికి నాభాగుండును, వానికి విష్ణుభక్తుఁడైన యంబరీషుఁ డుదయించె నతనిపట్ల విప్రశాపంబును రిత్తయయ్యె నవ్విధానం బాలింపుము.

పూరికల్యాణి—త్రిశ్రగతి

ప॥ అంబరీషునిచరితము । హతదురితము రసభరితము॥ అంబ॥

అ॥ అంబరచరవినుతము ఘ । నంబగు మోక్షాకరము॥ అంబ॥

1 హరిభజనామలము । అతిపావనతరము భీ
కర దురితహరము భక్త । తతివినుతంబగున॥ య్యంబ॥

గీ॥ చిత్తమబ్జాక్షుపాద సంసేవయందు
చూపులామురవైరి శ్రీరూపమంద
కరములా పద్మనాభుని కార్యమంద
నిల్పుసతతంబు యాధరానేత నిజము॥

మ॥ హయమేధంబులొనర్చె నెక్కుడురుమునుల్ యచ్చోంచె నారాయణుం
డై యటుంచెంచి సమస్తకర్మముల దానెమ్మిన్నొర్పనర్చెన్ మదిన్
ప్రియకాంతాసుత బాంధవప్రతతి యుక్తిభోగముల్ మిథ్యయం
చు మొదన్నెంమను సంజకేష విభునెచ్చేపాటి వారుందురే॥

మంజ—ఆవిభుడేకాదశీవ్రత। మొకడాచరించు నెపుడున్
దేవరుతంబుగ యష్ఠులెల్ల। భూదేవులుసంతసమందన్॥

గీ॥ అదియెటులటన్న వినుము ప్రతిదశమిని యొ
కపరిని భుజించి యావల యేకాదశి నుప
వాసమొనరించి ద్వాదశి పారణ యొన
రించునారాజునిచ్చలు ప్రేమమీర।

మంజ—కాళిందీతీరమ్మున వ్రతమును। గడపుచుండనొకనాడు
బాళిముకోపి మహాసింమ్రిము, దూర్వాసుడు యటజనినాడు॥

జంఝోటి—రూపకం

ప॥ దేవా ధన్యులమైతిమి। తావకాగమనముననో॥ దేవా॥
అ॥ పావనతంగాంచెనాకు। భవమువ్రతము భవనమును॥ దేవా॥
చ॥ నీవిపుల కృపానిభూతి। నెన్నతరమెయజునకైన
సేవించెదమీపదములు। శ్రీకాకరమనితలంచి॥ దేవా॥
2 ఏకాదశీవ్రతంబు। నేనొనర్చుచుంటినేడే
చేకూరెనుద్వాదశియిక। చేయవలయు పారణము
చ॥ లోకస్తుత్యప్రభావుడ। ఏకరణి లభించితిదయ
చేకొనియాతిధ్యము। నాశీర్వదించి చనుడయ్యా॥ దేవా॥

మ॥ అనిప్రార్థించిన వల్లెయంచు ముని స్నానార్థంబు కాళిందికిన్
జనిస్నాతుండయి ముక్కుమూసుకొని యజ్ఞాధీశునింగూర్చి ప్రా
ర్థనలంజల్పుచు నుండ ద్వాదశియు నంతంబాదుకాలంబు డా
సిన రాజేంద్రుడు వ్యర్థమౌవ్రతము నేజేయంగ నేమున్నదో॥

వచ॥ అని విచారించుచుండ కాలాతిక్రమంబగుచుండె నిక ద్వాదశి రెండు
ఘడియలకాలంబు మాత్రంబుండె నాలో పారణగావలె-

కాంభోజి — త్రిపుట

వ॥ ఎట్టిఘోరసంకటము నీకొదవె సమకూర్చితివో యె॥

అ॥ కట్టామునివాడు పోయి । కాలంపేదనకిమరలి । యెట్టి

2 ద్వాదశిఘటికలుయున్ని । దాటిపోవుచుండె వ్రతము

ఛేదమొసగె పారణ యిం । కెటులుజరుగు భయముగల్గు॥ నెట్టి॥

సీ॥ కడుపావనంబు యేకాదశీవ్రతము జీవితకాలమొనరుపట్టితిగంటి

దూర్వాసుడారాడుతుడియయ్యె ద్వాదశి పారణసల్పమి పాపమొదవు

మునిపీడిపారణ మునుజల్పగారాదు యిదియునుపాతక హేతువెయగు

నవనీసురులుక్షుధ నాగజాలక పంక్తులంజేర్చి కూర్చుండ్రిముందునాకు

నూయి. వెనుకనుదిరిగిన నోయిపగిది

యయ్యె పారణ సేయుటా మానుటా యి

కేమిగావింతునని విచారించు నంబరీ

షునకునెల్ల వేత్తలీ కిటులనిరి।

మంజ — ఓయిన్నృపాలా యోచించుచు । నటులూరకుండె దవి దేలా

పోయినద్వాదశి వ్రతభంగంబగు పొసిద్ధువుచ్చగానేలా

2 ద్వాదశిఘడియల జలపానంబున । పారణ సేయుటచాలు

యాదటదూర్వాసుని తో భోజన । మారగించుటలు మేలు॥

గీ॥ యిట్లుగావింపనుభయుల కెగ్గులేదు

వ్రతఫలంబును ప్రాప్తించు పరమమతాని

రామిభుజియింప కుంటను లగ్గుగాదు

యనగ సరియని జలపాన మాచరించె॥

వచ॥ ఇట్లు జలపానంబున ద్వాదశీపారణ మాచరించిన కొంతవడికి యా

దూర్వాసుండరుదెంచి—

ఉ॥ ద్వాదశిమీరిపోవుటలు పారణసల్పుటలో నెరింగి యే

రాదురితాత్మ కావరము బ్రాహ్మణశక్తి నెరుంగవో కొంకర్వ

పాదము మెక్కరమ్మని విశంకటవృత్తి ననుత్యజించి నీ

వాదట పారణన్సలుప భావ్యమెనిర్భయ ఖింతచెల్లునే॥

వచ॥ అనికోపించి మొదటిగ్నిగతుల వీక్షించినను నాలింపక నాశక్తి
చేఁ బిలుకవే యదే విద్య వాతి మొనరింతును గాకయని—

మం॥—జటలొకెంపు దాపెకికి మునిముడు। జ్వాలాపాలు దెసవదలఁ
కటకటారావముల ఘోరశక్తి। సంభవమై కృపులెల్ల దప్పులఁ॥

గీ॥ విస్ఫోటింపఁబు చెదర కిస్వైధనుఁడి
హరి సుదర్శన చక్రంబు నంబరీషు
రక్షణ నిమిత్తమంపగా తక్షణంబు
వచ్చి మునిజట శక్తిని వ్రచ్చివైచి।

వచ॥ శ్రీహరి భక్తులకుం గీడాచరింపందలంతువాయని దూర్వాసు
వెంటనంటిన నతంపతిభయ విహ్వల మానసుండై బిరబిర—

మం॥—దివిదూరం దివిదూరుపవనుల। యుందేగిన వానితోనేగు
భువిలోచొచ్చిన చొచ్చుయెట। జనబూనిన గనితోనేగు॥

గీ॥ యిట్లు చక్రంబు వెన్నంటి యేగుదేర
మౌనివరుడాత్మ జీవితాశాని పీడి
తాత్ముడై సత్యలోకంబు నరిగి భార
తీ మనోహరునిట్లు ప్రార్థింప దొడఁగె॥

మ॥ అనఘా విష్ణుసుదర్శనంబిదె మహోగ్రజ్వాలలన్ గ్రక్కుచున్
ననువెన్నాడె వధింప నీపదములే నాకింకదిక్కంచు భీ
తిని మీసన్నిధి చేరితిన్ గరుణ నీదీనాత్ము చక్రానలం
బున జానీకయనుగ్రహింపవె స్వయంభూ భక్తసంరక్షణా॥

వచ॥ అని ప్రార్థించు నమ్మునికి విరించి యిట్లనియె—

గీ॥ విష్ణుచక్రంబు వారించు వెరవునాకు
గలదెయాతని పుత్రుండ కమలనాభు
కరుణ సృష్టిని గావింప గల్గినాడ
వెరువ నేటికి పొమ్మ శ్రీవిష్ణుకడకు॥

మం॥—అనిమొరంగించిన హరిపాలిటికిక। నరిగిన లాభంబేమి
దునుమ చక్రమంపినవాడే। విధినను పాలింమనుబూనీ॥

గీ॥ దివిజవాహిని జడియుంగు దేవ్రకింక
దిక్కునాకని మాహాత్మ్యు డెక్కపరుగు
తోన కైలాసమరిగి యెంతో భయంబు
గమరి శంభునిగాంచి యాగతినుతించె.

ఖరహరప్రియ—రూపకం

ప॥ పరమేశ్వర కరుణాకరనిను। శరణంటినిరా
అ॥ దురితాటవి దవనాముని। తోషితవరప్రదాన। పర।
1 హరిచక్రానల జ్వాలను। హతముగాగనుంటిని
కరుణింపుమునిదాసుడ। కనకాచల కార్ముకహార। పర।
2 నీవెనాదిక్కుసకల। నిర్జరవందితపాద
దేవాభక్తుడమానిత। దేవగణాసుర్వాసుడ। పర।

గీ॥ అనుచుప్రార్థించు దుర్వాసుకనియె మునివ
రా హరికివిజంకిన నినురక్షసేయు
శక్తియేరికి గలదు యీశ్రేమలికేల
పొమ్ము శ్రీహరినిందాసి ప్రమొక్కుకొరకు।

వచ॥ శరణాగతత్రాణ బిరుదాంకితుండగుట తప్పక రక్షింపగలడు అని యెరిగించిన మునికులగరిష్టుండగు దుర్వాసుండు వైకుంఠముంజేరి హరినిగని-

ఉ॥ నీమహిమార్ణవంబు తుదినిం గనజాలగ శక్తిలేక నీ
ప్రేమనుగన్నభక్తులను గ్రించుదనంబొనరింప నగ్గలె
న్నో మహనీయ సల్పితిని యుమ్మలికంబును బొందిదేవ నీ
నామమునమ్మివచ్చితి ననాథకృపాకర నన్నుబ్రోవవే॥

కం॥ తవచక్రానలజ్వాలల। భువనంబులు భస్మమంద బోయెడు నను నీ
వవిరళప్రేమంబునగను। మవనీధవభక్తపాల నాహరియనుచున్॥

వచ॥ ప్రార్థించిన శ్రీహరి తాపసాబుద్ధిమంతులగు నాభక్తులు నన్ను భక్తి పాశంబులం బంధించివైతురు. భక్తులెందుజనినను గోవ్రవెంటదగులు కోడెవిధంబున యనుసరింతును. తను మనధనంబులు నాయధీనం

భాపటించి దారాసుతాదులయందు మమకారంబువీడి నన్ను నమ్మి
భజించినవారిని పేహంజాలను పంచేంద్రియంబులు వర్జించి షడ్వికా
రంబులడంచి నన్నేలక్ష్యమున స్మరించువారికి నాకు నావంతయును
భేదంబులేదు. గాన నిర్విఘ్నంబుగా నేనతండై యలరారు నంబరీషునకీ
చక్రంబు స్వాధీనం బైనది గాన వాని నాశ్రయింపుము నే నతండగుట
నిన్ను రక్షింపగలడు—

మంజ—అనియెఱిగించిన శ్రీహరివచనం। బాలించిమునీంద్రుండు
వెనుదవిలిన చక్రానలమున కతి। భీతియుతుండై ముందు
2 బిరబిరపరువిడి యంబరీషనృప। వరునిపాదముల చెంతకా
నొరిగికరంబుకాపాడుమునన్ని। యున్నవానిగనియంతకా॥

గీ॥ అంబరీషుండు కరుణ నయ్యవనిసురుని
లేవగాదీసి మిమ్ము మన్నించినట్టి
తప్పొసైప్రను మునినాథ దయదలిర్ప
నింక చక్రానలముభీతి యేలతమకు॥

వచ॥ అని యూరడించి సుదర్శనంబునుచూచి హేచక్రరాజమా! సమ
స్తంబును నీవయే నీశక్తి నెరుగ నేరితరంబు నిదురలో నినుగాంచి
దనుజులు వెండియు తెలివింగనక దీర్ఘనిద్రింగాంతురు. నీపాదభక్తుండ
నగు నన్ను మన్నించి యీ మానివర్యుగాపాడి హరిమందిరంబు చేరు
మని ప్రార్థించిన రక్కసుల గొంగయగు చక్రంబు యంతర్హితం
బయ్యె. నంత దుర్వాసుడు అంబరీషునిగాంచి—

సామ—ఏకతాళం.

ప॥ అతుల దివిజసన్నుత విమలచరితము। అంబరీష సార్వభౌమ ॥అతు॥
అ॥ నుతియింపగ దరమే నీ। స్థితి శ్రీహరిభక్తి రతి ॥అతు॥
1 ఆకలములు నమలుచువను। లందు పెద్దకాలముండి
జోక తపమొనర్చుమమ్ము। గాకనిన్ను పొగడె శ్రీహరి ॥అతు॥
2 నీపవిత్రచరితవార్తయు నేని। చదువ వినినేని
పాపశరధి గడచి విష్ణు। పదమును చేకొందురుభువి ॥అతు॥

వచ॥ అని వినుతించి యాత్రిస్థానంబుని యథేచ్ఛం జనియె. సయ్యంబరీషు నకు విరూపాది తనయు లుదయించి వంశంబు నభివృద్ధిగావించిరి. యింక నిక్ష్వాకు వంశంబాలింపుము. ఇక్ష్వాకునకు కుక్షియు, వానికి గకుత్స్థుడు, అతనికి నేనసుడు, వానికి పృథుండు, వానికి విశ్వ గంధుడు, వానికి చంద్రుడు, వానికి యువనాశ్వుండు, వానికి శవస్తుండు వానికి బృహదశ్వుడు, వానికిం గువలయాశ్వుడు, వానికి దృఢాశ్వు డు, వానికి హర్యశ్వుండు, వానికి నికుంభుడు, వానికి బర్హిణాశ్వుడు వానికి కృతాశ్వుడు, వానికి సేనజిత్తు, అతనికి యువనాశ్వుడు జన్మించిరి—

మంజ—అతడు సంతానార్థియై యొక్కయాగంబును గావించెఁ

బ్రీతి మంత్రజలకలశము సతికిని గాదలంచిదగదాచెఁ॥

గీ॥ దప్పిగల్గి నృపుడు దాని సెకింగికి

త్రావివిడవ నేగి తెలుసిప్పి

చూలుమోసిపొట్ట వ్రీలిచచ్చిన బాలు

డుద్భవించె చిత్రిమొప్పనట్లు॥

వచ॥ అంత నింద్రుండరుదెంచి నృపాలుని బ్రదికించి బాలుని యాకలిదీర నోర దన వ్రేలిడిన కతన నతండు మాంధాతయనంబరగె. నామాంధా తకు శశిబిందుని కూతురగు బింతుమతియందు పురుకుత్స్నుడు, అంబ రీషుడు, ముచికుందుడు నను ముప్పురుతనయులును యేబదిమంది కూతులుంగలిగిరి. ఆబాలికలందరు యమునానదిం జలకంబులాడు సౌభరిమునింగోరి వరించిరి, మాంధాతకుమారుండగు పురుకుత్సుడు నర్మదయను నాగాంగనను వరించి నాగలోకంబున పెద్దకాలంబుండి మరలివచ్చి త్రసదస్యుని గాంచె. నతనికి అరణ్యుండు వానికి హార్య శ్వుండు వానికి అరణుండు వానికి త్రిబంధనుండు వానికి త్రిశంకుండు జన్మించెను. అతండు గురుండగు వశిష్టు శాపకతంబున చండాలుడై విశ్వామిత్రు నాశ్రయంబున దేవలోకంబేగి వారిచే తిరస్కరింపబడి తలక్రిందుగా నాకసంబున నిలచె. నాత్రిశంకునకు హరిశ్చంద్రుడు జనించెను-అతండు—

సీ॥ అనృతమాడఁగ లేక యాబలపరాత్పరుఁ బలకౌశికునికిచ్చి యడవి జొచ్చి
గాధేయకృత సంకటక్షుముల్ దాటి కాశీపురమ్మున తనచెలువ నమ్మి
చండాలదాసుఁడై చని మనముక్తుఁడై బాధలు దలఁగి యాశ్వరునికృపను
మరల భరాతలపతియై సుఖంబున్నయంత వశిష్ఠుండు నాగ్రహమున
కౌశికునిఁజూచి పరవాలు గాసిపెట్టె
తౌర గృధ్రము రూపున గ్రమ్మంచు తిట్టె
గాధిసూనుఁడు యతని బకంబుగాఁగ
కోపమున నొండెఱుఁగక శాపమిచ్చె॥

మంజ—శాపంబుల కతమున నిర్వురు। పక్షులు గల్గియంతఁ
యూపోషక పోరాడుచునుండిరి। యూడచిత్రముగ నెంతఁ॥

వచ॥ అంత హరిశ్చంద్రుఁడు సంతానార్థియై యాగాదు లాచరించి నిష్ఫ
లుండై వరుణుంగూర్చి తపంబాచరించ నతండు వరదుండై నీకు సం
తాన ఫలంబు లేదు. ఐన నీకు వరంబొసంగనిచ్చ పాడముటంజేసి
కుమారునొసంగును నతని హోమంబాచరింప నొప్పుదేయన సం
తానాసక్తుఁ డగుట నల్లెయన వరుణు డంతర్హితుండయ్యె—

గీ॥ చంద్రమతి పూలు వాల్చి ప్రజ్ఞావివేక
వంతు పదియవ నెల నొక్క బాలునిఁగనె
పౌరులెల్లను సంతస భరితులగుచు
పబ్బమొనరించి రావిభుండుబ్బిపొదల॥

మంజ—పురిటిలోపలనె వచ్చి వరుణుండు। పుత్రు వేల్వుమనియెఁ
ధరణీశుఁడు యాహరిశ్చంద్రు। డత్యంత శోకముంగనియెఁ॥

వచ॥ పుత్రపాశాబద్ధుఁడై త్రిశంకునందనుండు పురుడు వెళ్ళనిది పనికి
రాదని వరుణుం బుచ్చెనంత—

మంజ—పురుడు వెళ్ళినంతవచ్చి వరుణుడు। పుత్రు వేల్పు మంచనియెఁ
నరనాథుడు పలు రాకయున్న। యన్యాయంబో నంచనియెఁ
2 పలువచ్చిన వెనుకనుయా వరుణుడు। బాలు వేల్వు మంచనియెఁ
యిలపతి విద్యావిహీను వేల్వఁగ। నెట్టులు తగునంచనియెఁ

3 చనువుకున్న పయివచ్చియుంకయును । నల్పుము హోమంబనియెఱ
కదనంబులు గావించి జముంబును । గనమిలార్థ మేమనియెఱ॥

వచ॥ ఇట్లు పుత్రప్రేమంబున జరుపు తండ్రిని గని లోహితుండు వని కరిగె. అంత హరిశ్చంద్రుండు వరుణపీడితుండై మహోదర వ్యాధిపీడితుండయ్యె. నదికర్ణాకర్ణి గావిని—లోహితుండు అజీగర్తు మధ్యమ తనయుండగు శునశ్శేఫుని యాగపశువుగాగొనివచ్చి యాగమాచరించిన వరుణుండు వరదుండైన కతన హరిశ్చంద్రుడు రోగబాధా నివారితుండై విశ్వామిత్ర వశిష్ఠుల శాపంబులువీచ్చి లోహితుని రాజ్యాధికారిం గావించి యోగముద్రాంకితుండై యెరుకను వర్జించి పరిపూర్ణుంబెరిగి నిర్వికార సమాధియందు పునర్జన్మ రహితుండై చెలగె.—

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

# 10. సీతాకల్యాణము (హరికథ)

మంజ—యీవిధి భాగవత కథా । కలనేచ్ఛదవిలి నృపవరుడు
దేవా యీవలి సూర్య । వంశమును దెల్పుడు వేనాకిపుడు॥

వచ॥ అనిన శుకుండిట్లనియె. నాలోహితునకు హరితుండు వానికి జంపనామకుడు వానికి సుదేవుడు వానికి విజయుండు వానికి రురుకుండు అతనికి వృకుండు వానికి బాహుకుండు జనించి రాతడు—

గీ॥ రాజ్యమెల్ల శత్రురాజులు హరియింప
సతులతోడ వనుల జాలకాల
ముండి కాల వశతను సుతులు దొరగెను
కర్మగతిని దాటగలరె యొందు॥

వచ॥ అతని పట్టమహిషి సహగమనం బాచరింప నుంచ యౌర్వమునీంద్రుడు గర్భవతివగు నీకిది యొప్పదని వారించె. అంత కొంతకాలం

బున కామెసవతు లోర్వఁ నన్నంబున విసంబు గల్పిపెట్టినం జావక
ద్దానితో వెలికవచ్చు కతన సగరుండన నప్పుత్రుండెసలరె. నతండు
పితృవిరోధనంబునాకేకి శత్రులగు హైహయాదుల నిర్జించి వాజిమే
ధం బాచరించుచున్నంత నింద్రుడా హయంబునుగొని రసాతలంబున
కపిలమహానికడఁ నిల్పిన—

మంజ—సగరుడు హయంబుగనాబడపెను। చాటుల కొమరుల నెల్లరను
జగతీతల మెల్లవెదకి దానిని। గనజాలక వారందరును॥

గీ॥ పటుబలంబున భూమినొక్కట పెకల్చి
నాగలోకంబునందు రంగంబు గాంచి
దొంగమునియని తలచి నొవ్వంగ జేయ
మునికనులు వెరువగా వారు బూదెలైరి।

వచ॥ యీ వార్త నారదుమూలంబున సగరుండెరింగి మనుమండగు నం
శుమంతునిఁబంప నతండు తండ్రులు ద్రవ్విన బిలమార్గంబున నాగ
లోకంబునకరిగి కపిలమహర్షిం బ్రార్థించి తురగంబుదెచ్చి యాగంబు
పూర్తిగావించె. నంతతండ్రుల భస్మరాసులమీాది కనిమిషనదిందెత్తు
నని తపంబు గావించుచు నంశుమంతుడుదీరె అతని కుమారుండగు
దిలీపుడు నట్లె కాలగతింబొందె. నతని తనయుండగు భగీరథుండు
తపంబున గంగనుమెప్పించి శివుని జటాజూటమునుండి యిలయందు
ప్రపితామహుల భస్మరాసులపై పారించె నిట్లు—

మంజ—భగీరథుని యత్నంబున భూమిని। పారుచున్న కతమునను
జగమున భాగీరథియన మునిసన్నుతమై యున్నదితనరు॥

వచ॥ ఆ భగీరథునకు శ్రుతుండు వానికాభావరుండు వానికి సింధు
ద్వీపుండు వానికి యుతాయువు వానికి ఋతుపర్ణుండు జనించినలుని
పోషించి యతనికడ నశ్వహృదయంబను విద్యనడసె. వానికి సర్వ
కాముండు నతనికి సుదాసుడు పుట్టె—

సీ॥ ఆసుదాసుడు వేటకరిగి వనంబున నొక్కరక్కసుగని యుక్కడంచె
వానితమ్ముడునడ బాలవర్తనమున నరపాలు నింటనుండగ నొకతరి

గురుడగు వసిష్ఠు గుడువ చేయగవలెనని తెల్పవాడు బ్రాహ్మణుడై జాపి
వండివడ్డించిన వాశిష్ఠు డెరిగి కోపించి శపించె ఘోరరాక్ష
సుండవగు మనియాతండు స్త్రీనొసర్ప
గరగి పదిరెండుయేండ్లు రక్కసుడై కుము
నాగనట్టులెయుని రక్కసా కృతిగాని
అడవులచరించె నారాజు యప్పుడగడవి॥

వచ॥ ఒకానొకతరి ఆకటమాడుచు విప్రదంపతులం గని మగనింబట్టి భక్షింపనున్న సతిదుఃఖంబున ప్రార్థించినను వినక మృగంబుచందంబున నతనింభక్షించిన నాపతివ్రత నీవు సతింగలయువేళ మృతినందుదువు గాతయని మరణించె. నది కతన శాపవిమోచనా నంతరంబు సంతానంబులేమి వలనన వశిష్ఠుండాతని కుమారు ననుగ్రహించె. నతండు పరశురామ వీరవిహారకాలంబున స్త్రీరూపధరుండై దాగు కతన నారీకవచుండన బరగె. నతనికి విశ్వసహుండుపుట్టె. అతనికి ఖట్వాంగు డుదయించి మరణకాలంబున రెండుగడియలు హరినామ స్మరణంబాచరించి వైకుంఠము చేరె. నతనికి దీర్ఘబాహుండును వానికి రఘువు వానికి పృథుశ్రవుడు వానికి అజుండు వానికి దశరథుండును జన్మించెను.

మంజ—ఆనరపాలుడు వరియించెను। మహిళామణుల న్శుభగుణులన్
మానిత పాతివ్రతలన్ సుందర। మంజులదేహల మువ్వురనున్

2 కౌసల్యయు సుమిత్రకైకన। గాబను పేరులవారిన్
భాసమాన సద్గుణులనుదివిజ। భామలనగ దగువారిన్॥

గీ॥ పెద్దకాలంబు వారితో తద్దయుసుఖ
ములనుగాంచియు సంతానముం గనకతి
దుఃఖమునుబొంది గురుహితోక్తులను నొక్క
యాగమును పుత్రకామేష్టి యనగసల్పె॥

వచ॥ ఆయాగవహ్నినుండి పాయసంబువడసి దానినిసతులకొసంగె. వారలద్దానినిభుజించి నెలలుదప్పి-

సీ॥ నవమాసములు నిండిన చైత్రశుక్లనవమిఁ పునర్వసుతారపగలుకోస
లాత్మజగర్భంబు నందుండి శ్రీవిష్ణు మాయావిలాసంపు మహిమ రామ
చంద్రుఁడై జనియించె సరవి కేకయరాజ నందనము నాఁడు సుందరాంగు
భరతుని గనియె నావల సుమిత్రకుమారు లంగనె లక్ష్మణు రాజితయశు
ఁడైన శత్రుఘ్ను దశరథుం డతులముదము
నందెలంగగ వారు నానాటఁ బెరిగి
పెద్దవారయి సకలమౌ విద్యలెఱిగి
యవలనుపనీతులై యుండిరంత మీఁద॥

మంజ—ఒక్క దినంబు నృపాలుఁడు। కొల్వున నున్నవేళ నయ్యెడకున్
అక్కటికంబు దలిర్ప। కౌశికుండరుగు దెంచె మేలునకున్॥

జ్యోతిస్వరూపిణి—రూపకం.

ప॥ కుశికాత్మజ ధన్యమునా। కులము జన్మమును నిక్కము ॥కుశి॥
అ॥ కుశలమొసఁ ఛాత్రతతికి। కూర్చునే మోదంబు మదికి॥ కుశి॥
మి॥ పశుపతి నిన్మెచ్చించిన। పరమతపోధనులు మీరు
విశదమయ్యె తనమహిమం బేరికి। సాధ్యంబౌను॥ కుశి॥
2 నాకు జనించిరి యీలోనీ। నందనులున్ దిల్కించుడు
మీకు మ్రొక్కుచుండిరిదే। యమేము గుణాదీవించుడు
మి॥ నాకోర్కెలు తమదర్శనంబు। కతనదీరిపోయె
నోకౌశిక నాపనియే మున్నదో। తెల్పుఁడొనరింతు॥ కుశి॥

గీ॥ అనుచు పూజించి పార్థింపు నధిపునకనె
గాధినందను డేనుయజ్ఞంబొకండు
బూనిగావించు నపుడెల్ల మూర్ఖదనుజు
తెరిగి చెరచుట సాగదు ధరణినాథ॥

రామప్రియ—ఖండగతి.

ప॥ ధరణీశ శ్రీరాము। దనుజ వధార్థము బంపుము ॥ధర॥
అ॥ చిరుతవాడని తలపకు। చిరకీర్తి నార్జించు ॥ధర॥
1 రక్కసులను రుమాడి। వ్రతముసాంగముగదీర్చి
పెక్కులోకములగాచి। యిక్కడకు చనుదెంచు॥ ధర॥

చం॥ అసితనుఁగోపకౌశికుని యాస్యముచీనత క్రోధజాలి యు
ట్లను ధరణీశుఁడో ముని వరాకను బాలుఁడు రాముఁడేమి దు
ర్జనులగు రక్కసాధముల జంపుట దేవ యిటుల్ వచింప మీ
మనమెటులొప్పెనో కనుమనానము హీశ జనించు మక్కటా॥

గీ। వలయునెడ నే నెవచ్చి దుర్వారగర్వ
మున చెలంగెడు రక్కసులను వధింతు
ననిన గాధేయుఁడతిమందహాసమునను
దశరథాచార్యు భయమేల తెలుపుమనిన.

హిం॥ ముఖారి—త్రిశ్రగతి

ప॥ పంపజాలను। మునినాథ రాముని। పంప॥

అ॥ చెంపగారుపాలు। చిన్నిముద్దుబాలు. పంప॥

చ॥ కంపిలెనా దేహము। మీరంపుమన్న మాటవిని మునివనే
తెంపరినై దానవులకు తినుమని బలియీనోల్లను॥ పంప॥

2 యిట్టికోర్కెఁగోరి। పెంతవరానెమీరాకు
కట్టడినై మొట్లు గావిడియుంచుమాను

చ॥ ఎట్టులైననే నెవచ్చి యా। కార్యము దీర్చెద నే
గిట్టినచో చింతలేదు కేవల। మొ వృద్ధుడనిక। పంప।

గీ॥ అనుచు శ్రీరామునంప లేనంచు బలుకు
దశరథునకను నగ్గాధి తనయుడార
యినకులంబున జన్మించి యిట్టులాడి
తప్పుదేమంచి దేగెద ధరణినాథ।

మంజ—అనికోపించి చనంగనున్న యెడ నత్తాపసి వారించి
మునినాథుండు వశిష్ఠుండిట్లనె భూనాయకుదిలకించి॥

చం॥ జనవర రాముబంపుము నిశాటులదృంచి మునీంద్రుయజ్ఞముఁ
గనిచి శుభంబునం జెలగి మానితనిర్జరులై పురంబు జే
రును భయమేల శ్రీహరియెలోకముల స్మనుపంగ నిట్టులన్
జననమునందె కౌశికుడు సాధ్యుడు సంతస పెట్టి పంపుమా॥

వచః అని వశిష్ఠుండు కలతెరగెరింగింప గాధినందనుడు కోరినట్లు శ్రీరామ లక్ష్మణుల నలంకృతుల నొనర్చి సభాగారంబునకు రప్పించి ముద్దాడి ఒకెరఁగఁ కునిట్లనియె.

సావేరి—చతురశ్రగతి.

ప॥ పోయిరండు తనయులార। మునినాథునితోడవనికి॥ పోయి॥

అ॥ శ్రేయమలర దనుజులవధ। జేశి సవనమునుగావగ॥ పోయి॥

1 లేక లేకజన్మించిన। లోకనుతులు మిముబీడక లేకయుంటిననులుదీర్చి। కేపకడ నాకడజేరుడి॥ పోయి॥

గీ॥ అనుచునుద్దాడి రామలక్ష్మణులబంప
వారు కుశికాత్మజునివెంట వనులజొచ్చి
చిత్రములగాంచి కొంతహర్షించి వాని
సేవతో దండకారణ్య సీమజేర॥

ఉ॥ అంతట గాధినందనుడు హర్షముతోడుత రామచంద్రు స్నా
నాంతమునందుజేరి దనుజాళి నడంపగ శస్త్రరాజి న
త్యంతఫలప్రదంబగు మహామనుసంఘ మొసంగివారితో
కొంతజనంగ తాటకను కూరసురద్విష కాంతయొక్క-చో॥

మంజ—భీకరాట్టహాసమున కౌశికుడు వెరగుపడగ పరువిడుచుక
శ్రీకరులగు నారామలక్ష్మణుల చెంతజేరగా గనుచుక॥

వచ॥ గాధేయుండు శ్రీరామచంద్రా యిదే సవనవిఘ్నకారిణి ముందు దీనిం గడతేర్పుమన దేవా! స్త్రీహత్యాపాతకంబున కెట్లు సహింతు నని యించుకవిచారించి మునీంద్రుని త్వరంగని సునిశితాస్త్రంబునం ఖానింగూల్చె—

గీ॥ అంతశ్రీరామలక్ష్మణు లడవిగడచి
కౌశికాశ్రమముండాసి గాధితనయు
సవనదీక్షితుగావించి జాగరూకు
లై గనుచునుండ జన్నంబుసాగుచుండె॥

ఉ॥ తాటకచావెఱంగికడు దర్పముతోడ సుబాహుఁడుం బరా
ఘాటకరుండు మారీచుడు కౌశికుజన్నము ధ్వంసనంబ ము
మ్మాటికిఁ జేయవస్తు మంచువడి మాంసముఁ రక్తము జల్లి వ్రేయమా
దేమున నిల్చినం గనిరి యెంతయు రాముఁడు లక్ష్మణుండు నొగిన్।

మంజ—శ్రీరాముండును సుబాహుయముపురము చేర్చె గ్రూరశర మొకటన్
పారావారము లో మారీచుని బడద్రైచెను వేఱొకటన్॥

వచ॥ అంత నయ్యాగంబున సమ్యగ్విధానంబునం బూర్తియయ్యె నాదట
కౌశికుడు రామలక్ష్మణులం గని-

మ॥ తిలకింపుం డనబోలు నేడు మిథిలాధీశుండు గావించు న
జ్జ్వల జన్నంబని వారిదోడ్కొని మహానద్యంతముం గాంచి మా
నులవాసంబుల జూపి చిత్రముల నన్నో చెప్పుచుం బోవగా
శిలయొక్కండది రామపాదరజసంస్పర్శంబునం సాధ్వియై॥

ఆనందభైరవి—ఆట.

ప॥ రామ రాక్షసభీమ రవికులాంబుధిసోమ। నీమహిమ దెలియతరమా॥శ్రీ
అ॥ కామితార్థఫలద గజరాజవరద। శ్యామలాంగా మునిసన్నుత చరణా
చ॥ వేమరు నీపదముల మది। లో మరువక భజియించెద
కామజనక నా నేరము। గణియింపక పాహి పాహి॥ రామ॥

గీ॥ అనుచు ప్రార్థించు మునికాంత ననసి రాము
డమ్మ యో వెవ్వ రీవు యిట్లుగుటకేమి
కతము నామంబ దేమి నా సతి యినకుల
రత్నమా విను గౌతము పత్ని నేను॥

మ॥ పతి నా నేరము కోర్వలేక కరుడచే పాషాణమౌనట్లు నా
నతుల న్మెచ్చక శాపమిచ్చి పయినీ నాసిట్లు శాపాంతమౌ
యతిలోకావనవేళ్ళ దానవహరంబై నీ దయం ధర్మ సం
గతి ముల్లోకము స్వాలుంగు ఖగరాట్కంఖాణ శ్రీరాఘవా॥

వచ॥ అని నాయహల్యం గరుణించి గౌతముం జేర్చి యనేకజనపదారణ్య
ములు నిర్గమించి మిథిలానగరంబు సమీపించిన॥

మం: జ——జనకభూమిపుం డెప్పుడై వారలసత్కరించి యిట్లనియెన్
మునివరలివవరిశనమున జన్మము పుణ్యతమంబై మనియెన్॥

గీ॥ అనుచుకౌశికునుపూజించి యతులతేజు
లీకలెవరన హామాబ్ధి శేశ దశర
థాత్మజులు రామలక్ష్మణు లనుపమాన
విక్రములుసర్వపూజ్యులు శక్రినుతులు॥

వచ॥ అని యెరిగించిన సంతసించి తగిన వసతులుగావించి జన్నంబు సమాప్తింగావించి పేరోలగంబునం దుండి జనకమహారాజు సకల ధరాపాలురం గాంచి యిట్లనియె॥

చ॥ నరవరులార మున్ను సవనంబొనరింప దలంచి నేను యీ
ధరణిని నాగటింబొనుప దానితుదిన్నొక భవ్యపేటికాం
తరమున నున్న బాలికగ నంబడ సంతతిలేమి జేసి నిం
దిరవరుడిచ్చె నంచుగొని తెచ్చితి పెంచితి కూర్మిపెంపునన్॥

గీ॥ ఆమెకిప్డు స్వయంవరం బాచరింప
దలచి యీగార్థమెల్లర బిలచినాడ
నాగృహంబునగలదు పినాకివిల్లు
దాని నెక్కిడువానికీ తన్వినిత్తు॥

మంజ——యేటికిటిపణ మేనుపరచెనం చెంచవలదువినుడు
బోటులతోపాచికలాడుచు మత్పుత్రిక మున్నొకనాడు
2 విలుగలమందిరముం జేరగ వారలపాచిక యొక్కండు
విలుక్రిందికి బోవగ దీసెను సుతయావిలు నెత్తివినుండు॥

వచ॥ గాన నావిలు నెత్తువానికీ సీతనొసంగి పాణిగ్రహణంబు నిర్వర్తింతు నందుల కఖిలరాజన్యలోకంబున సమర్థులు లెండు. నంత నారాజ కుమారులు——

సీ॥ ఇదియెంతనాకని యెదపొంగివిలుడాసి భీతిచేపిరిదికి వెడలునొకడు
బిరుసుమీసాలు కేల పెనవైచివిలుబూని కదలింపగాలేక కదలునొకడు
నాకంటెబలుడు యీలోకమందెవడని జనిచూచిచల్లగాజారునొకడు
శివువిల్లుదీనిని చేబూనరాదని అంజలిగావించి యరుగునొకడు

త్రిజగ లోకైకకర్త శ్రీ విల్లునెత్తినాడె
పూని యత్నించి సిగ్గును పొందుచుండ
గాంచి దశకంఠు డద్రిరాకాంతనాథు
డె యటంచని విలుదాసి చేయిచాచి

గీ॥ విల్లు చేబూని దంష్ట్రలు పెటపెటమన
బొమలు ముడివైచి కన్నుద్రిప్పి భ్రమియుచుకర
పదములందట్టి బలమున బైకినెత్తి
నిలుపజాలక పృథివిపైని బడెనతడు।

మంజ— త్రైలోక్య వీరుండగు రావణు తరముగానిచో నకట
యేనీలను మనవరేరాదని నృపులెల్లరూరకుండిరకట।

వచ॥ విశ్వామిత్రుండు శ్రీరామచంద్రునిం గని యిట్లనియె.

శహాన— ఝంపెతాళం.

ప॥ నాయనా శ్రీరామచంద్ర। దయగుణసాంద్రా వినుము। నాయ॥

అ॥ నీయనూన బలముజూప। నేటికితగు సమయమబ్బె। నా॥

చ॥ శ్రేయముపొసగించునట్టి। శివవిలు నెత్తుము జానకి
చేయిపట్టు మీనృపులు। చెల్లరు సివేతగుదురు॥ నా॥

2 వీరవరులమంచుగర్వత। మెరమీరిన రాజలోక
మారసిగ్గున తలలువంప। అధికముదము మాకునింప

చ॥ కూరిమిసుతనొసగిజనక। కుంభినీశు డబ్బిపొదల
గారవమున మునులాశీస్సులు। గావింపగ దరియబ్బెను। నాయ॥

వచ॥ అను కౌశికునకు శ్రీరామచంద్రమూర్తి నమస్కరించి కులగురుం
డగు వశిష్ఠు నెదలోదలంచి మ్రొక్కి శివధనువుదరికరిగి నమస్కరించి

మంజ— కేలనుదాలిచి విల్లునెత్తిడా। కేలబట్టి యంతటను
శూలినిమదిలో దలంచివారిని చూచి సవరించగాను

2 విల్లువంచగను వాతదాటచే। పెళపెళయనుధ్వనితోడన్
యుల్లమ్రుపగి విరిగెను కౌశికు। డబ్బిజనకునింజూడన్॥

వచ॥ రాజలోకంబెల్ల సిగ్గిలి తలలువంచిరి. కొందరు నిలువనోడి యుం

గీ: నగుచుండ యాళిజనంబా తరుణి నీక్షించు సీత, మాండవి,
యూర్మిళా శ్రుతకీర్తులలో సీతంజూచి కడమవారలిట్లనిరి॥

సీ। అక్కరో నాథుడనఘుండు మేల్ చక్కదనము
శీలమూర్తి దేహాంగుడు నీరజాక్షు
ఘనమువిక్రము డతనిభార్య వగుటయది
నీదుపూర్వ సుకృతమున రాదెనిజము।

ఉ॥ ఎంతయదృష్టమో సుదతి యింతసుమాప విభాసిశౌర్యదు
ర్దాంత దినేశవంశజుని పైతుని గా గ్రహియించినావు మే
మెంతయు నీసపర్యల ఘటించినవారము గానమమ్ము నీ
స్వాంతములో తలంచుము కృపామతితోడ నొకప్పుడేనియుఁ॥

వచ। ఇట్లు నర్మోక్తులాడుచుండ సీత చిరునగవున తలవంచి సిగ్గులునంతలో చేటియరుదెంచి అమ్మా! జనకమహీపతి మిమ్ముం గొనిరమ్మని పంపిరన సభంజేరి తండ్రికివందనం బాచరించిన జానకింజూచి మిథిలాధీశ్వరుండు-

గీ॥ అమ్మ నీయెత్తువిల్లును యశ్రమమున
విరచెనీతండు సాకేత విభునిసుతుడు
రామచంద్రుండు పూలహారంబుతోడ
కరముయలరించు మీతని గళమునిప్డు-

కల్యాణి—త్రిశ్ర

ప॥ పూలదండశ్రీరామ। భూవిభుమెడనిడియె జానకి॥ పూ॥

అ॥ మేలగుసంపగిజాజుల। మిగులనంద మొప్పారెను॥ పూల॥

1 సకలవాద్యనాదంబులు। సందడింపగా భూసుర
ప్రకరముదీవింపగముని। వరులు మోదమునుబొందగ॥ పూల॥

2 అంగన లందరుహారతు। లందిముందు నిలువగాయక
సంగీతము దెసలబర్వ। సర్వలోకముల్లసిల్ల॥ పూల॥

వచ॥ జనకుండు దశరథునకు శుభలేఖనువ్రాసి భూమిసురుల బుత్తెంచిన వారలు కతిపయ దిన ప్రయాణంబుల నయోధ్యజేరి పంక్తిరథు

నాశీర్వదించి యపత్త్రిక వ్రాసంగిన నది వశిష్ఠుఁడాని చదువ—

సీ॥ రాజశ్రీదశరథరాజేంద్రునకు మిథిలేశుండు మ్రొక్కి పూజించి వ్రాయు
శుభలేఖ కౌశికుతో భద్రయశులు సీతనయుండు శ్రీరామ ఘనుఁడు గడలి
తాటకఁ బరిమార్చి దనుజాలఁ ద్రుంచి జన్నము దీర్చి రాతిని నాతిఁ జేసి
వచ్చి కా పుత్త్రికన్పణముగా నున్న శంకరువిల్లు విఱిచి దాకరము బట్టె
గాన నిటికి కల్యాణకార్యమేను
జలుపనుంటిని గాన మీరు సపరివార
బంధుయాజక యుతముగా వచ్చి నన్ను
దనుపుమురుగాతయుని నమ్మితిని జనవర॥

వచ॥ అని చదివి నరపాలా వింటివా! శ్రీరాము బాహుబలాతిశయము
లెమ్ము ప్రయాణంబాచరింపుము సని బంధుమిత్త్ర పరివారయుతంబుగా
నయోధ్యం గడలి మిథిలానగరంబు సమీపించ జనకుడు.
గీ॥ యెదురుగా నేగి తోడ్తెచ్చి ముదము గదుర
ఘనసపర్యలొనర్చి రామునకు సీత
నిచ్చి శుభలగ్నమునను పాణిగ్రహణము
దీర్చిన కుశధ్వజుండన్న దిక్కు జూచి॥

నవరోజు—త్రిశ్ర

ప॥ అన్నా వినుమా। విన్నవించెదను ॥అన్నా॥
అ॥ ఎన్నదగమె మనభాగ్యము। యీదశరథు బంధుత్వము
పన్నుగ మనవంశమంతా। పావిత్ర్యము నందెను యిక
మి॥ నన్నదొక్క కోరికేమన। కన్నియలందర నాతని
పిన్న కొమరులకు నిత్తము। వన్నె వాసినిం గాంతము ॥అన్నా॥
గీ॥ అట్టులే యని యామిథిలావనీశు
డధికముదమున సోదరు నాత్మజలను
మాండవీ శ్రుతకీర్తుల మహితగుణుల
భరత శత్రుఘ్నుల కొసంగె బాగుమీర॥

మ॥ జానకినాదరంబునెయి సాకినపై జనకుండు గాంచె వి
ద్యానిలయుల్ గుణాలయు సుమాస్త్రసతీ సమరూపనూర్మిళా
మానిని నా పెలక్ష్మణుని మానినిగా నొనరించె భూమిపుల్
మానులు మెచ్చ నమ్మిథిల మండపమందత్యధి కోత్సవంబుగాన్॥

వచ॥ అంతవలయు శుభకృత్యంబులు దీర్చి శ్రీ సీతారామ, ఊర్మిళా
లక్ష్మణ, మాండవీభరత, శ్రుతకీర్తి శత్రుఘ్నులం దీవించి యరణం
బులనొసంగి యయోధ్యకుం బుత్తెంచిన మార్గమధ్యంబున-

గీ॥ పరశురాముండు సర్వభూపాల హనన
కృతప్రతిజ్ఞుండు విలుబూని కేరిభవుని
విల్లువిరచినతోనె పెన్వైరుడై తె
రమ్ము నాపసగనుకింతు రణమునందు॥

మంజ—రాజవంశమును సర్వంబును। మారణము జేయ తలపూని
నేజనియించితి ననిపై గవిసిన। యింతుక చిరునగవూని॥

వచ॥ సామంబున చక్కంబడకున్న వానివిలుతో దుర్బలుగా గ్రహించి
విడచిన నతండు దేవాదిదేవా! నీమహిమ దెలియనైతిని క్షమింపు
మని ప్రార్థించి మహేంద్రపర్వతంబున తపోనియతింబూని నివసించె.
నంత శ్రీరాముండు సాకేతంబుచేరి నగరప్రవేశంబు చేసి సుఖంబుం-
డిరని యెఱింగించిన—

మంజ—శుకయోగింగని పరీక్షితుండనె। సుదినంబితరి చూడగ
అకలంకంబగు సీతాసతి। కల్యాణంబును వినినాడగ॥

వచ॥ ఆవలి కథావిధానం బెఱింగించుడు నావుడు-

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

——:o:——

# 11. శ్రీరామ విజయము (హరికథ)

గీ॥ అట్లు దశరథనందను లతులనైజ
వాన్వితులునై యున్నకొంతకాలమ్ము జనియె
నృపతి మంత్రులతో నిట్లనె ధరణినిక
రామునకుఁగూర్చి గందు విశ్రాంతి నేను॥

వచ॥ వసిష్ఠుండెల్లి సుముహూర్తంబని నిర్ణయించిన ప్రకారం బలంకరించిరి యెల్లర హృదయంబులును వికసించె. విశ్వస్త కేకయాత్మజ దాసి యగు మందర యను వక్రగామిని విని—

మంజ — వేకువజామున నే కేకయసుత। ప్రేమతో దగనబోయి
నీకనిద్దురను మున్న యాకుబ్జ। ఫేతివిడిచి యిటుచేయి.

మ॥ నిదురింపందగు కాలమాయిది యయో నీనిద్ర భద్రంబుగా
నెదురైకష్టపరంపరల్ గడనె నీవేలా సువర్తింతువో
ముదితా నీ వొకదాసివైతి విను సంపూర్ణంబు మావారేరి పో
వుదమా రాజపురంధ్రిసేనలకు లెమ్మో కేకరాణ్ణందనీ॥

హిం॥ తోడి—త్రిశ్ర

ప॥ లెమ్ము లెమ్ము మూఢురాలా। లెమ్ము సర్వమాయెనే॥ లెమ్ము॥
అ॥ సమ్ముదమ్ము నంజానకి। చరణసేవకై పోదము॥ లెమ్ము॥
1 సీతనయుం డాధరణీ। నేతయుడుగులంబట్టగ
నో తల్లీ కోసలాత్మజ। నొగిగొల్తువుగాని యింక॥ లెమ్ము॥

వచ॥ అనినం గైకేయి గతంబాలించి యాశ్చర్య చకితయై మందరా యే మిదియని గుచ్చిగుచ్చియడిగి శ్రీరామపట్టాభిషేక విధంబెఱిఁగి యిట్లు వితర్కించె.

గీ॥ రాముడే ధరణీశుడై ప్రబలునేని
సంతసమె కాని దాన రాక్షసవినాశ
మెట్టులగు మున్ను దెల్పె వశిష్టుడిది వి
నాశనము చేయకున్న యన్యాయము మొదవు॥

వచ॥ నవితలంచి మంథర బోధనంబున వృద్ధనృపాలుని మోసగించి శం
బరాసుర వధాసమయమున దత్త వరంబులను మిషతో—

మంజ— రాముని సతితో వనవాస్మేము లరణ్యవాస మొనరింపఁ
భామూథవృద్ధై భరతుడు। ప్రజలను పోషణంబు గావింపఁ॥

గీ॥ వరములను గోరుటన్ సత్యవాక్య బద్ధ
చిత్తుడై దంశరథుడట్లు సెలవొసంగ
సీతతో లక్ష్మణునితోడ చింతదక్కి
పయనమై తల్లులకు మ్రొక్కి వనికినరిగె॥

వచ॥ సరయూనదిందరిసి యావలి బల్లకట్టడంబు నడుపునిషాద పతియగు
గుహునింగని తమపయనం బెఱింగించి నదిందాటింపుమన నతం
డిట్లనియె—

చం॥ యొడయడసిన్న బాబును యెటో దొరసానిని జేర్తునోడ నా
పడవలోనీవు కాలిడగ వద్దుయదేమన చెట్టుబండయే
పడతిగనయ్యె నీచరణపద్మముసోకిన బీదవాడ నా
పడతికెనా కెబువ్వ కరవాయెను యెక్కడదెత్తు చెప్పవమా॥

వచ॥ కైన నీపాదధూళిచే శిల సతిగామారె నందురుగాన నీపదంబులు
కడగి తడియొత్తి పడవయందు కూర్చుండబెట్టుదుమనని శ్రీరాముని
పదంబులు శుభ్రంబుగా గడిగి తడియొత్తి నావపై నెక్కించి
అవలంజేర్చిన దాశరథి సంతసించి గుహుడా నీకేమీగలమన వతని
మనోవాక్కాయంబులు పవిత్రంబులై యున్నందున శ్రీరామా—

మంజ—కులమువారికడ నేమిగొందుమో। కుంభినీధవుడ వినుము
జలధి దాటగాచేసితివు। భవ జలధిదాటింపగనేము॥

గీ॥ అనుచు మ్రొక్కెడ నతనిమోహాస్త్రనేరిగి
సంతసింగాము చంద్రుండు స్వర్గతలము
చూరగొనుమని దీవించిచేరె దండ
కావనంబును సీతలక్ష్మణులతోడ॥

గీ॥ ఆకుటీరప్రాంతంబు నమరించికొని యుండు
తాపసోత్తమాంబు ఫలములంది మెచ్చి
దంపతుల కొసంగ తగుకీర్తి వ్యాపించి
వానప్రస్థ నియతి బూనిరంత॥

వచ॥ ఆవనంబు దశగ్రీవుండు సోదరియగు శూర్పనఖకు పసుపుకుంకు
మలకుకానుకగా నిచ్చినదగుట భర్తృహీనయగు శూర్పనఖ పుత్రులగు
ఖరదూషణ త్రిశిరులతో వారియనుచరులతో నధివసించియుండె.

మంజ—ఒకదినంబు శ్రీరామచంద్రుఁ। డిక్కోప్పారం దిలకించి
మకరాంకుని బాధింపబడి దానొక। మానిని రూపువహించి॥

వచ॥ శ్రీరామునింజూచి యిట్లనియె—

జంఝోటి—త్రిపుట.

ప॥ వన్నెకాడ నిన్నుప్రేమ। గన్నదాన వేగరారా ॥వన్నె॥
అ॥ కన్నియను చిన్నదాన। కౌగిలొసగి బ్రోవరా ॥వన్నె॥
2 నవమోహనాంగ నీకీ। యువిదయొట్లు తగునురా
తవిలె నాదుమదికినీకు। తనురుచి వరియింపరా ॥వన్నె॥

మ॥ అని పైరాదిలకించి రాముడను కాంతా వ్యర్థమీకోర్కె చ
క్కనిదో కాదో లభించె నీగరిత మత్కాలంబునం గొంత దా
జనె నాపైభ్రమవీడి వేరొకని ప్రజ్ఞాశాలినిం భర్తగా
గొనిసౌఖ్యంబుల నందుమంచనిన సత్కారాత్మ దానిట్లనున్॥
గీ॥ వలచివచ్చిన నముబోటివారి వీడ
కలతమనప్పుడు గల్గు సుఖంబు జూడ
కెలమి నోరెటులాడెద నీకిట్టులాడె
చెక్కిలినొక్కి రతిదన్పు చెలమికాడ॥

వచ॥ అనిన శ్రీరామచంద్రుఁడు దీనిమదమడంపమి ఫలంబు సున్నయని
తలంచి—

మంజ—అతివా నేనొకసతితో సుఖముల। నందుచుంటి నిటుగనుము
సతిలేకొంటిగ చరించు తమ్ముని జాయవై యుంకమనుము॥

మంజ— దాయాదద్వేషముచూపించితే। తమ్ముఁడైపుట్టినయొకఁడు
శ్రీయుతంబు రాజ్యంబులాగికొని। చేర్చెనడవి నివిపుడు
2 శ్రీరాముండుగతించుమీఁద నా। చేయిబట్టుచుఁకించి
యీరాధైర్యతనుంటివి రాముఁని। యీ హృనాడమాలించి॥

వచ॥ అను రాముదేవి పల్కులాలించి సుమిత్రాత్మజుండు చెవులుమూసు
కొని జననీ యింతకాలంబునుండియు నామనం బెరుంగవైతివి. కాని
మ్మిదే పోయెదను. నీ వేను వచ్చునంతవరకు పర్ణశాలంబాటి యీ
వలికి రావలదని రాముఁడేగిన మార్గంబుబట్టి పోయెన॥

గీ॥ రామలక్ష్మణులేకతి భూమిజ నెడ
బాసిజన రావణుడుకేసం వెూసమునను
యోగిరూపంబుదాల్చి లోకోత్తరుగుణ
జానకినిగొని లంకకై చనియెనంత।

వచ॥ నట రఘురాముండు మారీచవధం బాచరించి వచ్చుచు మద్యేమా
ర్గంబున నెదురువచ్చు తమ్ముని౦జూచి-

ఉ॥ తమ్ముఁడ జానకిన్విడచి దవ్వరుదెంచితి వేల నేను యీ
కొమ్మనురక్షసేయుమన కూళలురక్కసు లెమొయున్న న
న్నమ్ముము రామచంద్రి యొకనాదములక్ష్మణ యంచువించు పో
పొమ్మని త్వత్సహాయముకు భూమిజబంపెను దూరియుగ్రజా॥

వచ॥ అనిన సోదరా దానవాధముండొకండు మాయాకురంగంబై మత్క
రంబున మరణంబందుచు నట్లరచె నని యెరిగించుచు పర్ణశాలండాసి
చూచి—

ఉ॥ కీరవిహీన పంజరము కీరతిలేని నరుండు సుందరా
కారముగానియవ్వనము కంజజుగానని రేయి భవ్యకా
సారములేనిపూవనము క్ష్మాపతిలేని ధరిత్రినాగ నే
డీ రహితుండై నేమిది కుటీరముజానకి లేమితమ్ముఁడా॥

భాగేశ్వరి—రూపకం.

పు॥ హా సతీమణిజానకి న। న్నకట యెడం బాసితివే॥ హా॥

అ॥ మోసమిట్లు జరుగునను చు । మును దెలియనైతినే॥ హా॥

మి॥ ఆసపెట్టినా మాయలేడి । అతిమోసము జేసె మనల
నోసఖ లక్ష్మణ ... వ । యుంచినవిలు ... వదేమొ॥ హా॥

2 తల్లిని ... చి ... ... బులుగొని
చెల్లింపగను యిల్లువిడచి । సీతా నాతో వచ్చితి

మి॥ వల్లదానవాక్కు వినాయ ... ... నకు గావక
కల్లరినై యధమునై కడను వేష్టు ... ॥హా॥

వ॥ అని విలపించుచు శ్రీరామచంద్రుడు సీతాన్వేషణం బారంభించి యరణ్యమెల్ల గ్రుమ్మరుచు పిదప పక్షీంద్రుండగు జటాయువునొక చోఁజూచి వానివలన జానకీయపహరణం బెరింగి యాఖగపతికి మోక్షంబనుగ్రహించి యచ్చోటుగదలి చనిచని ఋష్యమూకపర్వతం బునాసిన నగ్గిరిపై సూర్యతనయుండగు సుగ్రీవుండు మిత్రయుతం బుగా వాలిభయంబున వసించి వాలిపంపునవచ్చువారలుగా రామలక్ష్మణులం దలంచి మారుతిని బుత్తెంచిన నతండు శ్రీరాముల దరిసి నమస్కరించి—

జంజ— అయ్యా యెవ్వరు మీరలు కాపుర । మెయ్యెడ నామము లేమి
యిచ్చోటి కాగతమేమి తెల్పుడు । యిటుమిమ్ముల గోరితిమి॥

సీ॥ అనిన సౌమిత్రి వానికిననియెప్పవగ
... దశరథ భూమిపాలు
తనయులము రామలక్ష్మణు లనెడుపేరు
లంజెలంగెడు వారము రవికులులము॥

వ॥ అంత నాంజనేయుండు శ్రీరామలక్ష్మణుల దోడ్కొని సుగ్రీవుని తోసఖ్యంబు గావించిన యొకరొకరు కష్టసుఖంబులు వివరించుకున్న ... యు వాలిసుగ్రీవులకు సంకులసమరంబు గల్పించి శ్రీరామచంద్ర ... డు వాలినొక కోలంగూల్చి వానరరాజ్యంబు సుగ్రీవునకొసంగి ... వర్షర్తువు గడపి మున్నుదిమూడుకోట్ల కపిసైన్యంబుల బంపి సీతాన్వే షణంబునకై నలుదెసలకుం బుత్తెంచుచునందు వాయుజుని రాముండు ...

మ॥ తనయా దక్షిణవార్ధిదాటి కడుచింతావేశ తల్లంకలో
వనటం జెందెడు జానకిం గని యికన్ భద్రంబుగా రాము డీ
దనుజాళిన్ వధియించి నిన్ గృపగనుం దల్లీ యటంచూరటం
గొనగాబల్కి మదంగుళీయకము నీకున్నిచ్చెదన్ జూపుమా।

వచ॥ అని యంగుళీయకమ్మొసంగి పంపిన నాపావని జాంబవదాది వీరు
లతో దక్షిణాబ్ధి ముఖులై చని సంపాతికతంబున మార్గంబెఱింగి
సముద్రముండాసి దాటంగల జవంబు గల్గువారు లేమి. ఆంజనేయుం
డద్దానిందాటి లంకాపురంబుజేరి లంకిణినింకంబడంచి, సూక్ష్మ రూ
పంబున లంకాపురంబెల్ల గాంచి, యుద్యానవనంబులు చూచుచు చని
యశోకవనంబున పదుగురు రాక్షసాంగనలచే పాలితంబుగానున్న
సీతామహాదేవిందిలకించి తత్సమయంబున కటకట రుదెంచు దశకంఠు
నెఱింగి వృక్షంబధిరోహించి వసించి యానీచుడాతల్లితో నా
దుర్భాషలాలించి అతడరిగినపిమ్మట దాదులు నిద్రరంగూరినతరి వృక్షం
బుడిగ్గి —

సేనావతి — త్రిశ్రగతి.

ప॥ అమ్మా వినుమా । ఆత్మేశుడు రాము ॥డమ్మా॥
అ॥ సమ్మోదమున నీ । వెసకు నన్నంపెనో ॥యమ్మా॥
2 పుత్రమిత్రయుత । ముగ నీ రావణు
ధాత్రిం గూల్చి నిను । దయచేపట్టును ॥అమ్మా॥
3 భయము వలవదో । పావనిలక్ష్మణు
డు నెపుడు మీ పద । మ్ములు దలచుచుండె ॥నమ్మా॥

వచ॥ అని యామెకంగుళీయకమొసంగి యామెశిరోరత్నముంగొని సెల
వంది రావణుపూవనంబుం బెఱికివైచి తత్కాపరుల నురుమాడి రావ
ణుని కుమారుండగు నక్షయునిం దునిమి తతనియగ్రజుండగు నింద్ర
జిత్తువైచిన, బ్రహ్మాస్త్రంబున బంధితుడై రావణుండాసి ధర్మోప
దేశంబు లొనరించి విఫలుండై లంకాపురంబు నగ్నికాహుతి గావించి
తిరిగి శ్రీరామచంద్రునిందరిసి గతంబెఱిగించిన రఘుపుంగవులు కపి

సైన్యంబుల నోడుకొని సముద్రంబునకు వారధింకట్టి సువేలాద్రి పయివిడసిన—

మంజ—దశకంఠునితమ్ముఁడు విభీషణుఁడు। ధర్మంబుల నెరిగింపఁగ
ససిగాదనితన్నిన శ్రీరాముని। శరణందెను యనుకంపఁగ
2 అంగదునంపెను రాయబారిగా। నారావణు కడకుఁ
అంగీకరింపక దూరమునకే। నయ్యసురేంద్రుఁడు గడగఁ॥

వచ॥ తలపడిన భీకరసంగ్రామంబున రావణుని బాధుమిత్రపుత్రాదుల నందర వధియించి తుదకు శ్రీరామచంద్రుఁడు రావణుని లాతలంబునకు బలిగావించి లంకాపురంబు విభీషణునకు పట్టంబుగట్టి—

గీ॥ జానకీసతి సాక్ష్యత్వ శంకదీర
అగ్నిచే పూతమైనంత నమరపుష్ప
కాధిరూఢత సాకేత మధిగమించి
తల్లులకుమ్రొక్కి తమ్ముల దయనుచూచి॥

వచ॥ అంత మహావైభవంబున శ్రీరామచంద్రమూర్తి పట్టాభిషిక్తుండై న్యాయపరిపాలనం బాచరించుచుండ—

గీ॥ అంతకొంత కాలమరిగిన యొకనాఁడు
రామచంద్రుఁడొక్క రాత్రిపురము
గలయ దిరుగుచుండఁగా నాగరులలోన
నొకఁడు సతినివీడి యొప్పకున్న॥

మంజ—రాముడతనితో సతివిడవగునట। రా యేలుకొమ్మనంగ
రాముడనుకొంటివె పెండ్లామును। రావణుడెత్తుకపోవంగ
2 సిగ్గులేక కొనివచ్చి యేలుకొని। ఛీయూడువారి రేకొట్టఁ
లగ్గగు దీనిని నేనొల్లను నీ। లాతిమాట చెవిబెట్టఁ॥

వచ॥ అనిదూరిన విచారంబున శ్రీరామచంద్రుఁడు యిలుచేరి సౌమిత్రిం జీరి యాసీతంగొని చని వాల్మీకిపర్ణశాల ప్రాంతంబున విడచిరమ్మని పంపిన పూర్ణగర్భవతియగుట వాల్మీకి రక్షణంబున నప్పర్ణశాల కుశలవులను కుమారులంగనియె. లక్ష్మణునకు అంగద చంద్రకేతులును

భరతునకు దక్షుండు పుష్కలుండును శత్రుఘ్నునకు సుబాహు శ్రుతసేనులును జనించిరి. కొంతకాలంబునకు రామునందనులగు కుశలవులు వాల్మీకివలన నుపవీతులై తద్విరచిత రామాయణ గానం బాచరించుచు నయోధ్యకుం జేరిన శ్రీరాముడు గ్రహించి దారం బిలపించి సతీత్వ పరీక్షంగోరిన జానకీభూవివరంబు చొచ్చిన శ్రీరామాదులు కుశలవులకు పట్టముగట్టి సరయూనదిం బ్రవేశించిరి—

కం॥ యీరామాయణ సత్కథ నోహూరగ చదువ విన్న నుర్విం సకలంబౌ
కోరికలుదీరి యావల శ్రీరాముని సేవజొరుకు స్థిరముగ రాజా॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

# 12. శకుంతలోపాఖ్యానము (హరికథ)



మంజ—అంతపరీక్షితు డావలిచరితం। బానతీవె దయతోడ
సంతసంబు బెనగొనభాగవత। సారంబును గొనువాడ॥

వచ॥ అనిన శుకుండిట్లనియె. నాకుశునకు నతిథి, వానికి నిషధుండు, వానికి నభుండు, వానికి పుండరీకుండు, వానికి నహీనుడు, వానికి పారియాత్రుడు, వానికి బలుడు, వానికి జలుడు, వానికి వజ్రనాభుండు, వానికి శంఖనుండు, వానికి విధృతి, వానికి హిరణ్యనాభుండు వానికి పుష్యుండు, వానికి ధృవసంధి, వానికి సుదర్శనుండు, వానికి నగ్నివర్ణుండు, వానికి శీఘ్రుండు, వానికి మరువు, వానికి సంధి[illegible], వానికినమర్షణుండు, వానికి మహాస్వంతుండు, వానికి విశ్వసాహ్యుండు వానికి బృహద్బలుండు, జనించిరిది సూర్యవంశ విధానము. యింక చంద్రవంశంబెరింగించెద నాలింపుము—

సీ॥ వేయితలలతోడ వెలుగు జగన్నాథు
బొడ్డుదమ్మిబమ్మ బుట్టెమొదలు
వానికత్రిము నెడు వాడుద్భవంబయ్యె
వానిపుత్రుడు క్షపాకరుండు॥

మంజ—అతడు సురగురుకడగల విద్యల : నార్జించుచు మిటమీరి
అతనిదారను తారనుకామత । నాక్రమించి వనిజేరి
2 కాపురముండిన సతినిమ్మని గురు । డాపికతనుగోరినను
కోపంబున కినుచ నిక్షిత్కృతి ; గురుని సాగదోలినను॥

గీ: గురుడసురల కెరుకపరచిన వారేగు
దెంచిచంద్రుతోడ దించిపోరు
సలిగిదానవా సురలపై గవిసిన
మీరివారిపోరు ఘోరమయ్యె॥

వచ॥ బ్రహ్మదేవుడరుదెంచి వారిని వారించి గురుసతి నతనికిప్పించిన నా సతిగర్భంబున నొకబాలుడుద్భవించిన మరలగురుశిష్యులకు వివాదంబుపొడమె. విధాత తారనుంగాంచి—

దివ్యమణి—త్రిశ్రగతి.

ప॥ శంకింపకుమా తార । చిన్నివాడెవని సుతుడు ॥శంకి॥

అ॥ బొంకవలదు తెలిగింపుము । పొలతీ నిజమెంతగలదో ॥శంకి॥

2 ఏమనివిన్నవింపగలను । యెటులదెల్పుదీనిజమ్ము
సామీనీ వెరుంగనిది । జగములోన గలదేయిపు ॥దేమి॥

3 నేనెటులన్నను చెల్లదు । మానిని యనుభవము గల్గు
దానవగుట నమ్మకమ్ము । తగులు చెప్పుమోతనయ ॥శంకిం॥

4 నిక్కమెరిగించెదనే । నీరే రేనిగూడి
యిక్కుమారుగంటిని యిక । పెక్కులేల లోకపాల ॥యేమ॥

గీ॥ అనుచు తారయెరింగింప నావిధాత
బాలుచంద్రునకొసంగి పంపనతడు
బుధుడటంచని పేరిడె బుధుడిలయను
కన్యయందు పురూరవు గాంచెనధిప॥

వచ॥ ఆపురూరవుడు మిత్రావరుణు శాపంబున మానవ కాంతయగు నూర్వసింగూడి నాయువు మొదలగు నార్వుర కొడుకులం గనె. వారిలో విజయునకు భీముడుజనించె. నాతనికి కాంచనుడు, వానికి

హోత్రకుండు, వానికి గంగాజలంబు పుక్కిటంబట్టిన జహ్నుండు, వానికి పూరుండు, వానికి బాలకుండు, వానికి నజకుండు, వానికి గుశుండు, వానికి గుశాంబువు, వానికి గాధికి పుట్టెరి. వానికి సత్యవతి జనించె. నామెకు జమదగ్ని జనించె. వానికి క్షత్రియకులహాననుండు పరశురాముండు బుట్టె. ఆగాధి విశ్వామిత్రుండు జనించె. నది య ట్లుండనిమ్ము. నిక పురూరవు రెండవకొమరుండగు నహుషునకు యతియు, యయాతి, సంయాతి, నాయాతి, వియతి, వికృతియను ఆర్గురు కుమారు లుదయించిరి. అందు మొదటివాడగు యతిరాజ్యం బుబాసి, యడవికిబోయిన యయాతి రాజేంద్రుడయ్యె—

మంజ—శుక్రునికూతురు దేవయానయను। సుందరాంగి యొకనాడు
విక్రమవంతుడు దనుజేశుని సుత। విమల శర్మిష్ఠగూడి॥

ఉ॥ పూవనమందునాడి జలముంగని స్నానమొనర్ప చీరలన్
నావనతీరమందు నిడి। యంతమునుంగగ నారదుండు నా
తోవ్రజనంగ సిగ్గున తలోదరులందరు చీరలందగా
త్రొమ్మవర దేవయాన దనుజాధిపుకూతురు చీరగట్టగన్॥

వచ॥ శర్మిష్ఠ దేవయానతో వాదాడి—

మ॥ తులునత్వంబున దారతమ్యమెదలో దోపింపగా నీకనా
వలువంగట్టితివే ఫలం బనుభవింపంజేతు నంచామె చే
తులుకాళుల్ వడిగట్టికూపమున నెంతో మోసతంద్రోచి నె
చ్చెలులుందావృష పర్వపుత్రిజనియెన్ చింతింపక నైృవిధిన్॥

వచ॥ ఆకూపంబున దేవయాని విలపించుచుండ యయాతి నరపాలుండు వేటాసక్తింజని యావనంబుజేరి కూపమందున్న దేవయానను బయలుకుందీసిన దేవయాన నతనికిట్లనియె—

మంజ—ననుపాణిగ్రహణం బొనరించుట। నాకీవెనాథుడవు
జననాయక వరియించి సతంబతి। సౌఖ్యంబులనిడి బ్రోవు॥

గీ॥ మనుచువచియించి పైకొను నబలచరిత
మానృపాలుండెరింగి మీరగ్రకులులు

క్షత్రియులమైన మముఁగోరజనునె నాగ
నసురగురువరుపుత్రి యిట్లనియె మరల॥

నాటకురంజ—రూపకం.

ప॥ వినుమెట్టులైనను నీవె। విభుఁడవు నాకో నరవర ॥విను॥

అ॥ జనవందిత నాకట్టులు। శాపంబొకటుండె నయ్యా ॥విను॥

2 తొల్లి దేవగురుని సుతుఁడు। యెల్లవిద్యల నెరుగగ మా
యిల్లుఁజేరి మాజనకుని నే। విఁచి నేర్చె నాపైనను ॥విను॥

3 వానిగోరియుంటినని। వాడెరింగి యొప్పకున్న
వానివిద్య లక్కరకుఁ। రానట్టులు శపియించితి ॥విను॥

4 అతఁడునన్ను గూడకోప। మందియు ప్రతిశాపంబిడె
క్షితిపతి పతియగుగాకని। జీవితేశ గ్రహియింపుము ॥విను॥

వచ॥ అనివచియించిన శుక్రుండరుదెంచి గతంబాలించి యయాతికి దేవ యానినొసంగి వివాహంబాచరించి దనుజరాజనందనియగు శర్మిష్టం గూడా నొసంగిపంపిన నతండు దేవయానివలన యదు దుర్వసులను నందనులను శర్మిష్ఠయందు ద్రుహ్యుండునను బూరువునను కుమారులంగాంచె. కొండొకకారణంబున శుక్రుండు యయాతికి ముసలితనంబుగల్గ శాపంబిచ్చిన కుమారులలో పూరుండుతండ్రి జరగ్రహించి తనయవ్వనంబొసంగె. కొంతకాలంబునకు యయాతి సుతునకు యవ్వనంబుతో బాటు రాజ్యపాలనంబు నొసంగి తపోవనికిం జనియె. నాపూరునకు జనమేజయుండు ఆతనికి ప్రాచిన్వాంసుడు, వానికి ప్రవిరోధమన్యువు, వానికి జారువు, వానికి సుద్యువు, వానికి బహుగతుండు, వానికి శర్యాతి, వానికి సంయాతి, వానికి రౌద్రాశ్వుండు, వానికి ఋతేపువు, వాని కంతిసారుండు, వాని కప్రతిరథుండు, వానికి కణ్వుండు, వానికి మేధాతిథి, వానికి రైభ్యుండు, వానికి దుష్యంతుండు బుట్టె—

మంజ—ఆదుష్యంతనృపాలుఁడు వేటకు। నడవికిఁజొచ్చి యొకనాడు
బాధించెను మృగముల వీరత। బాహాబలంబున జూడు॥

గీ॥ యిట్లు వేటాడి యలసి యొక్కింత విశ్ర
మింపననువగు దరిఁ గోరి యేగునంత
కణ్వునాశ్రమమద్ధిని గాంచి చేర
పర్ణశాలను చక్కని పణతి నిలచె।

వచ॥ ఆచిగురాకుబోడిని గాంచి దుష్యంతుడు కామోద్రిక్తమనస్కుండై
చెలికానిం జూచి—

ధన్యాసి—మిశ్రగతి.

ప॥ వింటిమా యెందైన। యిట్టిజగన్మోహిని గలదని ।వింటి।
అ॥ కంటిమా కలనైనను సరి। కంతిచేతిలో కటారి ।వింటి॥
మి॥ తుంటవిల్తుజనకుడైన। కంటజూచి నిలువగలడె
కంటగించి యప్సరసల। కరుణించునె సురపతియును ।వింటి॥

ఉ॥ దానివిలాస పుంగుములు దాని మనోజ శరాక్షియుగ్మ మ
ద్దాని కుచద్వయీగరిమ దానివళిత్రయి సుందరంబు య
ద్దాని పిరుందులందమును దానియొయారము దానిహావముల్
గానము మున్ను నెందయిన గానము దానికి సాటియయ్యదే॥

వచ॥ అని సమీహించిన నమ్మానినీ వతంసం బాతిథ్యం బొసంగిన—

మ॥ వనితా యెవ్వరిదానవీవు యిటు కణ్వావాస మందుంటి నీ
జనకుండెవ్వరు నామమేమి నను మెచ్చం జేసి తాతిథ్యతన్
నినుపెండ్లాడిన భాగ్యశాలి యెవడో నీ రేజపత్రాక్షి యె
ల్ల నెరింగింపగదే యనంగవిటులా లావణ్యతాబల్కెడున్॥

సీ॥ జననాథ మేనక యను కామినీమణిన్ వరియించె గాధినందనుడు మున్ను
సంసారగోష్ఠినిం జరుప కాలము కొంత గర్భమైయామెకు గల్గినాను
పుత్రికామోహంబు బోనాడి మేనక భువి పయినన్విడి దివికి నేగ
తప మొనర్చుచు గాధితనయుండునన్విడనాడె నంతటను కణ్వముని కరుణ
తోడగొని తెచ్చి పెంచెనో రేడ నేట
రేపటం బెండ్లి గావింప భూపవరుల
వెదకుచున్నాడు తగిన పృథ్వీశుకొరకు
యిప్పుడేగెను నాతండ్రి యింద్రసభకు॥

వచ॥ అని యెఱిఁగించిన దుష్యంతనృపాలుండా శకుంతలంగని——

మాంజ——బాలానినుఁగనినంతట నేనతి। బాళిగాంచితిని నేను
లోలాక్షి కింపంగ రమ్ము భువి। పాలుండను దయజూడు॥

సీ॥ నను వరించిన నీతండ్రి కిది హితంబు
గలుగు రాపుత్రివగుటనో లలన చెల్లు
నీకు గాంధర్వ మై వాహ మీకుటీర
ముననె విహరింత మననాని మోమువాంచి॥

వచ॥ ఆర్యా! తామెవ్వరో నేను దుష్యంతనృపాలుఁ వరియించితినన
నతండు సంతసిలి కలయూపెరింగింప గాంధర్వవిధిని——

కం॥ నరపాలుడు మేనకసుత మరుకేళిని మెలగుచొక్క మాసంబుండన్
తరుణికి మూలెర్పడగను ధరణీశుండనియె కూర్మి తలగియెటొచనన్॥

మ॥ సరసీజేక్షణ నేను వేటకయి కాంక్షం జేరి తిన్నిందునన్
నరిగన్ బెక్కుదినంబు లేగతిని రాజ్యంబుండెనో గాంచగా
న్నరుగన్నెంచితినీవు నీజనకునాజ్ఞాబద్ధతన్ రమ్మటం
చు రయంబొప్ప నృపాలుడామెవిడి దానుంజేరె పట్ణంబుకున్॥

వచ॥ అంత కొన్నిదినంబులకు కణ్వుడరుదెంచి గతంబాలించి సంతసించె.
నవ్వల శకుంతలాగర్భంబున శుభముహూర్తంబున కుమారుండుద
యించిన-కణ్వుండు——

కమాచి——చతురశ్రగతి.

ప॥ పోయిరమ్మా ప్రియకుమారి। భూవిభుడౌ విభుకడకు॥పో॥

అ॥ శ్రేయమ్ములు గల్గుత నీ। చిన్నవానిగొని రయమున॥పోయి॥

2 ఉత్తమామలనుభక్తి। నాదరించి పూజింపుము
చిత్తము హరియందుంచుము। సేవించుము ప్రాణేశ్వరు॥పోయి॥

గీ॥ అనుచు మునిబాలకులను తోడంపిన జని
కొలువునందున్న దుష్యంతునకును నమస్క
రించి బాలునిజూపి నరేంద్రుడెరుగ
వట్లుమూరాడకున్న నయ్యతివయనియె॥

చం॥ నరవర పూరువంశజునికి న్యాయము పుత్రుఁడైనయుంగకున్న న
న్నెరుగవె కణ్వునాశ్రమము కేవసుదేవి వె వేటకాంక్ష సుం
దరి నినుఁజూచి ప్రేమమున దన్పుచుటంచు నమస్కరింపవే
మరచితివే యిటుల్ సలుప మానవనాధుల కెంతు జెల్లునే॥

మంజ—అనినతోనె యశరీరవాణి! యోయవనినాధ యిటువినుము
గనుము పుత్రుఁ నీ సత్యియె కోమరుని। గాంచుము సురసమ్మతము॥

వచ॥ అనిన భార్యాపుత్రుల నేలుకొని దుష్యంతుడు అంబరవాణిచే భ
రింప ప్రోత్సహింపబడుకతన భరతుండని కొమరునకు నామంబుంచె.
నాభరతుడు పాలించుకతన నిదిభరతఖండమునాబడె. వతనికి వితథుం
డు, వానికి మన్యువు, వానికి నరుడు, వానికి రంతిదేవుండు జనించిరిట్లు
యయాతివంశంబవిచ్ఛిన్నంబుగా సాగుచుండె. నికనజామీఢునకు
ఋక్షుండు, వానికి సంవరుణుండు, వానికి తపతి, వానికి కురువు, అతని
పాలితంబగుతలంబు కురు క్షేత్రంబయ్యె. నాకురువునకు సుధనువు.
వానికిసుహోత్రుడు, వానికి చ్యవనుండు, వానికి కృతి, వానికి వసువు,
వానికి బృహద్రథుడు, వానికి కుశాగ్రుండు, వానికి ఋషభుండు,
వానికి సత్యహితుడు, వానికి పుష్పవంతుడు, వానికి జహ్నువు, వానికి
సురథుండు, వానికి విధూరథుండు, వానికి సార్వభౌముడు, వానికి
జయత్సేనుండు, వానికి రథికుండు, వానికి నయుతాయువు, వానికి
క్రోధనుడు, వానికి దేవాతిథి, వానికి ఋక్షుండు, వానికి భీమసేనుండు,
వానికి ప్రతీపుండు, వానికి దేవాపి, శంతనబాహ్లికులు జనించిరి—

మంజ—ఆదేవాపి తపోనియతాత్మను। వడవిజేరె బాల్యమున
ఆదట మాతామహరాజ్యమ్మున। కరిగె నాబాహ్లికుండు
2 శంతనుండు రాజ్యాధినాయకత। చాలకాలమిలనేలెగా
పంతుగాంచె గంగాసతియందున। సద్గుణగణు నతిబాలిగా॥

వచ॥ ఆకుమారుండు భీష్ముండనబరగె. నాశంతనునకు దాశకన్యకయగు
సత్యవతియందు చిత్రాంగద విచిత్రవీర్యులం బుట్టె రందు చిత్రాంగ
దుండు గంధర్వులవలనహతుడైన భీష్ముండు కాశీరాజుకుమారికలగు
అంబికాంబాలికలనుదెచ్చి విచిత్రవీర్యున కంటగట్టె. నతండుసంతాన

రహితుండై మృతినందిన తల్లియగు సత్యవతి పనుపున వ్యాసుండు క్రమముగా వారికి ధృతరాష్ట్ర పాండురాజుల నొసంగె. నందుధృత రాష్ట్రునకు గాంధారియందు దుర్యోధనాది పుత్రశతంబును దుస్సల యనుకన్యకయు జన్మించిరి. పాండురాజుసతులగు కుంతీమాద్రులకు ధర్మ భీమార్జున నకులసహదేవులు జనించిరి. వారలకు ద్రౌపది యందు క్రమంబుగా ప్రతివింధ్యుండు శ్రుతసేనుండు శ్రుతకీర్తి శతానీకుండు శ్రుతకర్ముండు ననుకుమారులుదయించిరి. కాక ధర్మరాజునకు పౌరవతియందు దేవకుండును, భీమునకు హిడింబియందు ఘటోత్కచుండును, కాళియందు సర్వగతుండును, సహదేవునకు విజయయందు సుహోత్రుండును, నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును, అర్జునునకు నులూపియందు యిలావంతుడును, చిత్రాంగదయందు బభ్రువాహనుడును, సుభద్రయందభిమన్యుడును జనించిరి. పరీక్షిద్భూపాలా యిదిమీవంశము. యికముందు యిరువదియైదవ వాడు బ్రహ్మక్షత్రుడు వానితో మీవంశమంతరించును—

గీ॥ ఆయయాతి తనయులందు జ్యేష్ఠుండగు
యదువువంశ వివరమాలకింపు
భక్తితోడవిన్న వ్రాసినచదివిన
పుట్టబోడు హరియెబుట్టుకతన॥

వచ॥ అయ్యాదువునకు ముప్పదిరెండవ వాడగు కురువునకు వృష్ణియు, వానికి లోమనుండును, వానికి కపోతరోముడు, వానికి యనువు, వానికి దుందుభి, వానికి విద్యోతనుండు, వానికి బునర్వసువు, వానికి నాహుకుండు, వానికి దేవకుండు, నుగ్రసేనుండునను వారిద్దరు జనించిరి. అందుదేవకునకు నల్గురుకుమారులును, దేవకీదేవి మొదలగు కుమారిక లేడ్వురును జనించిరి. రెండవవాడగునుగ్రసేనునకు గంసాదులు తొమ్మండుగురు గల్గిరి—

మంజ—ఆకంసుడవనీ భారము । కన్నలపెదతండ్రిని జంపెన్
లోకంబున బల్దురితాత్ముం । డై కూరకర్మలం జలిపెన్॥

వచ॥ అది అట్లుండ అంధకునికుమారుండగు భజమానునకు విదూరథుడు బుట్టె. వానికి శినియు, వానికి భోజుండును, హృదికుండును గల్గిరి. అందు హృదికునకు దేవమీఢుండు అతనికి శూరుండు గల్గెరు.

గీ॥ శూరుడాత్మసతియు సుందరిమారిష
యనెడుదానివలన నధికబలుల
సుతులబదుగురపయి సుతల నేవురగాంచె
దోసతోటనంగ భాసురముగ॥

వచ॥ వసుదేవుండు, దేవభాగుండు, దేవశ్రవుండు, నారకుండు, సృంజయుడు, శ్యామకుండు, కంకుండు, నసీకుండు, వత్సకుండు, వృకుండు. ననుకుమారులను పృథయను నామాంతరముగల కుంతియు, శ్రుతదేవయు, శ్రుతకీర్తియు, శ్రుతశ్రవసయు. రాజాధిదేవియు నను కుమారికలగాంచె. నందు పెద్దదియగు పృథనుమిత్రుడగు కుంతిభోజునకు దత్తపుత్రికగానిడుట నది కుంతియనబరగె, నాయమకుంతిభోజునియింట బెరుగుచుండ దుర్వాసుడరుదెంచి వేల్పులంజీరు విద్య నెరింగించె—

ఉ॥ చిన్నతనంబు నన్పృథ యశేషఫలప్రద మంత్రశక్తిచే
గ్రిన్ననమింటిభాస్కరుని రమ్మనిచీరిన వచ్చి వెంటపా
మ్మన్నను రిత్తపోక నొకయర్భకు నాయమకిచ్చె నామెయు
న్నన్న యిటులగల్గె ననునారడిపుచ్చరె లోకులెల్లరున్॥

శుభపంథవరాళి—చతురశ్రగతి.

ప॥ ఏమసేతుదైవమా న। న్నిట్లు జేసితే ॥ఏమ॥
అ॥ యీమహిదలమెత్తితిరుగ। నెట్లగును వివస్వత ॥యేమి॥
2 కన్నియ నే చిన్నవాని। గాంచితినని విన నగరే
నన్నెవ్వరు వరియింతురు। నాగతి యెటుగావలెనో ॥యేమి॥

చం॥ అనివిలపించి బాలకుని యందొకచోటను నిల్పిదాదిచే
ఘన మయమందసం బారుల గాంచగ నీకయ దేనొనర్చి లో

ననికి సముద్రవేగమున వచ్చిజన న్నావరించి యిల్లుజే
రనగని సూతుడాసుతుని ప్రేమను బెంచుకొనె న్గుమారుగన్॥

వచ॥ ఆబాలకుండే భారతరణ మూలకందంబగు కర్ణుండు నాకుంతీదేవిని హస్తినాపురాధిపుండగు పాండురాజు వివాహంబాడె. నామెతో బుట్టువగు శ్రుతశ్రవసను చేదిభూమీశుండు దమఘోషుండు వరింప వారికి శిశుపాలుండుగల్గె, నామెసోదరియగు శ్రుతదేవను వృద్ధశర్మ వరింప వారికి దంతవక్త్రుండుబుట్టె. నిట్లుకడమవారలుగూడా సంతానవంతులైరి. కంసచెలియండ్రు వసుదేవానుజులు వరించి సంతానవంతులైరి. యిక వసుదేవుండు—

సీ॥ రోహిణీసతిని వివాహంబాడి బలగదసారణవిపుల ధృవాదులగనె
పౌరవియందు సుబాహుసుభద్ర దుర్మదభద్రులనెడి కుమారులగనె
మదిరనువరియించి మరియు నందోపనందనకృతకాదుల తనయులగనె
కౌసల్యయందున ఘనకేశిరోచనయందు ప్రహస్త హేమాంగదుగనె
యవల నిళయందు యదుముఖ్యులైనవారి
వెలయు శృతదేవయందు ద్విపృష్ఠునొకని
శాంతియందున బదుగుర సాహదేవ
వలన నెనమండ్రు తనయులంబడసె నధిప॥

వచ॥ ఆవలదేవకియందు క్రమంబుగా కీర్తిమంతుడు, సుషేణుండు, భద్రసేనుండును, ఋజువును, సదమనుండును, భద్రుండును, సంకర్షణుండును, నను యేమ్వురగాంచి కంసకరవాలంబున కర్పించె. నావల—

మంజ—దుష్టహావన మొనరింపగ। పాపులతోడ్తోగడ తేర్పగను
శిష్టజనావనుడగు శ్రీహరి। కృష్ణుండై జనియించగను॥

వచ॥ ఆబాలకుని నందయశోదలకడ నుంప నతండు బెద్దయై కంసాదివిమతుల వధియించెనన పరీక్షన్మహారాజు శుకయోగీంద్రా ఆశ్రీకృష్ణ పరమాత్మ చరితంబనేకభంగుల వచియింతు రదిసాకల్యంబుగా నెరిగింప వేయునునది శ్రీమహాభాగవతాంతర్గత నవమస్కంధము—

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ.



శ్రీరస్తు—అవిఘ్నమస్తు.

శ్రీగురుపరబ్రహ్మణే నమః.

# శ్రీ కృ ష్ణ భా గ వ త ము.

(హరికథ)

## ద శ మ స్కం ధ ము

—:0.—

### 13 శ్రీకృష్ణ జననము

గీ॥ శుకమునీంద్రుఁ డుత్తరసుతున కనియె నటు। లుగ్రసేనాత్మజుడు
కంసుడుజ్వలముగ। సోదరిని దేవకీదేవి శూరసేను। తనయుఁడగు
వసుదేవుని దారఁ జేసి॥

మంజ—చెల్లెలినిన్ శ్వశురాలయంబుకడ। జేర్చి రాగ నుంకించీ
యుల్లము సంతసవార్ధిదేల రథ। మున్నెక్కగ గావించీ॥

వచ॥ కంసనృపాలుండే రథచోదకుండై చనుచుండ మార్గమధ్యంబున
నెల్లరాలింప నంబరవాణి యిట్లనియె—

మంజ—అవురా కంసా సంతసింప కీ। యతివ నందనులలో
తవునని యెన్మిదవవాడు మారక। మవ్వురా నీకీయిలలో॥

గీ॥ కంసుఁడరెత్తియాలించి కనకరథము। వేగడిగి కరవాలంబులాగి
కోప। ముక్కు మిగులంగ చెల్లెలురెక్కబట్టి। డిగిచినంగాంచి
యావసుదేవుఁడడలి॥

మలయమారుతము—చతురశ్రి.

ప॥ బావాతగునా। యిది శ్రేయమగునా ॥బావా॥

అ॥ కోవిదుండవు సర్వమెరిగిన। కువలయేశుఁడ విట్లుప్రేమిడి
బోవిడచి చెల్లెలినింజంపగ। బూన నగరెయెల్లరునునా ॥బావా॥

మ॥ అనివార్యక్రోధరింపగ కంసు డిట్లనియె। బావా మింటిపల్కుల్ విసర్
తనకుంగానిది ధర్మముస్సదయ। చిత్తంబందు నర్ దాల్ప కీ
వనితంజంపి మహోక్ర చండవిమూఖుర్ వైవాహముంజేతు నీ
కు ననున్నష్టకు హొమ్మలున్నగని యాకార్యరాత్మతో నిట్లనున్॥

వచ॥ బావా! కంసరాజా! స్త్రీహత్య కేలబూనెదవు. యీసతికిజనించు
కుమారునివలనఁగదా! నీకుభయము—

గీ॥ తరుణికిజనించు బిడ్డలందరను నీకు। నిచ్చెదను వారిజంపు మీ
యింతివిడుపు। మనిన సరియని కంసుఁడా యతివవిడచి। యింటి
కేగెను పైకొన్ని యేండ్లుగడువ॥

వచ॥ దేవకీదేవి చూలుధరించి కీర్తిమంతుఁడను కుమారుంగాంచె. వసు
దేవుఁడాడితప్పజాలక నాబాలకుని కంసుదరికిదెచ్చి—

మంజ—బావానీచెలియలు యీబాలుని। ప్రసవించెను గనునేడు
వేవేగమ పినిందెగజూచియు। భీతినీమదినిపిడు

2 మనిమెరిగించిన కంసుండనునో। యనఘా యిటువినుము
ననుభయపెట్టున దష్టముగర్భము। గనుకవీని గొనిచనుము॥

గీ॥ అనుచు మరలబాలు నావసుదేవున। కొసగిపంపుపిదప కొడు
లేవు। రుద్భవిల్లిరొకట లోకసంచారి నా। రదుఁడు వచ్చికంస
రాజుకనియె॥

భైరవి—రూపకం.

ప॥ కంసరాజ చిత్రతరము। గానున్నది కొలదిలోనె ॥కంస॥
అ॥ హంసవాహను కడవింటిని। యదినీకెరిగింప గంటిని ॥కంస॥

2 సురలందరు యాదవులై। ధరణిజనించిరి యిక శ్రీ
హరిదేవకి గర్భంబున। యవతరించునట వింటివె ॥కంస॥

3 భూమిదేవికి నీబోటులు। మోయరాని భారమంట
నామురారి మిమ్మందర। హతమార్ప జనించునంట ॥కంస॥

చ॥ అనివచియించియేగు కలహాశను పల్కులకంసు డెంతయున్
కనలువహించి చిత్తమున గంపిలి యావసుదేవు దేవకిన్

జనకునిఁగూడఁబట్టి చెరసాలనుబెట్టి గలంచుచుండ నా
వనితకు గర్భమేడవది భంగమునందుట మోదమందుచుఁ ।

వచ॥ జాగరూకత వర్తింపుచుండ మరల దేవకీదేవిగర్భంబు ధరియించిన విధాతసహితనిలింప బృందంబరుదెంచి యామెగర్భస్థబాలునింగురించి.

బిలహరి—చతురశ్రజాతి.

ప॥ సకలలోకపాలనా । శరధిశయానా దీన ॥సక॥

అ॥ అకలుష వర్తనావనా । యఘవినాశనా ॥సక॥

2 నీమహిమార్ణవమీద । నేరకోను మురహరా
భూమిసతీ భారముడుప । బుట్టొందితి ద్వాపరమున ॥సక॥

గీ॥ అనుచుప్రార్థించి నిర్జరులరిగినంత । నెలలు తొమ్మిదిగడచిన నెల మిశ్రావ । శ్రాఖ్యమాసంబు మరుపక్షమందు నష్ట । మిని మహా విష్ణుమూర్తి భూమినిజనించె॥

మంజ—నలుభుజములునున శంఖచక్రముల । నవతరించి యంతఁ
కిలకిలనగి దేవకీవసుదేవుల । కీగతివచించె వింతఁ॥

వచ॥ మీకు మున్మూరు జన్మింతునని యిచ్చినవరం బింతతో దీరినది. నన్ను వెంటనే గొనిచని వ్రేపల్లెలో యశోదప్రక్కం బరుండబెట్టి, యాపెప్రక్కనున్న బాలికంగొనిరండు. నాతో నటయోగమాయ జనించినది. దానినే, దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, యీశాన, శారద, యంబిక, నాబడునాల్గు నామంబుల మనుజులు గొనియాడుదురని—

మంజ—శ్రీలలనాధవుఁడంతట గనకడు । చిత్రంబుగ చెరసాలఁ
బాలుండై పడియుండ తండ్రిగని । పట్టినెత్తియుటుగదలఁ॥

గీ॥ ద్వారములు తెరచుచున్నాయి చారయహరి । పానుపగు శేషు డండగా బరగుచుండ । మధురవిడనాడి వ్రేపల్లెమాపటికడ । జేరి వసుదేవుఁడాతనిం జేర్చెతల్లి॥

వచ॥ ఆయువ్వకడనున్న బాలికందెచ్చి చెరయందున్న దేవకికడ నిడునంత నాబాలరోదనంబునం గావలివారలు మేల్కాంచి కంసుకడకరిగియెఱిగింప,

మంజ—కరవాలంబుచేతికి పెంపఁ్రిలుచు । కటములదర కంసుండు
పిరపిర దేవకీఁదాసి బిడ్డనతి వేగలాగికొని జంకు॥

మలయమారుతము—చతురశ్రగతి.

ప॥ అన్నా వినుమా । విన్నపమొక్కటి ॥అన్నా॥

అ॥ మన్నించుము దయ । నించుము చెల్లెల ॥నన్నా॥

1 అల్లుఁడు నీమారుకుడని వింటివి । యటులే నాబిడ్డల బొరిగొంటివి
యిల్లిపుడీకోడలివిడనాడుము। వేడుకొందు సుతభిక్షమిమ్మనుచు॥అన్నా॥

గీ॥ అనుచు దుఃఖించుసోదరి నట్టెగెంటి । బాలికను నేల వైవగాదూల
కంబ । రంబునన్నిల్చి కంసమారకుఁడువృద్ధి । నందుచున్నాఁడు
యొక్కెడ ననుచుబలికె॥

వచ॥ కంసుండరెరెత్తిమూఢ నామాయాబాల యోరీదుర్మతీ దేవకీబిడ్డల
నెందర బొరిగొంటివి. ఇకనీపాపము పండినది. కొలది దినమ్ములో
పికంబట్టుము. యని యంబరమార్గంబున నెందోజనిన—

గీ॥ కంసుఁడాదంపతులగాంచి కడుకృతఘ్ను । డనుజదుండ బాలక
ఘాతి నను క్షమింపుఁ । డనిసభకునేగి నన్గంపునర్భకుండు । యొం
దునోవృద్ధి గనునట యేమిసేతు॥

మంజ—అనియోచించియు పూతనాదులను । యరసిదేశమంతటను
గనిబాలుర మ్రింరింపుఁడనుచు వెస । బనిచె యుల్లమలరగను॥

గీ॥ అంతవ్రేపల్లెవాన వ్రజాంగనలెద । సంతసిలి నందతనయుని జన
నమునకు । వలయురీతుల యుపచారములు బొనర్చి । పెంచుచుం
డిరి కృష్ణుడన్ పేరుబెట్టి॥

ఉ॥ ఒక్కదినంబు కృష్ణు రజితోజ్వలతొట్లె భరుండబెట్టి పెం
పెక్కవపూర్మనూచి నిదురింపగజేయ నృపాలునాజ్ఞచే
రక్కసకాంత పూతనకరంబు విషోక్త కుచంబు లొప్పగా
వక్కడకేగుదెంచెను వ్రజాంగన వోలెనుసుందరాంగియై॥

వచ॥ వచ్చి బాలునింగాంచి అవారంబునంబోలె యెత్తియుద్దాడి—

కాంభోజి—త్రిశ్రగతి.

ప॥ చిన్ని బాలనా । చన్నుగుడువరా ॥చిన్ని॥

అ॥ నిన్నుగనినయంత । నన్నాచేపువచ్చె ।చిన్ని॥

1 యింతచక్కవయ్య । వెట్లుబుట్టితివిరా
పంతమేలలేరా । పాలుద్రావిపోరా ॥చిన్ని॥

గీ॥ అనుచుగోపాంగనలు వద్దటన్నవినక । బాలకృష్ణునియెత్తి చన్బా
లొసంగ । నతఁడు విషయుత క్షీరంబు లామెప్రాణ । వాయువు
ల్లాగె నొకగుక్కబట్టియంత॥

మంజ—విలవిలదన్నుక పూతనపుడమీ । స్త్రలిబడి వెస మృతినందెన్
జలములదీశియు భూతిరక్షనిడి । చంటివాని తలిచేనందెన్॥

వచ॥ అంత కొంతకాలంబు కడ చన కంసునిపంపున శకటాసురుండు
యరుదెంచి—

ఉ॥ నందకుమారుడున్న సదనంబు సమీపము నన్వసింప నా
చందమెఱుంగక న్శిశువుశయ్యను దత్శకటంబు నీడ ని
ల్పా దనుజాంతకుండు చిరుపాద విఘట్టనసల్పినన్ జనుల్
గొందలమంద రక్కసుడు గూలెనుప్రాణమువీడి భూమిపై॥

మంజ—అంతనొక్కవత్సరము గడువనగ । నాకంసుని పంపునను
వింతరక్కసుఁడు తృణావర్తుఁడొక । వృషదశ్వుని గతిగాను॥

వచ॥ వచ్చి బాలకృష్ణుని సుడిగాలియై యెత్తుకొని యంబరవీధి కెగసిన
శ్రీకృష్ణుండు వానిమెడంబట్టి భువింబడగొట్టిన నతండు మృతినందె-

గీ॥ ఇట్లు కంసుండుగావించు నెగ్గులెల్ల । గడచి శైశవమును గాంచి
బుడుతలజత । నాటలాడుచు గవవ్రజబోటులిండ్ల , దుడుకు పనులను
గావింప దొడగెనంత॥

వచ॥ గోపకాంత లరుదెంచి యశోదాదేవింగాంచి—

దివ్యమణి—రూపకం.

ప॥ అమ్మవినుము విన్నవింతుము । చిన్నికృష్ణుని కొంటెపనుల ॥నమ్మ॥

అ॥ యిమ్మగుమను జీరిమోవి । నిట్టిగరచి వడిపరువిడె ॥నమ్మ॥

2 బాలులకును పాలు లేవని । బాలెంతలు మొరలిడవిని
నాలకు గోపులను విడచె । నాలము చేయుచు నగుచు ॥నమ్మ॥
3 వారింటను గలకడవల । తోరంబగు నెయ్యిదాగి
వీరింట నాకడవలనిడ । ఘోరంబగు పోరాదవెను ॥అమ్మ॥
4 బంతితప్పివచ్చి పడెనని । భవనము వెనుకకు జేరి
యింతిజలకములాడుచుండ । చెంతనున్న వలువదెచ్చె ॥నమ్మ॥
మంజ—వారింటను వెన్నందిని కోడలి । వదనంబునకును బూసెగా
మీారి దొంగవీవనుచు నత్తకడు । దూరిదండనము జేసెగా ॥
2 కొడుకులు లేరని యాసతికడువగ । గుడువ నీకొడుకు వినిరోగా
కొడుకులు గల్గుదురిక ననుమగనిగ । గొనుమంచని పైబడిరోగా
3 నిదురగాంచు మాపట్టిమంచు నొక । మదయుత లేగకుగట్టెగా
యదలించుచు వీధులవెంటనుదా । నతిమోదంబున దిప్పెగా ॥
గీ॥ అనుచువచియించు వారలకనియెనాకు । మారుడెప్పుడు నను
విడిపారుటెరుంగ । డైన నేమందలింతు మీారలుగుడుంచు । వార
లంబంపి కొమరుని చీరియెత్తి॥
వచ॥ ముద్దాడుచున్నంత బలరామాదులరుదెంచి, అమ్మా! కృష్ణుండు
మన్నుదినెనని యెరింగింప, యశోదాదేవి బాలకృష్ణున కిట్లనియె.—
మంజ—మన్నుదినగ నీకర్మమేమి నా । యన్నయుడుగరలు లేవే
వెన్నలేదె కావలసినంత లే । కున్న దెచ్చినీకిడనే॥
శ్లో—చతురశ్రగతి.
అ॥ అమ్మ మన్నుదిందునా । అంత తెలివిహీనుడనా ॥అమ్మ॥
అ॥ నమ్మకుమా వీరిమాట । నన్నుగొట్టింపనెంచి
యిమ్మార్గముబన్నిరి కా । దేనింజూడుము నోరు ॥అమ్మ॥
కం॥ అని నోరుదెరచి చూపిన । గనినందునిపత్ని దానగల సర్వజగా
లిని విష్ణుమాత్వముంగని । యనుమానమ్ముదలగి విష్ణుడనినమ్మె వెనగ ॥
మ॥ కలయో వైష్ణవమాయయో యితరసంకల్పార్థమో సత్యమో
తలపన్నేరక నున్న దానవో యశోదాదేవిగా నో పర

స్తలమో బాలకుడెంత యీతని ముఖస్తంబై యజాండంబు ప్ర
జ్వలమైయుండుట కేమి హేతువో మహాశ్చర్యంబు చింతింపగా॥

వచ॥ అనిభక్తిభావంబునం దలంచుచున్న యశోదాదేవికి భగవంతుండు
మాయంబొదవించిన నామెబిడ్డనెత్తి ముద్దాడె. నవ్వలనొకనాడుదధి
భాండ వికలనంబాచరింప, యశోదకోపించి తనలోవిచారించి యెట్ట
కేలకు (శ్రీ)కృష్ణునింబట్టి—

మంజ—త్రాళ్లులచేనొకరోల యశోదా। తరుణిబాలుని బిగించె
బాలుడు రోలీడ్చుకయమ్ధువతరు। వరముల రెంటిని గూల్చె॥

2 ఆమద్దులు భువిబడి గంధర్వులు। నై యంజలినంధించి
(శ్రీ)మాధవ దామోదర యనినుతి। జేసిరిట్లు తలవంచి॥

కళ్యాణి—రూపకం.

ప॥ పరమపురుష దామోదర హరి। పద్మనాభ (శ్రీ)నరకేసరి ॥పర॥

అ॥ దురితాటవి భీకరకుఠార। తోయజాక్ష (శ్రీ)భక్తరక్షణ ॥పర॥

2 నీకరుణను మాఘోరశాపములు। దీరెముక్తులము నైతిమి
మోకంజాక్షా నీపద। యుగ్మమెంద వసింపజేయుము ॥పర॥

వచ॥ అనిప్రార్థించి గంధర్వలోకంబరిగిరి యుపపరీక్షితుండు యోగీంద్రా
ఆగంధర్వులెవ్వ రేకారణంబున నెవ్వరివలన నీశాపంబుగల్గిన దెరి
గింపవేయున-శుకుండిట్లనియె—

గీ॥ ధనదుని కుమారులిర్వురు తరుణులగూని। వెండికొండ వంటుంజేరి
యుండివస్త్ర। హీనతంజరియింపగా గానరతుడు। నారదుడుగాం
చిశపియించె వారినిట్లు॥

మంజ—వర్షములేకయె పిడుగులు వడకయె। బాకివృక్షములెట్లు బడుటకా
హార్షంబునకును మూరుగభీతిని। యాదవులకు నొగిబిడుటకా॥

గీ॥ ఎదియొ మహోత్పాతహేతువు యేయని భయ। మంది వ్రేపల్లెవీడి
బృందావనమున। వాసమొనరింప నూహించి పశులసతుల।
హితులతో నటకేగిరి యెల్లవారు॥

వచ॥ అటుబలరామకృష్ణులు యాదవకుమారులం గలసి కేళ్ళిలమేమ

యమునానదీతటంబునకరుగ కంసుపంపున నొక్కరక్కసుండు క్రేపు
రూపమూని మందనున్నంగని కృష్ణుండు——

మ॥ గనుడీ నేడొక మంచిలేగ పశుసంఘంబందునం జేరె నా
మనముత్సుక్యము జెందె ముద్దుగొన బల్మారిటుల్ వృథాగాదె యం
చనియావత్సముజాసి పాదములు పుచ్ఛంబుల్ బిగంబట్టి యొ
క్కనగంబందున వ్రేసిచంపె నదివీకల్ యార్వగోయంచునుల్॥

గీ॥ యిట్లు వత్సాసురుండు నశించు మీద। గొంగడులు నెత్తి యెగు
రుచు గోపబాలు। రమిత సంతసమున కృష్ణునభినుతించి। రంత
నొక్కదినంబు వనాంతమందు॥

వచ॥ బకాసురుండరుదెంచి కాసారంబుదరి నిలచిన కృష్ణుండెరింగి వాని
దరియగా——

మంజ——బలవంతంబున శ్రీకృష్ణునియా। బకాసురుడు మింగెన్
వెలవెలబోవుచు తోడిబాలకులు। భీతివనధిలో గుంగెన్॥

2 కృష్ణుడంత నద్దానిగర్భమును। జీల్చి వెలికిదావచ్చెన్
జిష్ణుడు పూవులవానగురియ। నాచెడు రక్కసుడటుచచ్చెన్॥

వచ॥ ఆవలనొకనాడు కంసపంపున యఘాసురుండు అజగరాకారంబున
వచ్చిన శ్రీకృష్ణుండెరింగి మిన్నకున్న నదిమార్గంబునడ్డి గోపాల
బాలురంగోవులన్రి మ్రింగిన కృష్ణుండు దానిదవడలంజీల్చి చెండాడి
దానిగర్భంబునుండి గోగోపబాలురందీసి కృష్ణుండు వారలకిట్లనియె-

సురటు——త్రిశ్రగతి.

ప॥ చలిదిదింద మందరమిా। చల్లనివృక్షములనీడ ॥చలి॥

అ॥ జలజాప్తుడు మింటనతి। చండతనము చూపించెడు ॥చలి॥

2 కడుబడలి యుండితిమిా। కాననంబునం దిరిగి
సుడివడితిమి యీచెంగట। చూడపశులు మేయుచుండు ॥చలి॥ (నొక్క

సీ॥ మాటిమాటికి వ్రేలుమడచి యూరించుచు నూరగాయల దినుచుండు
డొకనికంచములోని దొడిసిచయ్యనమ్రింగి చూడులేదని నోరుచూ
పునొక్క। డేగురార్గుర చల్దులెలమి పన్నిదమాడి కూరొక్కని కూరొక్కని

కుడుచునొక్క | డిన్నియు దగబంచి యిడుట నెచ్చెలితనమంచు బం
తెన గుండు లాడునొకడు  గీ॥ కృష్ణుజూడుమంచు గికురించి యొరు
మోవి | మేలిభక్ష్యరాశి మెసవునొకడు | నవ్వునొకడు సఖుల
నవ్వించునొక్కడు | ముచ్చటాడునొకడు మురియునొకడు॥
మంజ— యీగతిచద్దుల నారగించుతరి | నెరిగి గోగోపకులను
వేగానియొక్కెడ దాచియుంచె నా | విధి మాయావిధమునను॥
వచ॥ కృష్ణుండారసి యిదిధాతపనిగా దలంచి—
మ॥ తన మాయావిధి జూపనెంచి పసువత్సాకారముల్ దాల్చి తే
చినలేపచ్చిక నారగింపవొకచో సేనుంబుమైనుండి పి
ల్లనగ్రోవింబలికించియాను హరినిఁ లక్షించి లజ్జించి కృ
ష్ణుని పాదంబుల కంజలొగ్గి సురజ్యేష్ఠుండిట్లు ప్రార్థించెనుఁ॥

మోహన—ఖండగతి.

ప॥ నినుబోలనేనెంత | నీరజాక్షా కృష్ణ ॥నిను॥
అ॥ సనకాదిమునిగణ | సంసేవితాపాద ॥నిను॥
చ॥ అనయంబును తవపాదా | బ్జాతంబులు సేవింతుఁ
ననుపుత్రునికరుణఁ | పాలించుము మేలెంచుము ॥నిను॥
2 బృందారకాదిముని | వందిత మిమ్మెసగగ జా
లం దమకెగ్గుమదలచితి | రక్షింపుమిపుడెరిగి ని
చ॥ సుందర ముల్లోకావన | శుభదాత యఘత్రాత
కందర్పజనక నన్ను | గనుము తప్పులొప్పులుగా ॥నిన్ను॥
గీ॥ అనుచుప్రార్థించి శ్రీకృష్ణు నాదరంబు | వడసి గోగోపకులనిచ్చి
బ్రహ్మచనిన | తోడిబాలురతో క్రీడలాడుకొనుచు | పసువులం
గాచు కృష్ణుండు వనులయందు॥

—:0:—

## 14. శ్రీకృష్ణ లీలలు

గీ॥ అవధరింపుము శ్రీకృష్ణు డవ్వనంబు | నందొక జలాశయంబున
యందునున్న | కాళియాహిని మర్దించి గడపెవనిన | శుకునకయ్యా
భిమన్యుని సూనుడనియె॥

మంజ—కాళీయాహిని మెట్టుజంపె నా। బాలకృష్ణుఁ డాలింపఁగ
బాళిగ త్రొ నెరిగింపవె మొక్కెద। పరమమహాని యనుకంపఁగ॥

వచ। అనిన శుకుండిట్లనియె—

శా॥ కాంతారంబున గోగణంబుచు గృపం గాపాడుచుండంగ ని
శ్చింతన్ లేగ యొకండు కాళియహ్రదశ్రీ డాసినీరంబు దా
నెంతే ద్రావుచు సర్పదృష్టియగుట న్వీక్షించి కృష్ణుండు నా
చెంతన్ వృక్షమొకండు నెక్కి దుమికెన్ చేటొంచకన్ మడువునన్॥

గీ॥ నీటబడి యెంత కేనియు న్వెలికి రాక। యుంటయున్సర్పము బుసలు
యొక్క మొగిని। జలము కల్లోలముంబుచ్చ జడిసిగోప। బాలుర
రిగి యశోదతో బలికిరిట్లు॥

పూరికళ్యాణి—చతురశ్రగతి.

ప॥ ఏమిచెప్పగలమమ్మా। యింతియశోదమ్మా।యేమి॥
అ॥ కోమలాంగుడైనచిన్ని। గోపాలుని కథమేము ॥యేమి॥
2 కాళియహ్రదమందున। గూలెను మాచెలికాడు
యేలనో లేవడు రాడు। యించుకేనింగనరాడు ॥యేమి॥

వచ॥ అనియెరింగించిన యశోదానందులును వ్రేపల్లెవాస వ్రజాంగనలు
ను యాదవులు నొక్కమొగి నమ్మడువుదరిసి విలపించుచుండు నంత
గొంతవడి కందుండి—

మంజ—కాళీయుని ఫణములపై నాట్యము। గావింపుచు కృష్ణుండు
దేలెను జలమధ్యంబున చూపర। దృష్టి సఫలముగజుండు॥

గీ॥ కాళియాహిఫణంబులం దోలినిలచి। పుచ్ఛమొకకేల ధరియించి
మురళినధర। మందుసంధించి గాననాట్యములు సల్పె। కృష్ణుడెం
తయు తాండవ కృష్ణుడయ్యె—

వచ॥ ఇట్లు కృష్ణపదఘట్టనంబున తలలుపగిలి రక్తంబుగార మరణావస్థం
గాంచుతరి యతనిభార్యలందుండి వెలికరుదెంచి అంజలిమోడ్చి—

గీ॥ శరణుదేవకినందనా సకలలోక। రక్షణాదీనపాల మాప్రాణనాథు
విడచి మాకొగిపతిభిక్ష బెట్టుమయ్య। యనగ కృష్ణుండు వారల
కనియె నిటుల॥

వచ॥ మీ ప్రార్థనలకలరి యీదురాత్ముని వీడుచుంటి నికనింమువసియింప కెందేనిం బొండన కాళీయుండు భార్యలతో నానదినివీడి యెందో జనియె. నావలకొంతకాలంబుగడువ శ్రీకృష్ణునకు ద్వాదశాబ్దంబు లుగడచన్న—

మంజ—యమునానదిలో జలకములాడగ। నాత్మలందు దలపోసి
భ్రమరాలకలగు గోపికాంగనలు। వసనంబులు వెసబాసి॥

గీ॥ సైకతస్థలినిడి యజ్జలజాకరమున। డిగి జలకములానందతాడెడి తరినట। కరిగి గోపాలకృష్ణుండు యతివలవలు। వలనుగొనిపొన్న చెట్టెక్కె వార్ధిమెరయ॥

వచ॥ జలక్రీడానంతరయంగనలు తీరంబుజేరి వలువలం గావక—

తోడి—చతురశ్రగతి

ప॥ ఏవే వసనంబు లిందులేవే। యేమాయెనో గనవేమే ॥యేవే॥

అ॥ స్నానమొనరుపగనేడీ జల। జాకరము దరిని నుంచితిమిగద
చానవాని కేచోరుండిటు। బూనిబారసిల్లెనే చెలి ॥యేవే॥

2 ఇంతవింత మున్నెన్నడైన విని। యేనియుంటిమే యీనాటికిమన
కింతకీడు గావించిన యా। వంతకారి యెవ్వరోగద ॥యేవే॥

సీ॥ యెంతయో ప్రీతి నాయేలికనుంగోర వచ్చిన నీలంపు పట్టుచీరె
సాదరంబున భాగసాలకు మావారు తెచ్చిన కరకంచు తెల్లచీరె
పుట్టినట్టికై మొన్నబోవగా మాయన్న సారెయిచ్చిన యెఱ్ఱచారచీరె
సంక్రాంతినాడు వేచగ నాదుమామ తెచ్చిన యట్టి రేషము సిల్కుచీరె

గీ॥ మొన్న నాముహూర్తమునకు మురిపెములర। తెచ్చియిచ్చిన పువ్వుల పచ్చచీరె। నాది నాదని చెలువలు ఖేద విభ్రమ। మాళిగారింప వగచు చున్నంతలోన॥

కం॥ తరువుపయి నిలచి కృష్ణుడు। మురళీనాదంబు సకలమోహన గతిగా విరచింప గోపికాంగన। లరసిడి తలలెత్తి దొంగ యజ్ఞాత్మునుగా॥

వచ॥ మరల జలంబులందులోక్షి కంఠాధఃకటి పర్యంతము మునింగి గోపాల కృష్ణునింగాంచి—

కాంభోజి — రూపకం.

ప॥ తగునె యిటులకొంటెపనికి బాలికలగనీవు కృష్ణ ॥తగు॥

అ॥ మగువల చేలంబులు గొని మహీజముపై నెక్కితివా ॥తగు॥

చ॥ మగవారెవ్వరైన యిట్టి మాటవిన్న లోకులనిను
నగరె మాకు సిగ్గుగాదె న్యాయమార్గ మూహింపవె ॥తగు॥

2 లేకేమను బాలకులు కారె కొంటెవారిట్టులు
చీరెలు దొంగిలి పతుల కీలము గొనువారు గలరె

చ॥ నేరిచితివా యీకట్టులో పేరుగాంచె వతీ తుంటరి మా
వారిపై వచ్చిరి నిన్నిక బట్టికొట్టెదరు పాపముయిటు ॥తగు॥

గీ॥ అనుచు బెదిరించు గోపికలను గనుగొని కృష్ణుడను జవ్వనులు మీ
కిదేల సిగ్గు లజ్జ విడకాముష్మికము లలవియగునని తలతురే వెరు
లార నీర్వెలికిరండు॥

మ॥ ననుచింతింపుచు దానధర్మములు చానల్ మీరుగావించుటల్
గని మీకోరికిదే దీర్చ నీపగిది మీలజ్జావికంబూన్చి నా
డను తీరంబునుజెంది చేతులను పైనెంత పైకెత్తి వం
దనముంజేసిన చీరలుస్తలపులున్ నైవారగా నిచ్చెదన్॥

వచ॥ నేనెరుంగనిది లేదు. మీకేల లజ్జ వెలికిరండని పదింబదిగా బిల్చిన
యక్కాంతలు తత్తరపడి తలగుట మోహాయత్తలగుట జలంబుల
నుండి వెలికరుదెంచి కరములెత్తి అంజలులుమోడ్చి—

కేదారగౌళ — ఆది.

ప॥ కృష్ణా, పరాత్పరా। అఖిలలోక పాలనకరా ॥కృష్ణా॥

అ॥ అనఘభక్తలోకమందారా। దురితహారా
వినుతదేవసంఘ నిన్ను। వేడెదమిక చేలములిడు ॥కృష్ణా॥

2 నిన్ను నమ్మియున్న వ్రజ। కన్నెలనిటు పరాభవింప
వెన్నలదొంగా తగునా। వేదజనక నిన్నెరుగమె॥ కృష్ణా॥

గీ॥ అనుచు ప్రార్థించు నాగోపికాంగనలకు। చేలములొసంగి కృపజూచి
శ్రీరమేశు। డాలగాయుచునుండ గోపాలురెల్ల। రొక్కయెడ పెద్ద
సభజేరి యుండిరంత॥

కం॥ నందుండను ప్రీతియుద్ధము। నందేవేంద్రునకు పూజనము సేయగ నెం
దుందరుగులేని కసవున। మందలవాలించుకొంచు మనుటలెరుగమే॥

వచ॥ గాన శేపు యింద్రపూజనం బాచరింతమన నందరంములకు వలయు
యత్నంబు లాచరించుచుండ కృష్ణుండాలించి వారింపదలచి—

మంజ—మెంనుల కింద్రుని పూజనంబు। గావింపుచుండెదరు తెలియర్
ముందుగ నాకెరిగింపుండన। యానందుడు కొమరునకనియెన్॥

2 ఇంద్రునిపూజన మొనరించిన దా। నెంతో సంతసము గాంచున్
సాంద్రదయను మేఘుంబుల! బంచివర్షంబెంతయు గురిపించున్॥

3 వర్షముపడుటను పచ్చిక శాద్వల। భాగంబుల బగ పెరుగన్
హార్షమ్మున పసుగణము దానిదిని। అతిశయ సంపదగలుగున్॥

వచ॥ అందులకై ప్రీతియుద్ధం బిట్లాచరింపు చున్నారమనవిని కృష్ణుండు
నవ్వి మీరలెంత వెర్రివారలు, యింద్రునిపూజింపమి వర్షంబులు
గురియవా! యిందులకేమీకు వెర్రిగొల్లలని పేరబ్బినది—

సీ॥ కర్మంబువలనన గాదె జన్మంబును వృద్ధిక్షయంబులు పృథ్వికర్మ
విడివడజాల రింద్రుడు విష్ణుశంకరు లట్టికర్మను బట్టియనుభవంబు
లబ్బు కర్మను బొందుచను రేంద్రుగొల్చుట పతివిడిమొరు వెంటబడిన
యట్లు। గానకర్మంబుచుగడచు యత్నముసేయువలయు మీరలువిప్ర
వందనంబు గీ॥ యర్చనము దానమునుసల్పి యవలకొండ। నొక్క
దానిపూజించిన మన్నదిఫల। మట్లుగావింపుడని యొప్పు నట్లుజేశి।
గిరినిపూజింప నొనరించె కృష్ణమూర్తి॥

వచ॥ పూప సూపాదికంబుల నాగిరిముందునిచి నమస్కరింప శ్రీకృష్ణుండు-

మంజ—యాదవులారా మీరందరు జన। గాదగు నవ్వల దెసకున్
మోదంబున యాకామరూపిగిరి। భుజియించును పై మనకున్॥

వచ॥ కామ్యంబు లొసంగునని నమ్మించి—

గీ॥ అనుచువారల నొక యెడకంపి భక్ష్య। భోజ్యములు మెక్కి-రండికభూ
ధరమతి। సంతసిలె మీరొసంగిన సకలవస్తు। జాలమును యాహరిం
చె నిశ్చయము ఫలము॥

వచ॥ అని మొఱలిడుచుండగ నింద్రుండు చేసేటనాకోనమ్ము పూజలుమరచి యాదవులు యీకొంచెపుబాలు నాజ్ఞాయత్తులైరి. వీరిని కసిమసగింత మని తలంచి ప్రళయప్రవర్తకంబులగు సంవర్తకనవ మేఘంబులంబు ర్త్రెంచిన నవి ఘోరవర్షాణంబులతో వానగురియింప గోగోప బృం దంబులు హాహారవంబుల విలపించుచుండ కృష్ణుండు—

మంజ—వెరువవలదు వర్షంబున కీవేళ। వినుడు నామాటలెందు వెరవెర నీపర్వతము కేల వయి। కెత్తి గాచెదను రండు॥

మలయమారుతం—రూపకం.

ప॥ శంకింపకు డోగోప। సంఘముక్రిందకు రండు ॥శం॥

అ॥ బింకపు మాటలుగావు। వెరవవలదు మీరందరు ॥శం॥

2 బాలుండీతడు శైలము। భారము వహియింపగనెటు జాలండనకుడు రండు। శైలముని త్తెత్తి కేలను ॥శం॥

3 చాలగ నీనగపుర భూ। చక్రమంత పైబడినను కేలల్లాడదు గోపకు। లేలా వెరచెదరు రండు ॥శం॥

వచ॥ అని ధైర్యంబుగొల్పి దక్షిణకరంబు నడాకేలంగిరి నెత్తిన గోగోపసం ఘంబు దానిక్రిందందూరి నిలచిననిందుడా సప్తరాత్రింబులెడ తెరపి లేకుండవర్షించి విసవి శ్రీకృష్ణపరమాత్మలీల కబ్బురమంది యేతెంచి పదంబులంబడి ప్రార్థించి యభయంబంది చనియె. నంత గోగోపకులు సుఖంబుండిరి. అటమధురానగరంబున—

గీ॥ కంసనృపు డోలగంబుండ ఘనుడు నారదుండు యరుదెంచిసంప్రా జితుండయియిటు! లనియె దేవకికొడుకు కృష్ణునకు సుఖము। నీకశుభ మురానున్నది నేలరేడ॥

వచ॥ అనికంసుని కోడక యశోదకు బిడ్డబుట్టుటయు, వసుదేవుడు దేవకీ పుత్రునటబెట్టి యాబాలికనాన్నర్పుటయు. శ్రీకృష్ణుడను నామంబున నతడును రోహిణీతనయుండగు బలరాముని గూడి మందమందుటయు, నెరిగించి చనిన కంసరాజు అవురా! వసుదేవుం డెంతమోసమాచ రించె. కానిమ్మతని నడిమాచెదగాకని అక్రూరునింగని యిట్లనియె-

మంజ—బృందావనమునకేగి నీవుయదు । వీరకృష్ణునింగాంచి
యిందునకే తేరగ జేయుమునీ । వెట్లైనను వంచించి॥

గీ॥ అతనితో నిష్టులను ధనుర్యాగ మొకటు । చేయదలపూనె మిా మామ చిత్రగతుల । మిమ్ము నాహ్వనపరచెను రమ్మలంచు । రామ కృష్ణుల తోడి తేరంగ జనుము॥

వచ॥ అనిన అక్రూరుండిది మేలుగాదని పెక్కు తెరంగుల బోధించి అయినను నీపంపు చేయకుండరాదని యరదంబెక్కి యట బృందావనంబున శ్రీకృష్ణునికడకుచని నమస్కరించి కంసునాన నెరిగింప రామకృష్ణు లానందంబున మధురానగర ప్రయాణంబున కుత్సహింప యశోద—

ఆసావేరి—త్రిశ్ర.

ప॥ పోవకుమా కష్టంబొాదవుచు । క్షితిపునందన ॥పో॥

అ॥ యేవేళను వానినమ్మి । యేగరాదు దరికి దుష్టుడు ॥పో॥

2 ఆదినుండి నీవన్నను । అదేమో యోర్వడయ్యో
యేదో మోసము యాగము । కుత్సహించె మధురకునీ ॥పో॥

వచ॥ కొంతవడి యక్రూరుండు తెచ్చిన యరదంబున పయనించి మధ్యాహ్నిక కృత్యంబుల కక్రూరునకు సెలవిడ నతండు యమునానది మునింగి కృతస్నాతుండై—

మంజ—జలమధ్యంబున శ్రీకృష్ణునిగని । సాశ్చర్యంబున వెనుకకు
గలరథమున జూడగ నందుండెను । గంభీరంబున గడకకు॥

కం॥ జలమధ్యంబున రథమున । గలకృష్ణునిజూచి మింట గననటకృష్ణుం
డెలనవ్వునుండిన హరి ను । జ్వలమతినక్రూరు డధికభక్తి నిటులనె॥

భైరవి—రూపకం.

యీావే సర్వాధారుడ । విందిరేశుడవునిక్కము॥ యీా॥
దేవా నీమహిమదెలియ । దేవాదులశక్యులనగ

మి॥ నావల్లను నేమగునో । నారాయణదుష్టులవధ
భావన దేవకిగర్భము । లోవసియించి జనించితి॥ ఏవే॥

2 నిగమమ్ములకునైనను నీరజములు వెల్లగాదె
రాజగోపయన నందాదుల బాలియింపగలేరివచ్చెను

మి॥ జగములననుబోలు భాగ్యశాలి లేడు యేమనవిము
భాగమే పూజనము చేయ। పాతగానగ వచ్చెగాన ॥యీవే॥

వచ॥ అని ప్రార్థించు నక్రూరుని దీవించి రథారూఢులై మధురానగరంబు చేరంజని గ్రామంబువెలుపలండిగి, యక్రూరా! నీవరిగి మా మామగారికి మా రాక నెరిగించుమనిపంప నతండు దేవా! నాయిల్లు పావనంబొనరింపవేయన వారలు వల్లెయన నతండు చనిన—

గీ॥ రామకృష్ణులు యమ్మధురాపురంబు। కలయగనుగొనుచుండ వీధులను హర్మ్యస్థలములన్నిల్చి కాంతలు తమమనముల। కృష్ణునింగాంచి తలపోసి రిట్లుగాను॥

*సీ॥ వీడటేరక్కసి విగతజీవగ చన్నుపాలుద్రావినమేటి బాలకుండు
వీడటేనందుని వెలదికిజగమెల్ల మొగమునంజూపిన ముద్దులాడు
వీడటేమందలో వెన్నలుదొంగిలి దర్పించి మెసవిన దాపరీడు
వీడటేయులయించి వ్రేతలమానంబు మారలాడిన లోకసుందరుండు
వీడులేకున్న పురమట వీస్థలంబు। వీనిబొందనిజన్మంబు విగతఫలము
వీనిబలుకని వచనంబు విహగరుతము। వీనిచూడనిచూడ్కులు వృథలువృథలు॥

వచ॥ ఇట్లు బల్కుచుండ నగరద్వారంబు కడకుంజని కంస నృపాలునకుగా శుభ్రవస్త్రంబులం గొంపోవు రజకునింగాంచి కృష్ణుం డిట్లనియె-

శేకడ—చతురశ్రగతి.

వలువలివ్వరా రజక। వలువలివ్వరా॥ వలు॥
కలుగవు మా మందలోన। ఘనచేలంబులు యిప్పుడె
వలయు గట్టుకొనగనీకు। వచ్చుపుణ్యము నిజముమాకు॥వలువ॥

రజ—యెట్టులెటులురా గొల్ల। యెట్టులెటులురా॥ యెట్టు॥
గట్టుకొనగ దగుమరె భూ। కాంతునిచేలములుమీకు
యిట్టులాడ గొల్లపల్లెయే। పొందు బ్రదుకగ చా॥ లెట్టు॥

గీ॥ అనిన రోషించికృష్ణుండు యతనిమూర్ధ్న । మూడిపోవంగ నొత్తి యాజాడివమ్ము । నాయకునిసంగుభూషలు వస్త్రవితతి । దాల్చి సింగారమునమూడి నరిరెలంగు ।

వచ॥ సుదాముని యింటికిరుగ నతండు బలరామకృష్ణుల నభినందించి సుమదామంబుల నొసంగి పూజించిన యతనిం గరుణించి దీవించి యచ్చోటుగదలి వీధి వెంటజనుచుండ గంధమాల్యాదులం గొని చను కంసభూపు దాసియు వక్రయగు కుబ్జంగాంచి కృష్ణుండు ।

కం॥ యెవ్వరిదానవు గంధము । లెవ్వరికై కొనిపోవుచు వేగాను నీవే రెవ్వరు మాకిత్తువెయిడి । జవ్వనిచక్కదనముగల్గి జరియింతువోగన్ ।

వచ॥ అనిన నాకుబ్జ యిట్లనియె—

మంజ—చక్కనివాడవు గొనుమిచ్చెద నీ చందనమున్ వనుగరుణన్ మక్కువదీర్పుము నాగొని దానికి । మాన్పవంకరలు గనగన్ ॥

వచ॥ మత్కాఖతంబుదీరినపయి నీయింటికేను వచ్చెదనని యొప్పించి కంస నృపాలు ధనుశ్శాలకరిగి ధనురాదులవ్వియుం గరంబులందెమల్చి విరచెనని శుకుండెరిగింప పరీక్షిన్నరేంద్రుండు—

మంజ—ఆవలకంసుండేమొనర్చె హరి । యతనినెట్లు మనుమాడెన్ దేవా జన్మముధన్యతనొందెను । దెల్పుము ద్దాని గూడన్ ॥

---

# 15 రుక్మిణీ సందేశము

—:o:—

మంజ— కంసుడింత యాలించి యదరిపడి । ఘనమల్లుర బిలిపించెన్ । హింసింపుడు బాలకునంచని సభలో । యిష్టములర శాసించెన్ ॥

గీ॥ కువలయాపీడ మనునొక కుంజరమును । నగరిమొగసాలనిల్పిన నంద తనయు । డెరిగి యద్దాని కరమట్టి నరికినంత । కొండవలె నేలగూలె నాదండిగజము ॥

వచ॥ ఆవలనద్దాని దంతంబులంబెరికి వానిచే కావలివారల మర్దించి బిర బిర సభాగారంబుజేరి కంసునింగాంచి యిట్లనిరి—

కేదారగౌళ — చతురశ్రగతి.

ప॥ మామా వినుమా మామేనగనుమా ॥మామా॥

అ॥ నీమేనల్లుర । నేల రక్షించితివి ॥మామా॥

2 మస్తులచేపట్టి । పోస్తులమూంగని
శిష్టుల హింసను । చేయగన్యాయము ॥మామా॥

3 ధనుర్యాగంబని । దగవిపోనరుప
ధన విత్తాలస । ముచు జేసితివో ॥మామా॥

మ॥ అనుచున్నిర్భయ చిత్తులై పలుక రౌద్రావేశుఁడై కంస రా
జనియెన్ బాలకులార దుర్బలుర ప్రాణాంతంబు గావింప భీ
షణ శౌర్యాన్వితులైతిరే నిలుఁడు పితృమాతృ నిర్భిన్న హృ
ద్వనితారి ప్రబలుర్మదీయపుర శశ్వన్మల్లురం గెల్వఁడీ॥

వచ॥ అని నియమించిన మల్లురతో రామకృష్ణులు డీకొని వివిధాభీల రణంబున ముష్టాముష్టిని బాహాబాహిని బెనంగి వధించిరి. ఆవల కృష్ణుండు రామున కిట్లనియె—

శా॥ అన్నా యింకిట కంసమర్దనము సేయన్ గొండె కార్యంబు ని
ల్చెన్నే నందులకుంగడంగుదును నీచేవన్మహాసైన్య మిం
దెన్నే రీతుల నడ్డుమంచని తెరంగీరీతి విన్నించి దా
కెన్నీరేజదళాక్షుఁడొక్క మొగి యుక్కీ కంస భూకాంతుపై॥

మోహన — త్రిశ్రగతి.

ప॥ పడిదాకెను హరి కరిపైగవిసెడు । భంగిచూపరులు వెగడు జెందగా

అ॥ కడువడి స్వర్ణచేలము నడుమున । నడగనొత్తి మొగమెత్తి నగవున

2 కర్తవ్యంబెరుగంగ జాలకా । కంసనృపతి వెర్రినిబడి చూడగ
ఆర్తనాదముల సేనగదలిరా । నందర రాముండడ్డి నిల్వగా ॥పడి॥

గీ॥ ఇటుల కంసుదాకి యిలతలో మకుటంబు । ద్రుల్చి కేశపాళి దాల్చి కేల
నేలయందు బడగ నీడ్చి వక్షస్థలం । బెక్కి ముష్టితోడ హింసజేసె॥

ఝంప — విలవిలదన్నుక కంసుండప్పుడు । విడచె ప్రాణ పంచకముల్
ఖలజలధివిజానీకము పూవులు । చాలగురిసె మోదమునన్॥

2 నారసుడా జెరు దేవకుంకుమల । నాదంబులు నెలకొనగా
దీరెదుష్టుడని మాచిమధురగల । వారలంద రటమటాగన్॥

వచ॥ ఇట్లు కంసునిభంజించి తదనుచరుల వధించి చెరయందున్న యుగ్రసేనునివిడిపించి రాజ్యాధికారంబొసంగి దేవకీవసుదేవుల చెరవాపి మధురానగరంబున కెల్లయాదవులరావించి కాపురంబుండె. నంత కొన్నిదినంబులకు ఉపనీతులై—

గీ॥ తల్లిదండ్రుల యానతిం దరలి రామ । కృష్ణులిద్దరునుం గాశికేగి యందు సాందిపునియొద్ద సకలశాస్త్రార్థగరిమ । నేర్చికొనుచుండ గురుడు దయను నిటులంత ।

అఠాణ — రూపకం.

ప॥ గురుదక్షిణ యేమిత్తురో । కుర్రలార చెప్పుడీరె ॥గురు॥
అ॥ పరమానంద మొసంగెను । భావసుస్థిర భక్తిగరిమ ॥గురు॥
చ॥ చిర శుశ్రూషలొనర్చిన । వరులైనను శాస్త్రార్థము లి
ల్లెరుగ రచిర కాలమందె । యెంత తెలివితేటలున్న ॥గురు॥
2 నాకొమరుండు జలంబున । నోకృష్ణా మునిగి రాడు
లేకొక్కరు డేగలైను । లేనువా డికేమిసేతు
చ॥ నీకసాధ్యమౌ కార్య మే । లోకంబున లేదెరుగుదు
నాకుర్రనిదెచ్చి గురు రు । ణంబు దీర్చుకొమ్ము చాలు ॥గురు॥

గీ॥ అనుచు గురుడు కోర నాతనిపుత్రుని । కొరకు ధర్మరాజు పురికినరిగి
యమునినడల బెట్టి యర్భకునొనివచ్చి । గురునివలన మేటి వరములందె.

వచ॥ ఇట్లు విద్యాభ్యాసంబు గావించి తిరిగి రామకృష్ణులు మధురాపురంబు జేరి కుబ్జాసతి కోరికదీర్చి యామెకు వైకుంఠంబొసంగి యక్రూరునిబంపి హస్తినాపురివార్తలాలించి సుఖంబుండిన—

మంజ—కంసునిభార్యలు హస్తిప్రాప్తియును । గాఢచింతతో నరిగి
ధ్వంసమయ్యె మాకోర్కెలంచుతమ । తండ్రిజరాసంధుకెరిగి॥

కం॥ యెరిగించిన నాతండని । తరమురాద్వార విక్రమంబు తనరగ సైన్యా
కరుడైవడిజని మధురా । పురిముట్టడిసల్పె జయముపొందెదుకాంక్షన్॥

క॥ అజరాసంధుడాహవ మాచరింప। నెదిరి శ్రీరామకృష్ణులు విదితశరవి తానములనొంప నాత డత్యధికకోధ। ఘూర్ణమానసుడై పల్కె నిట్టులెల॥

సీ॥ అదలించి రొప్పంగ యాలమందలుగావు గంధగజేంద్ర సంఘములు గాని। పరికించి బెదరంగ సంభారవంబులుగావు వాజీంద్ర హేషారవములు గాని। పదహాటి కూల్పంగ పాత్రబండ్లివిగావు నగసమాన స్యందన ములుగాని। ప్రియములాడంగ నాభీర లోకముగాదు కాలాభ వైరి వర్గంబుగాని గీ॥ యార్చవన వహ్నిగాదు బాణాగ్నిగాని। మరియు బృందావనముగాదు మొనలుగాని। యమునగాదు నటింప ఘోరాజి గాని। పోరుసీకేల గోపాల పొమ్ముపొమ్ము॥

వచ॥ అని వచియించు జరాసంధుని పరుషగల నారసంబులం బెంకు వడగొట్టిన నిలువంజాలక మగుడ తమపురికింజని కొన్ని దినంబులకు మరల నరుదెంచి వెనుకటివోలెనే పారిపోయి యాపాట్లుమరచి మరల కొంతకాలంబున కరుదెంచు నిట్లుపదునేడుమారులు మధురా నగరంబుపై జరాసంధుండు దండెత్తి విరమించుకునె. నివ్వార్త నాలించి యతని మామయగు కాలయవనుండు—

భూపాల — చతురశ్రగతి

ప॥ కాలయవను డరుదెంచెను। ఘనమధురానగరుపైకి ॥కాల॥

అ॥ చాలినంత సేనగూడి। స్యందన గజహయములతో ॥కాల॥

2 క్రూరయస్త్ర శస్త్రధరులై। కుంభిని యదురవనడచు వీరసైన్యములతో భేరీ। ఘోరనాదముల తోడుత ॥కాల॥

3 నవరత్నస్థాపితమై। పవిమల శోభాకరమై తపురథస్థుడై చేతకో। దండమొకడు ధరియించి॥ కాల॥

గీ॥ ఇట్లు కాల యవనుడేతెంచి పురమును। ముట్టడింప వాని మొనలనిల్చి జయముగొనగ మదిని శంకించికృష్ణుండు। కరుణమీర విశ్వకర్మ బిలచి॥

వచ॥ యమునానదీమధ్యంబున నొక నగరు కట్టుమని నియోగించిన నతం

డతిచిత్రంబుగా నొక పట్టణంబు నిర్మించి వానినుండి మధురాపురి లోనికి భూబిలంబు గల్పించిన నామార్గంబున మధురవాసులందరు నందుజేరి యుండి రద్దానికి శ్రీకృష్ణుండు ద్వారకయను నామంబు నిల్పె నదియెట్లనిన-

కేదారగౌళ—చతురశ్రగతి.

ద్వారకాపురంబు జన। వారంబులడంబు॥ ద్వార।
శ్రీరమణీకాపురంబు। చెలువంబుల దాపురంబు। ద్వార।

ఖం॥ వారణములు వాజులుపలు। తోరణములు సుందిరులు
వారణసేయగరాని। బంటులు రణమునగంటులు॥ ద్వార।

2. వింతవింతతోటలు పలు। విధములైన బాలలు
సంతసంబు గలిగించెడు। చాలయున్న తిప్పమేడలు

ఖం॥ సంతలు నగరులునూతులు। దంతినివహములు హయముల
రంతులు పూదీవలచే। నెంతో పింత్రైయొసగెడు ॥ద్వార॥

వచ॥ ఇట్టి ద్వారకానగరంబు నిర్మించి శ్రీకృష్ణుండొక్కరుండు మధురా నగరంబువెడలి కాలయవనుని కనుపడ నతండదో కృష్ణుండని వెంటం దవిలిన పెనుదవ్వు పరువిడి యొక గిరిగుహాంజొచ్చి యందుం దపో వృత్తినోడలు మరచియున్న ముచికుందుడను మునిం డాసి తనచేలం బతనిపైగప్పి తానొండుచో దాగున్న కాలయవనుండు సమీపించి-

గీ॥ తపమొనర్చెడు ముచికుందు దరిసి కృష్ణు। డనుచుకోపించి తన్నినం తనె మునీంద్రు। డక్షియుగ్మంబు దెరచిన యంతలోన। కాలయవ నుండు భస్మమై గలసెభువిని॥

మంజ—అనుచు శుకుండెరిగించిన విని। యాయవనీశుండిటులనియెగా
వినిపింపుడు ముచికుందు డెవ్వ। డెటుజనియెపిదప నదితెలియగా॥

సీ॥ ముచికుందు డెవరన మున్ను యిక్ష్వాకువంశోద్భవు మాంధాతకుద్భ వించె। బలశాలి ధీశాలి ఖలదానవులబారినుండి దేవతలకు యండ గాగ। నిలచిపెక్కేడులా యిలరేడు గాపాడ భూలోకమున వాని పుత్రమిత్రు। లందరుగతియింప వారిహాయు డెరిగింప శోకించియెట్టు

జనులకు మోక్షమొసఁగి మాకెట్లో యోగుహానధికతపము। జేయు
చుండె తపోబలమహిమ యధికము। కాలయవనుని గాల్పగా గడగె
నతని। నుతినిగని కృష్ణుఁడుత్తమ గతినొసంగె।

వచ॥ ఆవల జరాసంధుఁడు యవనమ్లేచ్ఛ సైన్యంబుకోసరా మధురా
నగరంబుపై విడసిన రామకృష్ణులు యుక్తిగా నతనిందప్పించుకొన
దలంచి సమ్మన సేవకులంగొని ప్రవర్షణాద్రిపయింజేరిన జరాసంధు
డెరిగి వెదకి వేసారి గుహామార్గంబుల కాష్టంబులంగూర్చి దహింపం
జేసి రామకృష్ణాదులందు నశించిరని నిశ్చయించుకొని వెనుదిరిగి
చనియె-నీవిధంబున శ్రీకృష్ణుండు శత్రువుల నిర్జించి మధురానగరం
బుగ్రసేనునకొసంగి తానుద్వారకాధీశుఁడై చెలువందె-నంత—

మంజ—రైవతుఁడను రాజేంద్రుఁడు కూతును। రేవతి నాబడు బాలక
భావమలర బలరాముని పత్నిగ। గావించెను జనులలరఁగ॥

కం॥ ఖగపతి మున్నమృతము। నగభేదిని గెల్చి తెచ్చినటు కృష్ణుఁడు దా
జగతీనాథులు నందరు। దెగిపారగ భీష్మతనయ దెచ్చి వరించెఁ॥

వచ॥ అనియెఱింగింప పరీక్షితుండు విశదీకరించుమన శుకుండిట్లనియె—

సీ॥ ఘన విదర్భాపురమును భీష్మకుండను ధర్మవర్తనుఁడు వదాన్యుఁడేలు
నతనికి బుత్రులు నైదుగురందులో పెద్దరుక్మి ధర్మవిరహీను
డార్యదూషకుడగు నందరకడసారి చెల్లెలు రుక్మిణీ చెలువ వివిధ
విద్యాగుణాలయ పెద్దలబూజించు శ్రీకృష్ణునాథుగా చిత్తమందు

గీ॥ దలచి తల్లడమందు యుక్తవయసునను। యున్నయాబాల పెండిలి
నెన్ని భీష్ము। డెరిగి కృష్ణుని వరియించు బెల్ల సంతసించినంతట రుక్మి
వచించునిట్లు॥

భైరవి—చతురశ్రి

ప॥ గొల్లవానికా? కట్టా। పిల్లనిచ్చుటా ॥గొల్ల॥
అ॥ కల్లరిఁడు వాడుమాయ। కాడు వల్లనివాడు ॥గొల్ల॥
చ॥ చెల్లెలికా కృష్ణుడుపతిగా। చెల్లడుగా। ఘోషిటు లుల్లముగా
చాలుచాలు తలపకుడిక ॥గొల్ల॥

2 అతిరూపశాలి । యగుసీరుక్మిణికి
పతిగాగ శిశుపాలుడే తగువాడు

చి॥ వెతకితిరా । దుష్టునిచెలి । కతికెవరా । ముందగు గతిగనరా ।
చాలుచాలు పెద్దవారు ॥గొల్ల॥ కృష్ణ

మ॥ కులమా గొల్లడు రూపమా నలుపు దాగోష్ఠింబోవచ్చున్ సదా
లలనాసంఘముతోడ జారతయు చోరత్వంబులున్నాని సా
మ్ములుబాహాబలమన్నసున్న పసులంబోషించు బృందావనం
బుల నాకృష్ణున కెట్టులిచ్చుటలు పూబోడిన్ మదిందల్పరే?

వచ॥ అని రుక్మి కృష్ణునధిక్షేపించి రుక్మిణీదేవిని శిశుపాలునకిచ్చుటకే నిశ్చయించి యత్నంబు లాచరించుచున్నంత రుక్మిణి యవ్విధం బెరింగి—

ముఖారి—రూపకం.

ప॥ ఎటుదోచదే నిం । కేమిసేయుదాన ॥ఎటు॥

అ॥ కటకటా శిశుపాలు । గట్టుకొనగజాల ॥ఎటు॥

చి॥ కుటిలుండై యగ్రజన్ము । డిటుగావింప దలంచెను
పటుతర వైరము కృష్ణుని । పైదాలిచె నయ్యో నా ॥ఎటు॥

2 చిత్తము శ్రీవాసుదేవు । చేరినిలచి నాదినుండి
తత్తరమొదవెను నాకిక । దక్కడనుచు ప్రియనాథుడు ॥ఎటు॥

చి॥ యిత్తరినేనేమిజేసి । యేవియునతని గూడక
హత్తు చేదివిభుతోడ । బూనజాల నక్కటకట ॥ఎటు॥

వచ॥ యివ్విధంబంతయు శ్రీకృష్ణున కెరుంగజేయ దలపోసి రుక్మిణీదేవి యగ్నిద్యోతనుడను విప్రుంబిలిపించి యర్ఘ్యపాద్యాదులంబూజించి.

మంజ—భూసురవర నీకిదె మ్రొక్కెద నను । బ్రోచు కర్తవని జోకన్
యోసరసీజాక్షుడు శ్రీకృష్ణుని । యావాసంబును వీకన్ ॥

వచ॥ అని శ్రీకృష్ణపరమాత్మతో సమయంబెరింగి విన్నవించుకొని—

సీ॥ భువనపావనమైన ముద్దుపదంబుల పెక్కుసారులుభక్తి మ్రొక్కిత
మము । దర్శనీయంబగు తవదివ్యరూపంబు కనులజూడగ నాసగంటి

నను ము. త్రిలోకరణకర్తగా దేవదేవుడనుపేరెమని వెన్నొసారులు యాడి
తనను ము. తలిదండులేనన్ను తనదేవిగావింతునని కాలముంబుచ్చు
జనిమె నను ము గీ. అన్నయును రుక్మిచేడిక రావనీకు। నాధుగా
జేయ నెంచియున్నాడు చేదు। గానని కెరిగింపగా గంటిననుము। దిక్కు
నీవనినమ్మితి దేవయనుము॥

మంజ—మూడుదినంబులుయుండె వివాహము। మూర్ఖశిశుపాలుతోడ్క
గూడదీవు రాకుండిన ప్రాణముకుక్క దెకుటనె నిజమిూడ్క॥

గీ। అనిమెరింగించి తోడి తెమ్మనిఘన వి। భూషణాంబరములనిచ్చి భూమి
సురుని। బంపిరుక్మిణి కృష్ణుడేభంగిదలచు। నోకొ-యనిమది తలపోసి
యున్మలించె।

వచ॥ అంతి నయ్యగ్నిద్యోతనుండు కతిపయదినప్రయాణంబుల విదర్భ
గదలి ఘోరాటవిందాటి యమునానదిందాసి కృత స్నానాది
కర్ముడై బల్లకట్టడం బూతగాగడచి ద్వారకానగర ప్రవేశమాచ
రించి శ్రీకృష్ణభవనాంతరంబు చేరిన శ్రీకృష్ణుండెదు రేగి తోడి తెచ్చి
యర్ఘ్యపాద్యాది విధులపూజించిన—

కళ్యాణి—రూపకం.

ప॥ ధన్యాత్ములలోనకడు। ధన్యాత్ముండైతి కృష్ణ ॥ధన్యా॥
అ॥ మాన్యుంబయ్యెను దేహం। బమలచరిత భక్తిభరిత ॥ధన్యా॥
చ॥ కన్యారత్నమె రుక్మిణి। కడు బాళిం బంపెమాకు
ననోన్యమను గూర్పు। దూతనై వచ్చితి మదిమెచ్చితి ॥ధన్యా॥
2 ఏరీనను బోలునట్టి। వారుపుడమిలోన కృష్ణ
నారాయణునకు లక్ష్మికి। నమమరాయబారినైతి
చ॥ ఘోరారోఘంబులుడుల్లెను। నారదమత నినుగనుగొన
నారుక్మిణి చెప్పుమాట। నానోటనె యాలింతువె ॥ధన్యా॥
చ॥ ధరణీభారవిదూర నీపయిని చిత్తంబర్పించి డాసె నా
తరుణీమణిచుదలంచి నీమృదుపదాబ్జాతంబులం గొల్చుచున్
తరిశైవేచిన వమ్మదగ్రజుడు చైద్యాధీశునకున్నిచ్చి పెం
డిలిగావింపబూనె వచ్చినమహా భాళింగ్రకోపం జూడదే॥

వచ॥ మెల్లియే వివాహముహూర్తంబు గాన—

గీ॥ లగ్నమునకుముందు గౌరియాలయములోని। కేలమిఁగొంపోయి పూజ
గావింపజేసి। దీసికొనివచ్చువేళకుం దెరువజేశి। నన్నుగొంపోదు వి
వని నమ్మియుంటి।

వచ॥ అనియామె యెరిగించినది—

మంజ—అనియగ్నిద్యోతను డెరిగించిన। యాలకించి కృష్ణుండు
మనమున సంతసమూరగ నాతని। కనియెనిగతి వినుండు॥

2 అవతారి సోయగము గుణంబుల। నాలకించి తీవుకు
భావమామెపై జిక్కెవచ్చెదను। పరిణయ కాలంబునకు॥

సీ॥ అనితరసామాన్యమై వింతగొల్పు నీయాననంబుకు ముద్దులంటెననుము
చిన్ననాటనుగోలె యున్ననినీయెడ బ్రాశి యెత్తరి నెడబాయననుము
ననునమ్మియుండినవరులకు యేవేళనైన కష్టసుఖంబు లంటవనుము
రుక్మిపోద్బలముచే ద్రోహి చేదీశుండు నీకరంబునుబట్ట నేరడనుము

గీ॥ లగ్నకాలంబునకు నేనురాకపోను। నిన్నుగొనిపోకపోను నీయున్న
గర్వ। భంగమొనరింపకనుపోను భావమందు! దిగులుడిగి ధైర్యము
వహింపు తెరవమిన్న॥

వచ॥ అని యెరిగించి కర్పూరవిడియ వస్త్రమాల్యాదులం బూజించి
షడ్రసోపేతంబుగా సాదంబిడి యానాటికి నిల్పుకొని మరుదినంబు
ప్రదోషకాలంబున దారకుండు బూన్చి తెచ్చినమరదంబుపై శ్రీకృష్ణ
పరమాత్మ యగ్నిద్యోతనునితో నధివసించి ద్వారక వెడలి విదర్భ
సమీపించి యొకపూవనంబునందవిడిసి ముందు విప్రివరుని రుక్మిణీ
దేవికడకంపె—

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ.

## 16. సత్యావివాహము.

—:o:—

గీ॥ వినుము శ్రీరుక్మిణీదేవి పెండిలికయి। పురమురుక్మి యలంకారముంబొ
ర్చె। పలువిధంబుల వాద్యసంపదలు జెలగ। దరలివచ్చెను శిశు
పాల ధరణీ ధవుడు॥

వచ॥ యిట్లు ప్రార్థించి బయలువెడలి ముందు నందముననుప్పొంగి వింత వింత దుస్తులచే సింగారించబడి యిరువైపుల నగారాలు బిగించి పై నధిష్టించి మేళవించువాని యిష్టంబెరింగి వర్తించు హయంబులును- ఆవెనుక రజకుల పాలకీముందు బొంగులవలె నతిదీర్ఘంబులగు తమ మెడల నమితదూరంబుగాజాపి తిలకించువారి నెక్కిరించుచు నడచు బేగిరావులపై స్థిమితంబుగా గూర్చుండి నౌబోతును ధ్వనించు పరి చారకులును, ఆపిదప తూతూబాకా, సన్నాయి, పీరణము, మురళి జాది మంగళవాద్యంబులును, ఆవెనుకచూపరుల మనంబులు చూర గొనునట్లు యభినయంబు గావించుచు భరత శాస్త్ర ప్రకారంబుగా శృతియుక్తంబుగా పాడియాడు వేశ్యలును, ఆతరువాత విలువదుస్తుల సింగారించబడి పిల్లకొండవలెనడతెంచు మదకరీంద్రముపై నధివసించి వీధులవెంట వివాహ వేదిక కడకువచ్చు రుక్మిణీదేవిని శ్రీకృష్ణుండో డిసిపట్టియెత్తి తనయరదంబునం జేర్చుకొని పోవుచుండ—

గీ॥ పెండ్లివారికి చారులీవిధి నెరుంగ। జేయశిశుపాల రుక్మియ శేషసైన్య। యుతముగా వేగపరచి తారొక్క మొగిని। వారిరథముడాసి భల్ల ముల్ పరపిరంత॥

మంజ—కృష్ణుడంతతనని శితమార్గణము। లేసి వానిదునుమాడక కృష్ణునిపై నరిసైన్యంబంతయు। గేరుచు గ్రిమ్మగ జూడక॥

2 అందరకన్నివిధంబుల శరముల। వాతంఁడు తలంకకను చిందరవందర గావించినగని। శిశుపాలుడు యనునికను॥

గీ॥ చోరతనమున మేచత్తసుతుని దార। నపహరింతువె నీచుడా తెంపయు సిగ్గు। లేదె నినయంతకాలయం బీదినంబె। జేర్చి శత్రు నిశ్శేషంబు జేయువాడ॥

వచ॥ అనిఘోరలంక రణంబునకుం దొడరినంతలో, బలరామాదు లరుదెంచి కృష్ణునకు బాసటయైనిల్చి దురంబున శిశుపాలుం బరాజితుజేసి జరా సంధుని నిరాయుధుంజేసి పుచ్చి దుర్యోధనుని నిర్వీర్యుం గావించి కర్ణుని దుర్జయుంబడచి పెక్కురు రాజుల నుక్కడంచిన రుక్మి శ్రీకృష్ణు నిపై డాసి—

రామవర్ధని—చతురశ్రజాతి.

ప॥ గొల్లవా రెంతిఇంటికి వలపడితివి ॥గొ॥

అ॥ నా పుట్టెనిలులపహసింప, చెల్లునా నిన్నడివల్లునా ॥గొల్ల॥

౧ నిలువరా ఘోరసమర ముఖమునను గెలువరా

తలనిలువదు నాచేతిలో। తాష్టుడ నూలుచు నిజముగ ॥గొల్ల॥

మ॥ అనికౌడస్త్రంబున విల్లువెక్కిడి మహాస్త్రాళిఁ పయింగప్పు నా

తని నొక్కమ్మున చాపనిగ్గత కరుఁ దాజేసి పైడాసి యి

ట్లను శ్రీకృష్ణుడు బావ ఏకుదగు మర్యాద న్నిడంబోలదే

యని యారుక్మి శిరోజముల్ పయిపిమీసాముల్ విడంబీసినన్॥

వచ॥ సిగ్గంది తలవంచిన రుక్మిణి యిల్లనియె—

మంజ—తగునె యిట్లుగావింపగ నగ, ధర మీబోంట్లకటన్నన్

వగవకు బావమరంది గాన యిటు। పరిహాసించితి నటన్నన్॥

గీ॥ రోసపడనేల నీతల మీసములను। చక్కపరచెదు మంగలిశౌరిగాగ।

యేరికబ్బును నీవంటి కీరితియని। అన్ననూరార్చి రుక్మిణియంపెపురికి॥

వచ॥ అంత శ్రీరుక్మిణీ కృష్ణులు ద్వారావతికరిగి జగన్మోహనంబుగా వివాహంబైన యావల కొన్నిదినంబులకు శ్రీరుక్మిణీగర్భంబున నొక యర్భకుం డుదయించె. శ్రీకృష్ణుండు జాతకర్మాదికంబు లాచరించి ప్రద్యుమ్నుండను నామంబిడి పెనుచుచుండె నొకనాడు—

మంజ—శంబరుడను దనుజేశుడొకడు యీ। జాడ నెరిగి మదిలోనన్

డంబముతో తనవైరియగునని। టక్కరి మాయావిధినన్॥

గీ॥ నిదురపోయెడు ప్రద్యుమ్ను నెత్తి పిన్న। నాట జలధిని బడవైచినన్ జలచర। మత్స్యమొక్కటి బాలునిం బట్టిమ్రింగె। నెంతచిత్రమొ గనుగొనుం డీసుమాయ॥

వచ॥ అంత జాలరులు వలందగుల్గొను మత్స్యంబులం గొన్నింటి నా శంబరాసురునకు కానుకగానిడ నతండు వానిచపనార్థము మహానస గృహంబునకంపె నందు వానిపరిచారికయగు రతీదేవి యామత్స్యగర్భస్థబాలునిం గాంచి నిజనాథుండుగా మున్ను నారదునివలన భవిష్య

గీ॥ అనుచు ప్రద్యుమ్ను డాశంబరాసురు జము। నాలయంబునకంపి ప్రి
యాంగనగొను। మనుమ నెరిగించు నారదు మనవిపైని। కుతుక
మున నాంతిపతలి సూనులతని॥

వచ॥ అంత రతిప్రద్యుమ్నులు ద్వారకా నగరంబుచేరి సుతవియోగం
బున వాడియున్న రుక్మిణీకృష్ణులకు నమస్కరించి రంత కొన్నాళ్ళకు
సత్రాజిత్తను నృపాలుండు కృష్ణదర్శనార్థమై యరుదెంచినకృష్ణుండు.

మంజ—— అనఘ నీగళమునందలరెడు నా। హాకాంతివంతమగుచు
ఘనమణి నిత్తువె దానికైనవెల। గనగనావల్ల గొనుచు

గీ॥ అనగ నాతడనియె నాదిత్యువలన నా। కిదిశ్యమంతకాఖ్య నెసగు
మణి ల। భించె దినమునూరు యంచితబారువు। లనుసువర్ణమిచ్చు
నయ్యవింటె॥

వచ॥ యొసంగజాలనని సత్రాజిత్తుడరిగె. నామరుదినంబు నతనితమ్ముం
డగుప్రసేనుండామణిని ధరించి హయంబెక్కి వేటకరిగిన మణికాంతిని
జూచి యొకమృగపతి మాంస ఖండంబుగా దలంచి హయప్రసేనుల
జంపి దానిం దననోట గరచుకొని పోవుచుండ భల్లూకాధి పతి
యగు జాంబవంతుండెదిరి దానింజంపి యామణిం గ్రహించికొని,
గిరిగుహయందు తాను బెంచుచున్న బాలికామణిడోలికామధ్యంబున
వ్రేలాడంజేశిన——

మంజ——అంతట సత్రాజిత్తు తమ్మునకు। నై పెద్దతడవు పరికించి
అంతుగానమిఁ చింతిలి యాగతి। యనియె నాత్మశోధించి॥

పూరికల్యాణి——ఖండగతి.

ప॥ ఎంతపని గావించె। నేమిసేయుదు కృష్ణు ॥డెంత॥

అ॥ ఉంతమోసమొనర్చ। ఔరుగనై తినిమదిని ॥యెంత॥

౧ నడుగోడినంత నేమణి। తనకీయ కుంటినని
ఘనమైన నాతమ్ముని। గని జంపి మణిగొనియె ॥నెంత॥

౨ అకటకట మణిపోయె। మనుజన్ముడాపోయె
యిక నేమి గావింతు। నెటువాని నిర్జింతు ॥నెంత॥

గీ॥ అను వచనములు కృష్ణుండు నాలకించి। నిదసైరింపజాలక శోకము
ధృతి। బాయసీయక సొంటిగా వనులవెంట। నడచె నప్పుడు ప్ర
సేను గడగి వెదుక॥

మంజ॥ చనిచని యొకచో గాంచెతునుకలయి। చచ్చిపడియున్న హయముఁ
గనియెదాని చెంగటనె ప్రసేనుని। కాయముఁగొనె విస్మయముఁ
2 అటసింహపదంబుల నొత్తుల। నరసివాని గతిజనియెఁ
అటుపడిచచ్చిన మృగపతి గనుగొని। యకటా యేమిది యనియెఁ॥

గీ॥ అవల భల్లూక పదరేఖలరసి వాని। పట్టి చని చని యొకపెను పర్వ
తంపు। గుహను గని దానిలోఁజేరి యహహా యనుచు। మెచ్చె మణి
కాంతి గనుగొని మించిదాని॥

వచ॥ కేలం గ్రహించిన జాంబవత్కుమారి విలపింప నా జాంబవంతుం
డరుదెంచి కృష్ణునింగాంచి—

శా॥ ఓరా యెవ్వడ వీవు నా మణిని నాహ్లాదంబుగా గొంచు వే
బారఁ జూచెదు చండ విక్రముఁడ నా బాహాబలంబించుకఁ
ఘోరాజింగని జీవమున్న చనుమో క్రూరాత్మ యంచంత పై
జేరన్నిర్వుర కబ్బె పోరు ఘనమై చింతింపగా రాకొగిఁ॥

గీ॥ అట్లు పెనగుచుండ నా జాంబవంతుని। బలము తగ్గుటను కృపామ
యాత్మ। నీవె రామమూర్తి వెరుగక పోరాడి తిని క్షమింపు మ్రొ
క్కితనియె హరికి॥

మోహన—ఆది.

ప॥ గిరి ధర నీ మృదు పదముల నమ్మితి ॥ గిరి ॥
అ॥ కరుణాకర భక్త సంకట హార ॥ గిరి ॥

1. నీ, కరుణ జూపినను భవ నీ, రధి దాటింపు మునీ, శ్వర వందిత
రజ నీ, చర నాశ మడవని ॥ గిరి ॥

2. వాదా, యింకనైన నీదయ రాదా। నీపాద భక్తుడను గాదా,
శరణన్న బ్రోచుటిది, లేదా, యిటులుంట నీకు మర్యాదా, భక్తా
ర్తిబాపచేగాదా, శ్రీశ్రీధా, ॥గిరి॥

కం॥ అనివారణమియునాతడు తనయుడు శ్రీకృష్ణుకొసగి తన్మయభంగిన్
జనెతన గొలిచెన్ కృష్ణుడు తనసగరము చేరి జలికె తల్లికి పిటులన్॥

మంజ॥ అమ్మ యీకొమటిమణి యీమణి దయచే నడుచు నప్పగించెన్
మన్నించి సత్రాజిత్తు బాలుని దయమున బిల్వగ బంచెన్।

వ. సత్రాజిత్తు కొసఁగిన కృష్ణుండు యుద్ధాంతంబాతయు సభాముఖం
బున తెలుపరించి—

తోడి—చతురశ్రగతి.

ప॥ ధన్యుడనైతిని। సత్రాజిత్తునృప ॥ధన్యు॥

అ॥ మాన్యుడవినునింపం। బాసితి నాటికి ॥ధన్యు॥

2 నీమణినై కొనిపేర్మిమము తోడను। నామదినూరట నంమునుయికపై॥ధ॥

3 నిందబొందమకన్న, నిలదేడావిను।బొందినివిడచుటే,ముఖ్యసుఖంబగు॥ధ॥

చ॥ అని మణియొప్పగించిన మహామహు డీవని నీచబుద్ధినై
గనుగొనలేక నిట్టులాడి గట్టితిపాపము నిందబూన్చి నీ
మనమున దీనినెంచక కుమారిని సత్యను పెండ్లియాడి మ
త్తనువుచు వంశమున్ భువిని ధన్యమొనర్పుము నందనందనా॥

వచ॥ మణింగొని సత్యనిచ్చి వివాహమొనర్చె.

మంజ॥ పాండవేయులను జూడ నడవిక్కై। పుండరీకాక్షుడరిగి
ఖాండవంబు దహియింపజేసె నా। గాండివిదోడుగబరగి॥

సీ॥ ధవునిగామదిగోరి తపమొనరించు సాధ్వియగుకాళిందిని పెండ్లియయ్యె
మేనయత్తతనూజ మిత్రవిందనుకూర్మి తోడుతవరియించి తోడితెచ్చె
కోసలాత్మజ నేడుగోవృషభంబుల నిర్జించి పెండిలి నెమ్మియాడె
నందునిచెల్లెలినందన భద్రియన్ కువలయాక్షిని గవగూడియుండె

గీ॥ నలస్వయంవరమున రాజులందరను జ। యించి మద్రభూమీశ్వరు
నిల్లుచేరి। లక్షణవరించె నిట్లు భార్యలనుగూడి। శుభము లందెను
కృష్ణుండు శౌరవర్య॥

కం॥ నరకాసురుడను దనుజుడు। సురలోకం బొడిచిపైనిసురమాతచెవిన్
మెరుగారు కుండలంబులు। చెరలించిన కృష్ణుకడకు దేవేంద్రాదుల్॥

వచ॥ యరుదెంచి మురనరకాసురుల తెరంగెఱింగించి చనిన కృష్ణుండు రణముఖుండై చనుచుండ సత్యభామ యిట్లనియె—

నాదనామక్రియ — రూపకము.

ప॥ చిత్తగించు మాయనవి । ప్రియతేశ్వరా కృష్ణా । చిత్త॥
అ॥ యిత్తరి నాదొకకోరిక । చిత్తజేయక దీర్చుము దయ । చిత్త॥
2 మీరొనర్చు కదనముగను । కోరిక పెద్దయు గలదు
బోరెడు పరాగల్గు నెడల । పొందు వచ్చు గాని యటకు । చిత్త॥
3 నరకుం డటమీరాక్షుండని । సురలెల్లరు బల్కిరిగద
తరియిచ్చిన చూపెదను । దర్పము మీకండగాగ । చిత్త॥

గీ॥ అనుచు గోరిన సత్యను హరినలదని । చెప్పి కోపంబు నందుటచేతరమ్మ టంచు గరుడుని పైనెక్కి యతిరయమున । నరకుని పురంబుజేరి భీకర శరముల॥

వచ॥ సింహద్వారంబు గూల్చి కోటబగిల్చిన నరకాసురుని తమ్ముడగు మురాసురుడు వాని నందనులగు దాముండు, నంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు, వసుండు, నభస్వంతుండు, నరుణుండు ననుసేడ్వురు యోధులును రణంబున కాయిత్తంబై వచ్చిన—

మంజ॥ రణరంగంబున కృష్ణుడు మురసుతు । లను నేడ్వుర శరమొకటన్
అణగార్చెను మురు వేరొక్కమ్మున । అంత నరకుండు వనటన్ ।
2 గని కదనమ్మున శతమార్గణములు । గాడిసంత కృష్ణుండు
దునిమె వాని మధ్యమ్మున నే పలు । ఘన నారాచంబులజుంము॥

గీ॥ అపుడు కృష్ణుండు సత్య బలాధికత గ । నంగ దలపూని నరకు రణాంగణమున । శరము దవిలిన మూర్ఛిల్లి యొఱగినట్లు । గరుడు మూపున చల్లగా నొరిగెనంత॥

మంజ॥ సత్యభామ విలుబూని నిలచి పలు । శస్త్రాస్త్రంబులం విసరన్
అత్యాశ్చర్యముతో నరకుండనె । యతివా మెచ్చితి నినుదనరన్॥

కేదారగౌళ — త్రిశ్రగతి.

ప॥ భళిర యెంత గట్టిదానవె । బాలకృష్ణునకు దగవే ॥ భళి॥
అ॥ విలు బూనుట శరమేయుట । వీర పురుష లక్షణముగదె ॥ భళి॥

2 భుజబలం బింతయొప్పి । పురుషునిగా జేయకుండ
నజుడిటు చెలువగి జేసెను । సతిని నేమనగ వలయు ॥భళి॥

మ॥ అను సంతస్థానిలేచి సత్య నెదలో హర్షించి విల్లంది భీ
షణ నారాచము బట్టి నారికిని దా సంధించి పైలాగి వై
చిన ఘోరంబగు శబ్దయుక్తముగ రక్షేశుని శిరంబున్ భువిన్
దునిమెన్ దేవతలెల్ల పుష్పములు చే తోమోదులై రాల్చగన్॥

వచ॥ అంత శ్రీకృష్ణుండు సత్యాయుతంబుగా ద్వారకంజేరి సుఖంబుండె.

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

# 17. ఉషాపరిణయము.

——:o:——

వచ॥ అవధరింపుము రుక్మిణీదేవి, ప్రద్యుమ్న, చారుధేష్ణ, సుధేష్ణ, చారుదేవ, సుచారువు, చారుగుప్త, భద్రిచారు, చారుభద్రింమ, విచారువునను కుమారులం గనియె. నట్లే, సత్యభామా, జాంబవతీ, నాగ్నజిత్తి, కాళింది, లక్షణ, మిత్రవింద, భద్రలును కుమారులం గనిరి. రుక్మిణీ కుమారులలో ప్రద్యుమ్నుండు మేనమామపుత్రి యగు రుక్మవతిన్వరించి వివాహంబాడె నన పరీక్షిత్తిట్లనియె—

మంజ॥ మునివర కృష్ణ కృతావమానమును । పొంది యెట్లు సుతనిచ్చెన్
మనమున గడుసందియము గల్గె దీనిని । మానుపదగు నిచ్చున్॥

వచ॥ శుకుండిట్లనియె—

గీ॥ రుక్మిసుతను రాజలోకంబు నిర్జించి । తెచ్చి పెండ్లియాడె విచ్చలవిడి।
రణములోననిల్చు ప్రద్యుమ్ను నోడించు । బలుడు ముజ్జగాళి గలడె చూడ॥

వచ॥ అంత నారుక్మవతీ ప్రద్యుమ్నుల కనిరుద్ధుండను కుమారుం డుద యించె. వతండు రుక్మిమనుమరాలగు రుక్మకాంతిని పరిణయంబయ్యె. నావివాహానంతరము రుక్మి బలరామునితో జూదంబాడి యోడి గెల్చితినని బింకంబులు పల్కిన బలరాముండు వానిని వాని సహ చరులం బట్టి పరేతాలయంబున కనిచె. నాఫల—

కం॥ బలిచక్రవర్తికి తనయులు నూర్వురు దానవేశ్వర యుజ్జ్వలబాహా
బలకలితులు బాణాసురు డెలమిమహేశ్వరునిభక్తు డింగితుడరయన్॥

మంజరి॥ ఆబాణాసురు డీశ్వరభక్తివశ । మత్యుగ్రంబుగ సల్పన్
ఆఘాతేశుడు ప్రత్యక్షంబై । యడిగెనె వరమొదెల్పన్।

ఆనందభైరవి—ఆదితాళం.

ప॥ జయమహాదేవ శంకర నిను । మదిన్ గొల్చెదనురా । జయ॥
అ॥ దయాభరణ నుత । దాసకరుణ కృత
భయంబుడిపి నను । పాలింపుమురా । జయ॥

2 హరా, నాకు దయ వరా, లోకరదవ పరా, కైలగిరి
ధరా, వినుము మదిదెల్పుదురా, గిరీంద్ర తనయా కుమారులతో
నీ వరుసెంచియు నా ధ్యానము గాయుము । జయ॥

మ॥ అని ప్రార్థించిన వల్లెయంచు భవుడా యర్ధాంగినిన్ పుత్రులన్
గొని బాణాసురునిల్లుచేరి సతులం గొంచుండె నారక్షకుం
డును వేబాహుల తీటదీరులకు ముల్లోకంబులం గెల్చె నా
తకిం గూరిమి పుత్రియొక్కతె యుషాతన్వంగియుండెన్ నృపా॥

జంఝూటి—త్రిశ్రగతి.

ప॥ ఆయింతి, పూవిల్తు । చేబంతి, పూర్వదిగ్చ్ఛదంతి, వర్ణింపతరమా
అ॥ కాయజు చేతికటారి । గాదె యామెరుగు మిటారి ॥ఆయిం॥

2 కన్నూనారా లేడి యన్నానుదిగడ్రొక్కు । చున్నావి కెంపులీనుమోవి
ముక్కు, నెన్నగా సంపగి తీవి । నాభి, యన్నను సరినడబావి .
కురులు, దన్నుతమంబును । సున్న, నడుము భళిర ॥యా యిం॥

వచ॥ యిట్టి సురూపయగు నుషాకాంతకు యవ్వనంబు పొడసూపినతరి
నొకరేయి పూలపాన్పున శయనించి నిదురించుచుండ—

మ॥ కలలో నొక్క మనోహరాంగు డెలమిన్ గావించి ముద్దాడి క్రీ
డల దేలించిన యట్లుగాగ నది పిదపన్ దెల్వినింగాంచి పూ
వుల బాణుండిడు వేదనాభరమునన్ పొల్పొది యుండంగ న
జ్జలజాక్షింగని చిత్రరేఖయను ప్రజ్ఞాశాలి దానిట్లనున్॥

సీ॥ ప్రియ వయస్యరొ నాకు చెప్పిన ఫలమ్ము । గలదు గద యేల
యిట్లుంట గల తెరంగు . తెల్ల మొనరింపు మేదని తీర్చి నీకు చిత్త
భ్రాంతిని నాకింతు ని శ్చరిసన.

ఘణ్టారవరాగ—త్రిపుట.

ప॥ కలగంటి కలగంటినే ఓసఖినేను ॥కల॥

అ॥ కలగంటి రోకజాణ । కాను నాపక్కకు
కిలకిల నవ్వుచుక । కలికి యేతెంచినట్లు ॥ కల॥

2 ననుసిగ్గున నేను । కనియు కననియట్లు
పవవిల్లు డమ్ములు । నాపై విసరినట్లు
. వనితా రమ్మని కేలు । బట్టి లాగినట్లు
జనుని సిగ్గని కౌగి । టను దార్చినట్టులు ॥ కల ॥

3 పక్కను చేరియు । చెక్కిలి నొక్కినట్లు
చక్కగ రతికేళి ॥ సుక్కజేసినట్లు
మక్కువ దీరిన । మరలి పోనున్నట్లు
దక్కితి వని నేను ! తను నిల్పినట్టులు ॥ కల ॥

చ॥ వనితరో నన్ను కౌగిట కృపామతి జేర్చి సుఖింపజేసి నా
మనము హరించినట్టి సుకుమారుడె నాథుడుగా దలంచి వా
ని నిలయు వర్తనంబులెటు నేనెఱుగంగలదాన సేవ జే
యను నెటులభ్యమౌనసుచు నాత్మను వందురు చుంటి నీగతిక॥

వచ॥ అనియెరింగించి నిడూర్పుపుచ్చిన యుషా కుమారినిగని కుంభాండు
నందనయగు చిత్రరేఖ యిట్లనియె—

మంజ॥ కలలోపల గనినట్టి వానిపై । వలపు నిలుపదగునే
చెలి యాతండెవ్వరైనది మనకుం । దెలియగాను వశమగునే॥

కం॥ అవ వినియుష సఖియిట్లను । వనితాకలలోన నన్ను వరియించిన యా
మనసిజ సుందరు దక్కోరుచు మనమున దలపోయ చూడమాటలి కేలా॥

మంజ॥ కలలో దోచినపురుషుం డిలపై । గలిగిన పెండిలియగాను
కలుగనిచో మరణంబె పాపగు నా । కైన నిశ్చయముచినుము॥

2 అని విచారకమును తెలిబుచ్చిన యూ । యతివనుగని కాంతా
వినుముల్లోకంబుల యువతుల । విధము చిత్రింతు నంతా ।
3 నీకలలో నిను వరియించిన ప్రియు । నీవు గనుగొని వచింపన్
యేకడ నుండిన దెచ్చి నీకిత్తెద । నేనిటు లన్నియు వచింపన్ ।
గీ। అని యెఱింగించి చిత్రవిద్యా నిపుణత । గల్గినది యూట సకల భూ
కాంతుల సుర । తనయులను నాగయువకుల దగుగతి లిఖి । యించి
గొనివచ్చి యుషకు చూపెంచె నిట్లు ।
మం॥ అతుల వివిధ సంగీత పాటకులు । సౌగంధర్వులు వీరల్
సతత యవ్వనులు సిద్ధసాధ్యులు । చారణులన గను వీరల్
2 విమల సౌందర్య సంపదల దేలుదురు । కిన్నరయక్షు లివ్వారల్
అమల కళావిభవాస్పదులగు కా । మాకారులు నగు వీరల్
*ఉ॥ మాళవ కొంకణ ద్రవిళ మత్స్య పుళింద కళింగ భోజ నే
పాళవి పాండ్యదేశకురు బర్బర సింధు యుగంధ రాంధ్రబం
గాళ కరూశ కొంకణ త్రిగర్త సుధేష్ణ మరాటలాట పాం
చాల నిషాద ఘూర్జరక సాళ్వమహీశులు వీరె కోమలీ।
కేదారగౌళ—చతురశ్రగతి.
ప॥ ఇతని జూడుమా । సతీ॥ యితె ॥
అ॥ చతురుండతి బలుడు జరా । సంధుడు మాగధ తనయుం ॥ఇతె॥
2 సకల ధరాతల నాయక । సన్నుతుండు భూరిబలుడు
అకలంకుడగు భీష్మకు । నాత్మజుండు రుక్మినాము ॥ఇతె॥
3 సుగుణంబుల నెలవని బుధ । స్తోమమెన్ను బలవంతుడు
భగదత్తుడు నరకుని సుతు । డగణిత సంపన్నుడు విను ॥ఇతె॥
4 నందక చక్రాబ్జగదా । నందిత హస్తుడు ఆశ్రిత
వందితుండు పౌండ్రకుడను । వాసుదేవ నాముడు వీ ॥ఇతె॥
కం॥ కనుఁగొనుమిదె ధర్మజభీమా । ర్జునమాద్రేయులను పాండుజనపతిసుతులన్
వినుత పరాక్రమవిక్రమ।ఘనులను దేవాంశజాత కరులన్ సఖియా॥
గీ॥ ధార్తరాష్ట్రిల గాంధారి తనయులను సు। యోధనాదుల నూర్గుర

యుజ్జ్వలాంగుల! నీకోమల సౌఖ్యవంతుల వెలసిమిన్న! యని వచించిన
యుషయూరికనె నిలచిన

శ్రీరాగ — రూపకం.

ప॥ వీడే వసుదేవ సుతుడు। వేదవేద్య సంభవుడుగను ॥వీడే॥
అ॥ నాడుకంస దనుజు జంపి। నట్టిబలుడు మురహరుడు ॥వీడే॥
చ॥ చూడచిత్రముగ గోవర్ధనగిరి। నాడు కేలనెత్తి గోపకు
లోడకుండంచని గాచిన। యుజ్జ్వల తేజోనిధిచూడుము॥ వీడే॥
2. గోపాలకుడనగ బరగి। పాపాత్ముల శిక్షింపుచు
కోపంబున కాళీయుని। కుంజెలదరగా నర్తన
చ॥ మోపికగావించినహరి। యుర్విసాటిలేనిమేటి
చేపట్టిన దేవాదులు। చేరి సేవజేయుసరిక॥ వీడే॥
వచ॥ ఉషాసుందరి యిట్లనియె-
గీ॥ అతివ నాకలదోచిన యతనికితడు। రూప చిహ్నంబులను సాటియగా
పడుచు ద। నంబుగల వాడతండు ప్రాయంబు మొగ్గి। నట్టిడీతండు
గాన నాకెట్టులీడు-
చ॥ అనిన యుషాకనుంగొనుము నాతనినందను డంగజుండనన్
ననవిలుతుండనన్ బరగు నమ్రతనుండు భుజాబలుండు భీ
ముని మనశంబరాసురుని పోరజయించి వధించినాడు యీ
తని వరియించినన్సుఖ యుతంబని వేరుగ జెప్ప నేటికిన్॥
మంజ — అనపటంబు పరికించిచూచి యుష। యనియెనిట్లుతలయూపి
వినుమీతడు నా విభుడుగాడుకడు। వేసటనందితిచూపి
2. అతనినూగు మీసంబులేడ యీ। యతనుని మీసములేడ
చతురుడైన నగుగాక వరింపగ। జాలమది వానివీడ॥
వచ॥ అన చిరునవ్వునవ్వి చిత్రరేఖ యిట్లనియె.
మ॥ సకలోర్వీతలనాథ సన్నుతుడు శశ్వద్భూరి బాహాబలా
ధికు డుగ్రాహవకోవిదుండు త్రిజగద్విఖ్యాత చారిత్రకుం
డకలంకోజ్జ్వల దివ్యభూషుడు విదర్భాధీశ్వరుండైన భీ
ష్మకభూపాల కుమార పౌత్రుడితడో మత్తద్విరేఫాలకా॥

వచ॥ అని చూపిన సంతసించి యుషాసుందరి,

నాటకురంజి—రూపకః.

ప॥ ఔనువీడె నామానస। హరుసుసుందరాంగి। ఔను।

అ॥ మానము చూరలబుచ్చిన। మాయదొంగ నేడుదొరికె। ఔను॥

ని॥ యానవయవ్వనుపొందు। నెపుడుతనివి దీరగందు
మానిని నీదయనేమందు। మంచిమేలుచేశితిందు। ఔను।

2 కలలోపల నరుదెంచి। కామంబెదగల్పించి
సొలయగ రతిదేలించి! సూనశరుని బారిసైచి

ని॥ తలపగ రానివిధంబున। దానేగిన దొంగవాని
దెలిపితివతి ముదమొదవెను। ధీశాలివి నతులందుము॥ యౌను॥

మ॥ అనియూహ్వల్ నిగుడించు కోమలికనుఙ్ అయ్యింతియోహాహోయుషా
నను చింతింపవె యింద్రజాలినని యీనాడేగి నాశాంబరిఙ్
ననవిల్కాని కుమారుదెచ్చి తవసన్మానంబు గైకొందు నీ
తనుగైసేత ముగింపు నంతకని యాతన్వంగి మాయావిధిఙ్॥

మంజ॥ వినువీధిం జని గాంచె త్రివిష్ట। పవిభవ ద్వారకాపురమ్మున్ఙ్
కనులకు పండువు జేసెడు రుక్మ। కాంతి దివ్యహర్మ్యమ్మున్ఙ్॥

గీ॥ అర్ధ రాత్రింబునింటిలోపరిగి రుక్మ। కాంతిపర్యంకను శయనించి గాఢ
నిద్ర। మునిగియుండిన యనిరుద్ధు గొనిచనె దివి। చిత్రగతి నైంద్ర
జాలి యాచిత్రరేఖ॥

వచ॥ అనిరుద్ధునిం గొనివచ్చి యుషానిలయంబు నన్నిల్పి యామెచేసుత
బహుమతులనంది చిత్రరేఖ చనిన కొండొక తడవ్పున కాచిలుక
వజీరుముద్దారు నందనుండు తెలివింగని తనగృహంబు గామికించుత
విచారించు సమయమ్మున యుషాసుందరి నను సిగ్గున సమీపించిన-

మంజ॥ అతివా యెవ్వతెవీవు నేమయిట। కరుదెంచితి నేగతి నీ
పతియెవ్వరు యేపురమిది నీవిటు। వచ్చుటేమి సంగతి నీ

వచ॥ అనిన నయ్యా! యిది శోణనగరము నేనీనగరాధీశు నేకపుత్రికను
అవివాహితను నీవ్వు నాకలయందు దోచి నన్ను రతింగలసిన కతన
నిన్నే వరించి తెప్పించితిని—

పూర్వకళ్యాణి—చతురశ్రగతి.

ప॥ కరుణింపుమా! నాస్వామి తేరా! కరు।
అ॥ వరుణీ నెయుంచు । మదిసమ్మయుంటిని ॥కరు॥
2 మొదటల నోట చేసింతకు । పరిణయంబు గాలేదిక
సురతం బొనరించితి కలలో । సుందరాంగ పతిగావవు ॥కరు॥

గీ॥ అనుచు ప్రార్థించుచనయ్యుషా యందమునకు । ముగ్ధుడై యనిరుద్ధుండు
ముక్తలాడి । కౌగిటంజిక్కి రతి కేళి కలసి మెలసి । సొలసి సొలయించి
యచ్చోట మెలగుచుండె॥

మంజ॥ అంతకొన్నాళ్ళ జనినపైని నా । యింతికి నెలసరి దప్పెన్
చింతిలి పరిచారికలు భయమ్మున । చిత్తంబులనిగురొప్పన్॥
2 మిన్నకున్న మోసంబువచ్చునని । కన్నెన జనిబాణునకున్
విన్నవించిరది చేతులు మొగిడిచి । వినయంబున ప్రభువరునకున్॥

గీ॥ అటులెరింగించినంత బాణాసురుండు । కటముల దరగ దంత సంఘ
టనక్రోధ । ముట్టిపడ పేరసైనికు లొక్క మొగిని । తన్ను వెనుకొన
కూతు సదనము జొచ్చె॥

వచ॥ ఇట్లరుదెంచి కుమారికా నిలయంబు కలయంబరికించి అనిరుద్ధునిం
గాంచి రోషావేశంబున దూరిన నతండలుక దలపక వినయంబుజూప
బాణుండదయుండై సైనికులంజూచి యీగొల్లనిబంధింపుడన వారలు
పైరా కృష్ణపౌత్రుండు సగుణ కార్ముకుండై పదింట నేసింట నిర్వ
దింట నందరం బడగూల్చి బాణుండు దారసిలి శతపత్రదరంబులనతని
నదలింప నతండిరువదియైదు బాణంబుల దోడిన బలిపుత్రుండతని
కార్ముకంబును విరచి పైబడి బంధించి చెరయందుంచె-నావల—

మంజ॥ ఒక్కదినంబున ద్వారక కృష్ణుం । డోలగంబు నందుండన్
అక్కడ కరుదెంచెను నారదుడను సం । యమీంద్రుడొక్కండున్॥
2 హరికృష్ణాదులు యామునికి । నర్ఘ్యపాద్యాదుల నలరించి
బలికొట్లు తమబంధుమిత్రులకు । కలమ్ముల నెరిగించి॥

గీ॥ నారదా సర్వలోక సంచారి వగుట । వడుగుచున్నార మనిరుద్ధుడంతి

పురము లోనకేతెంచి మరునాడు గానరాడు! చింతిలుచున్నది
మతని వృత్తాంతమేమి!

వచ: నీకెరుగవచ్చునంతవర కెఱిగింపుమన నారదుం డిట్లనియె-

మలయమారుతము — రూపకం.

ప॥ అఖిలభువన ధారుణివి । వదిమెఱుంగవా ...ఆ...ఆ ॥అఖి॥

అ॥ నిఖిల మెఱిగినట్టి నీకు । నేచెప్పం గలాఘనా ॥అఖి॥

మి॥ సుఖముగ నిదురించెను మన । సూనశరుని తనయునితో
సుఖయింపగ బాణాసురు । సుతమాయుంగొని చనియెను ॥అఖి॥

2 అనిరుద్ధుండా యంగన । నతను కేళి దన్పుచుండ
వనితకు మూలాదనె తండ్రి । విని కోపంబున సంగర

మి॥ ముని జామాతను బంధించెను కారాగారంబున
మునిచె శోణనగరంబున । నుండెను మీపౌత్రుండిప్పు ॥అఖి॥

చ॥ అని యెఱిగించినంత చటులాగ్రహ మున్నహ చిత్తుడై రణం
బున దనుజేను గీడ్పరచి ముక్తుల హాత్తుని దెత్తుమందరున్
జనవలె లెండటంచు హాలి । సాత్యకి సాంబయుతంపు సేనలం
గొనిచనె శోణపూర్వరముకున్ వినెనంతట బాణుడింతయున్॥

వచ॥ నేటికింగదా? నాసహస్ర భుజంబుల తీటదీరు పోరొనగూడినదని సంతసించి దనుజచమూ సమేతుండై పురినిర్గమించి యాదవ బలంబుల డీకొనె—

గీ॥ ఇంతగనుగొని బాణుని యింటబంటు । వలెనటించెను హరుడనుప్ర
మథగణము । తోడునడువగ రణభూమి వేడుకలర । జేరెదివిజసమూ
హంబు దేరిచూడ॥

వచ॥ నంత నిరువాగుల రణాంబావహిల్లె, నందొండొరుల ద్వంద్వ సమరంబు వర్ణింప నశక్యంబు. శ్రీకృష్ణ శంకరులును, కుమార మారులును, కుంభాండ కామపాలుడును, బాణతనయ సాంబులును, బాణసాత్యకులును, రథిక రథికులు, నాశ్వికాశ్వికులు, గజారోహక గజారోహకులును, పదాతులు పదాతులును, తలపడిఘోరంబుగా పోరాడుచుండ—

మం॥జ॥ వివిధాస్త్రంబులతో శంకర । మురభేది రణంబెల్లరకుర్
తప్రభయ మొదవించెను కొంచెక । తదవుకు హరిభల్లముకుర్ ॥

గీ॥ నిస్పృహాత బొంది శార్వాణి నేత వృషభ । రాజమూపున వ్రాలిన
రాక్షసేంద్రు । డెరిగి శ్రీకృష్ణుని దాకి శరముల విలు । నడసి రథ
సారథుల బాసి గుడిచెచింత ।

వచ॥ అంత బాణుండు పురికి బరువిడి శైవజ్వరమను శక్తినొండు బంపిన
నద్దానిపై కృష్ణుండు వైష్ణవ జ్వరంబు వైచిన నదియోడి హరిశరణు
జొచ్చె నావల శంకరుండు దెప్పరిల్లి ప్రాంజలియై

కమాచి—త్రిశ్రగతి.

ప॥ కరుణాకర మానేరము । క్షమియింపుము పరమాత్మా హరి ॥కరు॥

అ॥ దురితంబొనరించినాడు । యెరుగక భక్తుడు బాణుడు ॥కరు॥

చ॥ పరమ పావనంబయ్యె వానితను । భావంబులు మీదర్శనమున
చిరుతని దీవించి నన్ను । చింతించి వరంబొసగుము ॥కరు॥

2 మనుమని వదలించి పుత్రి । మదిరంజిల నిచ్చిపెండ్లి
ఘనగతి గావించి పుచ్చు । మనిబాణుని యొప్పించెద

చ॥ మును ప్రహ్లాదుని వంశం । బును గాచెదనని యనవే
కిమక బూనవలదు హేళన । క్రీడగ దలపుము మురహర ॥కరు॥

చ॥ అనుచు నుతించి శంకరుడు యాహరి మన్ననలంది బాణునిర్
గని హరితోడి బాంధవము గల్గున నెంతటి వారికేని నీ
మనమున శంకబూనక కుమారిని యయ్యనిరుద్ధు కిచ్చి య
త్యనుపమ లీల పెండిలి రయంబున సల్పుము నాగనాతదుర్ ॥

వచ॥ సమ్మతించి హరితో సఖ్యంబు గావించి యుషానిరుద్ధుల వివా
హం బాచరించి యరణంబుల నొసంగి వీడ్కొల్పిన—

గీ॥ పౌత్రునితో పౌత్రితో మురవైరి ద్వార । కా ప్రవేశము గావించె
తాన్మవరుడగు । నృగుని శాపంబు దీర్చె నానృపుడనె నెటు । లవలి
వృత్తాంతమంతయు నానతీవె ॥

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

సీ॥ ధరణీశవినుసుయోధను పుత్రిలక్షణ వాసుదేవునకు జాంబవతికతన
గలిగిననందను ఘనబాహుబలయుతు సాంబునివరియించి సాహసించి
హస్తినాపురినుండి యతనితో వెడలిన కౌరవేసులువిని కర్ణముఖుల
తోవెంటబవిలి పెద్దురమున సాంబుని నిర్జించిబంధించి నిలిపెజెరను
గీ॥ నారదునిమూలమునవిని నందతనయు। డింతపోరికిగవిసిన చెంతనున్న
సీరి సంధినిగావించి చేసెసాంబ। లక్షణాపరియము సలక్షణముగ॥
మంజ। ఆవల కుశలంబుగ ద్వారక పుర। మందు కృష్ణుండుండగఁ
పావన గానరతుండు నారదుడు। పద్మనాభు జూడంగఁ॥
వచ॥ అరుదెంచి హరికినమస్కరించి సుఖోపవిష్టుండై యిట్లనియె॥

కానడ—త్రిశ్రగతి.

ప॥ మనవిగైకొనుమయ శౌరీ। మహితస్వర్ణ వసనధారీ॥ మన॥
అ॥ మునిజనమానస విహారి। మురదానవ సంహారీ॥ మన॥
2 నాకొక కోరికగల్గి। శ్రీకరమిము జేరితివిని
చీకొట్టబోదా పోనిమ్మని। చేతువో సాయము దెలియదు॥ మన॥
3 మదనుడదయ్యు డైనా। మెదమూరల బుచ్చెగాన
సుదతినొకతె నొసగికామ। సుఖముచూర గొనజేయుము॥ మన॥
మ॥ అనిప్రార్థించిన కృష్ణుడిట్లను మహాత్మా నాపదార్వేలకా
మినులందొక్కతె నీకెయింతటి తలంపే మీకు సంధిల్ల నే
వనజాతాక్షి గృహంబునందిపుడు నేవాసంబుగావింపనో
గనియాలింగన చుంబనాది క్రియలఁ గావింపుమానారదా॥
మంజ—అనియెరిగించిన వల్లెయంచుచని। యానారదు డంతంతఁ
వనజాతాక్షుని మాయనెరుంగక। వాడవాడలకు జనెవింతఁ॥
గీ॥ ఒకటపాడుచుండు నొక్కచో నాడుచు। నుండు నొకటనవ్వు నొకట
తగుల। మందునొక్కచోట నారగించు నొకంట। పవ్వళించు కృష్ణ
పతిముదమున॥
వచ॥ నారదుండిట్లెల్లర గృహంబు లందును కృష్ణ పరమాత్ముం గాంచి
యతని మాయా మహిమ కబ్బురమంది యొకయెడ కృష్ణుపాదంబు
లంబడి—

వైరోక్తి రక్షించె గోపకులను। యిట్టి శ్రీకృష్ణు సరిపోల్ప నెవరి
కగును। యగ్రపూజకు తగునట్టి యనఘుడతడె।

మంజ॥ అనవిని కృష్ణుడు శిశుపాలునకే। యాచరింపుడీపూజ
మనుకేశ్వరుడను గాడు నాకిదె। మాన్యుడగు సల్పుపూజ॥

వచ॥ అనిన దమఘోషాత్మజుండిట్లనియె—

గీ॥ అద్దిరా గొల్లవా పిరయూరపంబు। క్రోధమున కేవుజపియను రుక్మి
ణీసతి బొంగిలినవాడు సిగ్గుపౌత్రులనె నింద। తప్పదిక నగ్రపూజ
కితండునవిను॥

గీ॥ కృష్ణుడిట్లను యీమంచగీను నాకు। మేనమరదియగుట తల్లిమేలు
గోరి। యుంటశతపరాధముల్ సైచియుంటిసింక। నూరకొనజాలవీని
యాయువిదెతీరె।

మంజ॥ అనికృష్ణుడు ధర్మజు డొసంగిన। యాపళ్ళెరముగ్ బూని
కనలుచు విసరిన దునిమెనతని చ। క్రాయుధంబునై పూని॥

వచ॥ అంత రాజసూయాధ్వరంబు పూర్తియయ్యె—

గీ॥ హాలధరుడంత తీర్థయాత్రాభిలాష। నరిగెయావంతి కాశ్యయోధ్య
ప్రయాగ। గయకురుక్షేత్రమాయ శ్రీకాళహస్తి। రామగుండము
నాదిక్షేత్రంబులకును॥

దేవగాంధారి—ఏకతాళం.

ప॥ కురువంశోద్ధారవినుము। కుచేలుడొకడు పేద ॥కురు॥

అ॥ ధరణిసురుడు యోగరతుడు। దైవభక్తి తత్పరుడు ॥కురు॥

౧ శ్రీకృష్ణుని బాల్యసఖుడు। చిరిగిన వలువలు దాల్చి
తేమవ మునిపల్లెలోన। దివిరి తపంబొనరించెను ॥కురు॥

వచ॥ ఆకుచేలున కర్ధాంగియగు వామాక్షియందు యిరువది యేడ్గురు
కుమారు లుదయింప-

సీ॥ హీరవరమూడమే నిరుపేదవాని। కధికసంతాన మొకనాడు ఆకటవక
వశలువడి విప్రనందనుల్ యొకగతి తమ। జననికడకేగి యిటులేడ్వ
సాగిరంత॥

హిందుస్తాని ముఖారి — చతురశ్రజాతి.

ప॥ అమ్మా మేమాగలేమే యీ । యాకలి బాధకు నకనకమైన ॥అ॥

1 ప్రొద్దున త్రిక్కొచ్చెనే యొక ; ముద్దైన మాకీయజాల వేమిగతి! అమ్మా॥

2 కడుపు సొద బెట్టెనే యిక । గడియైన తిండిలేక బ్రతుకగాలేమె॥ అ॥

మ॥ అని వాపోయెడు పుత్రులం గనుచు దానాత్మేశు సాన్నిధ్యముం
జని నాథా యిటు జూడుడీ శిశువు లన్నార్తిం గుంజెట్టిరే
మని యారాటపడ నాకలం బడిటులన్ యాలోచనల్లేక కూ
ర్చొనిన న్నేమి ఫలంబు తెండనిన పాయం దుస్సహం చిల్లరున్॥

మంజ—వనితా దారిద్ర్యాంబుధి లోపల । బడిమునిగెడు మనకున్
గనదరియించెడు నాకగం బెదియొ । గడచు నేమిగావింతున్॥

వచ॥ వామాక్షి యిట్లనియె.

గీ॥ మీరు ద్వారకనాథుని కూరిమిసఖు । లంచు వింటినిగాన నయ్యనఘు
జరిసి । లేమినిం దెల్ప సాయంబు నేమియేని । చేయుడే పోయిరండు
మీచి త్తమువల॥

వచ॥ అన కుచేలుం డబలా! అతండు నేనును బాల్యసఖులము. ఏడి చా
లాకాలంబయ్యె నదిగాక నేనా కడు పేద నతండా రాజాధిరాజ భోగ
పరుండు. నన్నిపుడు నిరసింపక పూర్వమైత్రిం జూపునే॥

గీ॥ యెట్టులైనను శ్రీకృష్ణు పట్టణంబు । చేరుటయె లెస్స దర్శన శ్రీలభించు
గాని రిత్తచేతుల ప్రభు గానబోదు । నాయనుచు చింతగల్గునో
హంసగమన॥

మంజ—అన వామాక్షియు నాథా యటుకులు । గొని తెచ్చితినో కరింటన్
చినబాలుని పోరుడుప వానిగొని । శ్రీకృష్ణుని గనుగంటన్

2 మంచిది లేయని యాకుచేలుడున్ । పంచచెరుగు నందున్
కొంచెము యటుకులు గట్టి ద్వారక । కున్ జనెగనగ ముకుందున్॥

వచ॥ మెల్ల మెల్లగా నడచుచు పాంథజనంబుల పదంబుల వాడిసూదుల
క్రియగుచ్చుకొని వెచ్చరక్తంబు నూద్చు తుమ్మముండులతో
నొప్పారి, జననిష్ఠనదుర్గంబులందాగిపు వారికిఘోరంబులదరి పాలజేయు

సింహశరభ వ్యాఘ్రాది దుష్టమృగసంతాన ధ్వనులతోఁగూడి, గం
ధర్వయువతీజనగాన ప్రముదితోల్లాసంబున ఫణంబులవిప్పి యాడు
భుజంగ సమూహముతో విహారి ప్రచండచండకరకరోష్ణ వేదనా
నివారణో ద్దీప్తచిత్తమత్త మాతంగవిహారిత ఫుల్లకల్హారార విందా
లంకృత సరోవరంబులం జెన్నారి, శుకపిక శారికానికాయ సమృ
ద్ధంబై యలరారు కాంతారంబు నిర్గమించి యనేక జనపదంబులం
దాటి యమునానదిం బల్లకట్టునంబునం గడచి ద్వారకానగరంబుచేరి
శ్రీకృష్ణుని దివ్యభవనంబుం జొచ్చి లోఁజొరంబోవ ద్వారపాలకులు
అడ్డగించి—

పంతువరాళి—చతురశ్రగతి.

ప॥ బాపడా। నిలునిలుమిక ॥బాప॥

అ॥ లోపలకేగగ నీవెటు। లోపెను చిరిగిన గుడ్డల ॥బాప॥

2 రాజాధి రాజులదె। యీజనులందర గనుము
యోజకృష్ణు దర్శనమున। కుండిరి నీకెటులౌను ॥బాప॥

3 ప్రొద్దున నిద్దురలేచి నీ। మొగముచూడ గతులుండవు
వద్దన్నను వినక లోని। కద్దిరపోనుంటివి చాల్ ॥బాప॥

గీ॥ అనుచు నడ్డగింప నాకుచేలుండేమి। బలుకలేక ద్వారపాలురకడ।
నిలచి మదినిహారిని నిల్పి యీగతి ప్రార్థ। నంబు సల్పదొడగె నర
పతివిను॥

సావేరి—రూపకం.

ప॥ మురళీ ధరవర। గోపకిశోరా ॥మురః॥

అ॥ శరణంటిని నను। కరుణింపుమురా ॥మురః॥

2 నీమూర్తిని గను। నాశవచ్చితిరా
శ్రీమనోహరా। చెలికాడనురా ॥మురః॥

3 ద్వారపాలు రిటునిల్పిరిరా నా
నేరమేమి నాకుచేలుండమురా ॥మురః॥

ఉ॥ అంతిపురంబునందు దనయుంగనలొందను చేరిపేవ ల
త్యంతము సల్పుచుండ మృదు తల్పమునం బవళించి రుక్మిణీ
కాంతుడు నేకుచేలుడను గావును నిల్చిరి ద్వారమందు సం
చెంతమొకక్షణోళమున కేగిన దిగ్గనలేచి ప్రేముడిన్ ॥

వచ॥ ద్వారముకడ కరుదెంచి కుచేలునిం గౌగలించుకొని యెదవాత్తు
కొని లోనికిం దగుకీతినొనిచని తనహంసతూలికా తల్పముం జేర్చి—

మంజ॥ జలములు రుక్మిణిపోయ పాదములు । చక్కగాగడగి కృష్ణుండు
వెలగల చీనాంబరముల పాద । మ్ముల తడిమొత్తినజుండు।

గీ॥ తక్కుగల కాంతలెంతయో మొక్కి వీవ । నలను వీవగ గంధమ్ము
నలదకృష్ణు। డాకుచేలుని పాదంబులంటి మస్త। నంబుచేయుచు దారల
నరసియునియె।

మంజ॥ నాకుభక్తుడై సతమునన్ను వీడ । నాడక కొల్చునేవండు
తేకువ వానికి నేభక్తుడనై । దిబిరి సేవింతు జుండు।

కం॥ మిత్రమ కుశలమె నీకు క। ళత్రంబుకు నీకుశుభమె లావణ్యవతుల్
పుత్రులు పుత్రికలెందరు। యాత్రిజగమ్ములను ధన్యుడీవె కుచేలా॥

వచ॥ అన దేవా! నీకృపామహిమంబు కతన నందరుంగుశలమే. పుత్రు
లిర్వదియేమగురు జనించిరని మిన్నకున్న శ్రీకృష్ణుండు తలయూచి-

భాగేశ్వరి—చతురశ్రగతి.

ప॥ చెలికాడా మరచితివా। చిన్ననాటి మననడతలు ॥చెలి॥

అ॥ తలపులొకటి గాగగురుని। ధామంబున మెలగుటలో ॥ చెలి ॥

2 గురుసతి యొకదినము వంట। చెరకు దెండు యడవిలోన
కరిగి యనగ నీవేనును । యరుగమా? వర్షము రాదె ॥చెలి॥

గీ॥ యిట్లు చిన్ననాటి వెరిగించి కృష్ణుండు। నన్ను చూడ వచ్చినాడ
విదియె। చాలునాకుకాన్క సాదరంబున నేమి। తెచ్చినాడ వేది
తెమ్ము సఖుడ॥

వచ॥ అని గోర కుచేలుండటుకుల నిడుటకు శంకించి మిన్నకున్నంత

కృష్ణుండు వాని చేలాంచలంబునన్ముడిచిన యటుకులువిప్పి బ్రహ్మా నందంబున నొకటిపిడికిలి భుజించి వేరొక పిడికిలిం బట్టిన—

మంజ। భవ్యుని కరము తెమలించి పట్టి వై। దర్భ యిట్లు తానని యెంగా యివియే చాలును భోగ భాగ్యముల। నిడుట కింక వలదనియెంగా॥

గీ॥ కృష్ణుడావల మిత్త్రుని కిడిచిరత్న। రత్నభూషలు చీనాంబరంబు లొసగి। పిమ్మకొలిపిన పారుండు వెడలి నిజపు। రంబుగనుగొనియమిత విభ్రాంతుడయ్యె॥

కేదారగౌళ—ఏకతాళం.

ప॥ అతుల విభవమీపురంబు। నౌరావర్ణింప దరమె ॥అతు॥

అ॥ నుతియింప గదగి భవనము। లతియున్నతమై దనరెను ॥అతు॥

2 వీధులతి విశాలమ్ములు। వివిధ విపణి వారమ్ములు సాధుజనుల యాశీస్సులు। సౌఖ్యమె రూపందె ననగ ॥నతు॥

మ॥ అనివర్ణింపుచు యీపురంబెదియొ నయ్యబ్జాక్షు శ్రీద్వారకన్ గొనదాజీరికి నంచు వింతపడు నగ్గోవింద పాదార విం దనతద్భక్తియుతుండు కుచేలుదరి కాంతారత్నముల్ చేరి పా వనచారిత్ర భవత్పురంబిదియె దివ్యద్గేహముల్ మీయదే॥

వచ॥ అని యొక దివ్యమందిరాంతరమునకుం గొనిచని రంతవామాక్షి సభూషయై యరుదెంచి నమస్కరించి దేవా యిదియంతయు తమ దయయును శ్రీకృష్ణానుగ్రహంబునను లభించెనని యెరిగించిన నా కుచేలుండు సంపద తనకుగానట్లుగా దలంచి భగవద్భక్తిపీడక తరించె. సూర్యోపరాగ సమయంబున—

మంజ॥ గ్రహణస్నానమ్మును గావింపగ। రామకృష్ణు లెదదలచీ గృహిణుల బంధుల పరిచారకులతో। గేహంబులెల్ల విడచీ

2 మునుభార్గవ రాముండు క్షత్త్రియుల। దునిమి వారిర క్తమునన్ మునుపదులను శమంత పంచకము। గానగు వానినొనరెన్॥

వచ॥ అట్టి శమంతపంచక నదీస్నానార్థంబుచని కృతస్నాతులై యటకరు దెంచిన యాశీనర, మాత్స్య, కురు, కోసల, విదర్భ, సృంజయ, కాంభోజ, కేకయ, మద్రి, కుంతల, ఆరట్ట, కేరళాది భూపతులను నందగోపాది గోపాలురను, ధర్మభీమార్జున నకుల సహదేవులును, భీష్మ ద్రోణధృతరాష్ట్ర గాంధారి, కుంతి, ద్రోవది, హిడింబిసంజయ విదుర, కృప, విరాట, భీష్మక, ద్రుపద, శైబ్య, ధృష్టకేతు, కాశీరాజ, దమఘోష, విశాలాక్ష, బాహ్లిక, భూరిశ్రవ, సోమ దత్తి, యకూ్రి రోగ్రిసేన, యుద్ధవాదులంగలసి యిష్టగోష్ఠిం బ్రొద్దు పుచ్చుచుండ నందు నందయశోదలంగని దేవకీవసుదేవులు—

శా॥ మాకుంగల్గిన నార్వు రాత్మజుల ప్రేమంబూర్చి కుష్టుండు ము న్నాకంసుడు వధించె. వీనిని త్వదీయావంత కారుణ్య ప్రి జ్ఞా కార్యంబుగ చూడగంటిమని సంప్రార్థింప నాలించి యా శ్రీకృష్ణుండు శిరః ప్రికంపనత లేచెఁ యేరికిం జెప్పకఁ॥

గీ॥ దాతయగు బలినిలయ రసాతలంబు । కరిగి బలిచక్రివర్తి సేవాదు లంది । యతనికడమన్న దేవకి సుతులనార్వు । రను గొనుచు వచ్చి యిచ్చెను జననికంత॥

వచ॥ దేవకీ దర్శనంబునను శ్రీకృష్ణమాత్మ. తను స్పర్శంబునను యా బా లురు దేవతామూర్తులం దాల్చి హరికినమస్కరించి సత్యలోకమరిగిరి॥

మంజ—అనపరీక్షితుడు దేవతలీగతి। యగుటకే కత మొజాండీ
విన వేడుకగల్గెను వృత్తాంతము । వినిపింపు డఘము జెండీ॥

వచ॥ పూర్వము మరీచియను వానికి నర్ష యను కామినికిని వీరు నందను లై జనించిరి. భారతీవిధాతలంగని తండ్రి కొమరితలకే పరసమా యని నవ్విన విధాత బ్రహ్మరాక్షసులుగా శపించిన వీరు హిరణ్యా కశ్యపునకు పుత్రులై జన్మాంతరంబున శ్రీకృష్ణ సోదరులై జనించి కంసుచే నిహతులైరి.

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

---

# 19. సుభద్రాపరిణయము

—:౦:—

మోహన—ఖండజాత్యేక తాళం

ప॥ ఆలింపు హరిచరిత। మాలింపు పాపమ్ముల ॥నాలిం॥

అ॥ మేలెంచి భాగవత। మీాపుసర్వమును ప్రేమ.॥నాలిం॥

2 హరితనయుడు యతియై। హరిసోదరింగూడి

దురమందు హలిప్రముఖ వరులను నిర్జించిన కథ ॥నాలిం॥

మంజ—యింద్రప్రస్థ పురంబునపాండవు। లింద్రవైభవము తోడఁ

సాంద్రకీర్తితో రాజ్యపాలనము। సల్పుచుండిరొకజాడఁ॥

గీ॥ యొక్కనాడు చేరె నక్కడ కతిప్రేమ। శౌరిగాన రతుడు నారదుండు

అర్ఘ్యపాద్యాదిఖుల నతనిపూజించి ధ। ర్మజుడు గోరెనిట్లు మర్మ

మొకటి॥

పూరికల్యాణి—రూపకం.

ప॥ మానిచంద్రి సుగుణసాంద్రి। మానితనిర్జర చంద్ర॥ మాని॥

అ॥ మాననీయ నామదినొక షం। శయము బాధగొల్పుచుండె ॥ మా॥

చ॥ దేనికైన మాతమ్ములలో। గానికలహ ముదయింపను యీా

మానిని ద్రౌపదికతమ్మను। మానంబై నన్ను నేచు ॥ మాని॥

2 తరుణినొకతె నేవురుదగ। వరియించిరిగాన యెప్పు

డరమరిక కలుఁగునోయని। నిరతము క్షోభించుచుందు

చ॥ వెరవూహింపుడుదీనికి। సురముని వాగమవినుడవు

నిరసింపగలేము జనని। యెరిగించెను యేవురకని॥ మాని॥

సీ॥ అనిన నాతడిట్లు లనియె నొక్కయుపాయ మెరిగింతు మీారలేవురు

వినుడు। యొకొక్కరీతిసనొక్కొక్క వత్సరంబేలుమ తగవురాదించు కేని

యింకొందురొక్కడు యీాసతినేలుచునుండ పైవారలీయుగ్మలిగృహ

సీమకేతేరగా చెల్లదట్లైన పండ్రెండు మాసంబులు నిండుభక్తి

గీ॥ తీర్థయాత్రాభి గమనంబు దేవపూజ। సల్పగావలె నీరీతి సమయ

మూాను దనగ నెల్లరు వట్లొప్పిరంత కొంత। కాలమరిగెను యొకనాడు

శౌరవేశ॥

వచ॥ విప్రసంరక్షణార్థ మప్పురుంబు ధర్మజువాలి వత్సరంబున ఆయుధ స్వీకారమాచరించి పాంచాలినిలయ ప్రాంగణంబున జనుటతటస్థించె.

కం॥ సమయంబు దెరలు పార్థుడు । యమనందనునాజ్ఞ నొక్క హాయన మును యా । త్రామతిజనె నవులంటి మ । హామతులకు నొరులు నెపకాలపు నోకో॥

వచ॥ యిట్లుచని గంగానదిని మున్గుచుండ నులూపియను నాగాంగన వరి యించిన నద్దానిం బెండ్లాడి కొంతకాలమునడి వెడలి చందనావతీ పురంబుజాసి పూనవంబుంజేర.

ఉ॥ అంగజశాతమార్గణము నాబడు సుందరదేహవల్లి దూ
లంగ సఖీజనంబులతొ ప్రాన్తమనోహర గీతిబాడ స
ర్వాంగదుపూజకై కుసుమ రాజిగ్రహించుచు రాజకన్య చి
త్రాంగదగాంచె నిద్దిల మదారిపరాక్రము శక్రినందనుఁ॥

మంజ—కనిమోహాంబెదనాటిన తండ్రికి । వినిపించెనంత నతఁడు
జనిపార్థునిగొనివచ్చి కూతునిడి । సల్పెపెండ్లి నతివేడ్కఁ॥

వచ॥ ఆతరి నచ్చిత్రాంగదకు జనించిన పుత్రుండు బభ్రువాహనుండన బరగి మాతామహ కులోద్ధారకుండయ్యె నంత ఫల్గునుండు రైవత కాద్రిచేరినట్లు నరకమారకుం డెరిగి వానిందరిసి యిట్లనియె-

సురట—చతురశ్రగతి,

ప॥ ధర్మరతా కుంతిసుతా । ద్వారకలో కథవింటివె॥ ధర్మ॥
అ॥ నిర్మలహృది మాచెల్లెలు । నిన్నువలచె నెఱుగుదుగద॥ ధర్మ॥
2 అగ్రజుడగు సీరపాణి । యంపుల కొడబడకయె మీ
యగ్రజనకు తనయునకిడ । నాలోచన సల్పుచుండె ॥ ధర్మ॥

కం॥ కావున నీవిటనొకయతి । గావేషము వేశియుండగావలె రాముం డేవేళ యతులనమ్ముచు । సేవించును దానవిన్ను జేర్చునింటికిఁ॥

వచ॥ ఆవల సమయంబుచూచి సుభద్రం గొనిచనుమని రహస్యంబుగా నెరిగించి చనిన—

సీ॥ కస్తూరికా తిలకంబుగల్గు మోమందున నూర్ధ్వపుండ్రంబు దీర్చి
తపసియుచేల బంధనకౌపీనకటియందు నరవికాషాయవస్త్రంబు దాల్చి
శరణాగతాభయాభరణ యుక్తంబైన దక్షిణకరమున దండము పూని
నిత్యనిర్మలసుధాస్వాద గ్రాంశివము దాల్చి వామకేలనొక కమండులువు దాల్చి

గీ॥ విలసె సంయమియన భూమి నేతమూర । అంగనల పొందు రోసిన సన్యాసి
యగుట । భావ్యమెటులైన నిష్ఠచే పాల్పడిచట । అంగనామణి గోరి
సన్యాసియయ్యె॥

వచ॥ శ్రీకృష్ణు మాయావచనంబుల బలరామాదులు రైవతకాద్రి
కరుదెంచి అందముగల చిత్రంబుల కన్నులపండువు గావించుకొని
నిర్గమించెడుతరి నమ్మాయాయోగింగాంచి—

మంజ॥ శ్రీకృష్ణుండామాయ యోగికడ । జేరి యంజలి ఘటించి
ప్రాకృత కర్మంబులు సర్వంబును । బాసెననుచు పూజించి॥

గీ॥ వందనంబిడ నాతని వనితలెల్ల । రటులగావించి రతడు శర్వార్పణంబ
టంచు బలుకుచుకొని యొండెనదుకన్ను । లెత్తిచూడడు వారల
నించుకేని॥

వచ॥ బలరాముండా యోగిని సమీపించి పూజా నమస్కారంబు
లొనరించి—

కైవి—త్రిశ్రగతి.

ప॥ మనవివినుము వో । మునినాథా నా । మనవి॥

అ॥ గనుము మమ్ము మీ । కరుణ తోడుతను ।మన॥

2 చాతుర్మాస్యలు । జల్పుదు మాయింట
సేతుము మీపూజ । సేవలు భక్తితో ।మన॥

మ॥ అనినం గృష్ణుడు వల్కునగ్రజ యితండాలోచనం జేయ నా
మనమేమో మృషయోగిగా దెలుపు నేమానోపయి న్నింటిలో
వనజిల్పొందగవన్న కేవలిభవం డర్లించ రాదంచు నా
మునిని న్వేండి సభక్తిగోరె మగి యోభూపాల లోకాతండన్॥

ఆంధ్రరాగ—ఝంపెతాళము.

ప॥ బలరామా! బలరామా!

అ॥ ఖలశాత్రవ భీ। కర సంగ్రామా ॥ బల ॥

2 ఆనందమ్మొదవెను నీమాటలు। నాలకింప నేపవిత్రమౌక
మానినిని నటుజల్పుదేని। మానిలయంబున నిల్పెద ॥బల॥

3 అవివాహితయగు సుభద్ర। యస్మానుపావనచరితను
తప్పగతి సేవింపనాకు। దాన్నిగలవె యోచింపుము ॥బల॥

గీ॥ అనిన బలరాము డార్యయోజన లవేల। కలదు సోదరి మాకు విద్య
లను వాణి। రూపమునరతి శాంతికుద్రిపనంబు। యాసుభద్రను వీ
సేవకై నిలుపుము॥

వచ॥ అని యొడంబరచిన కృష్ణుండు—

మంజ॥ అన్నా యీపవిత్రమెంతైనను మును। విన్నామే యోజింపగ
కన్నామే యిటువంటిమునిని చెలి। గావింతువె పూజింపగ॥

సీ॥ కాషాయవస్త్రముల్ గట్టిగా మొలజుట్టి శిరమున పెంజెడల్ చేర్చి
చుట్టి। రుద్రాక్షపేర్లు పేరురమున ధరియించి। మోమునిండుగ తెలి
బూదిబూశి। జపమాల కరమున చక్కగా నమరించి పాదములందు
పావాలుదొడిగి। పర్వతవనములంబడి సంచరింపుచు ముక్కుబట్టుక
లోన మూల్గుచుండి  గీ॥ మునులమనుచును కొందరు బుధుల
మంచు। గురువులమటంచు స్త్రీల నెక్కువగ దరికి। దీశి వారల
మోసంబుజేశి మాన। మును గ్రహింతురునిక్కంబు మోసగాండ్లు॥

వచ॥ యీయోగియు నట్టిదేయని నామంబునందనుమానంబు పొడము
చున్నది. ఆవల నీయిష్టంబన హలాయుధుండు—

కేదార—చతురశ్రగతి.

ప॥ చాలుచాలు పలుకకురా ॥చాలు॥

అ॥ యేలయిట్టి మాటల శం। కింపవలదురా సోదర ॥చాలు॥

2 పరమ తపోధనులౌమునిని। వరులపట్ల నిట్లగు నే
యెరుగమె పెక్కుర నీకిపు। డిటుతోచె నిదేమొ ॥ చాలు॥

3 మునులన నింకి యమడ లాకి। వరుల కందమూలంబు
లను భక్షించుచు నుందురు। యనదగదిటువంటిమాట ॥చాలు॥

వచ॥ అనిన కృష్ణుండిట్లనియె—

సీ॥ మేరకారడిలోన మెలగి చేసినతపంబునకు కౌశికుండు మునియెగాదె
వారనారీస్తన భరిత దేహుండైన ఘనరుష్యశృంగుడు మునియెగాదె
మాంధాతతనయుల గాంధర్వవిధిగూడి తనిసిన సౌభరి మునియెగాదె
శర్యాతినృపతికిజామాతయైసుకన్యనుగూడు చ్యవనుండుమునియెగాదె
మునులతపములు నిష్టలు మోహనాంగి। దరియు దనుకనె యితని
వద్దను సుభద్ర। పాదములబ్రోవు నవయువ్వనాంగి నుంప। జనదనగ
హలి వినక యమ్మునినిచూచి॥

వచ॥ దేవా దయచేయుండని సభక్తియుక్తంబుగా దోడ్కొని చని యొక
నిలయంబున న్నిల్పి సుభద్ర నతనిసేవకై నియోగించిన కొన్ని దిన
మ్ములు గడ చన-

మంజ—వలసిన యుపచారంబులొనర్చు సు। భద్రనుగని పార్థుండు
చిలుకవజీరు శరంబుల కులికియు। చేయిబట్టగానుండు॥

గీ॥ బాలయీగదవే మంచిపానకమ్ము। తెమ్ముతరుణాంగి మేలుఫలమ్ము
లిపుడు। వలయుచూపించు మల్లె మొగ్గలుయటంచు। చతురవచ
నంబులన్నది వతడుదెల్ప॥

మంజ—ఒక్కదినంబు సుభద్రపార్థునకు। నోగిరంబు నమరించీ
మ్రొక్కియిట్టులనె మునివరకోరగ। బుద్ధిగలిగె నాలించీ
2 మంచియుత్తరం బిందుతప్పెన। మన్నింపుండనగా
నంచయాన సంశయ మదేలతగు। నభిలాషనుయడుగంగా॥

వచ॥ అనిన సుభద్రయిట్లనియె-

సీ॥ విరాటుగనలోని దేశంబు లేరుచూచి। యుందురైనను నడిగెద యో
గివర్య। యింద్రప్రస్థపురంబు మీరెన్నడైన। గంటిరా పాండవుల
నందు గాంచినారా॥

కం॥ వారందరు నొకచోను। న్యారా పిరాగ్రిగబ్బ సరునెరుగుదురా
 పేరెనె యాత్రికిడక సం। పూరితి గావించియుల్లు మునికులవర్యా॥

వచ॥ మాయాయోగి యిట్లనియె—

అఠాణ—రూపకం

ప॥ అతివావిను జెప్పెద నీ। వడిగిన ప్రశ్నకు నుత్తర ॥మతి॥

అ॥ సతతము నేనింద్రప్ర। స్థ పురంబుననె యుందు ॥సతి॥

చ॥ అతిబాహుశాలి కిరీటి। కమిత హితుడ నేనతడు
 యతడే నేనుగ వర్తిలు। గతి మెల్ల రెరింగినదియే ॥సతి॥

2 యిరువుర్రమును యాత్రి। వరత దిరుగుచుంటి మెట
 కరుదెంచితి గోకర్ణము। నందునుండి పాండవులం

చ॥ దరునీకు చుట్టలెగద వారం। దరిలోన పార్థునడిగెదు
 తరుణీ నీమది నాతడు। దగిలెనేమొ వచియింపుము ॥యతి॥

ఉ॥ దాపగనేల నీవయి నతండనురక్తుడునాట కోమలీ
 తాపసి వేసమూని నిరతంబు త్వదీయ సపర్యలంది నీ
 చూపుల పల్కులన్మదిని। జొక్కుచు నియ్యెడనుండెకిరీడి సం
 తాపము బాపి కౌగిట సతంబతిప్రేమ వసింపజేయవే॥

వచ॥ అని చిరునవ్వునవ్వి యోగివేషంబుజ్జగించిన సుభద్రసిగ్గిలి బిరబిర
 పరవంబోవ నర్జునుండడ్డగిన నాపెయిట్లనియె—

మంజ॥ పెద్దలుగల్గిరి వారలగోరిన। బావా సమ్మోదమొందీ
 ముద్దుగ పెండిలి గావింతురు యిటు। మూర్ఖత యేలను జూడీ ॥

గీ॥ అనిన పార్థుండు బెల నీ జననిజనకు। లన్నలును వారిభార్యలు వంద
 రెరిగి। యోయిటులు యిష్టపడిరి నీకేమిభయము! రమ్మురమ్మని
 యామెకరమ్మొబట్టి॥

వచ॥ యిట్లు కౌగిటందార్చి ముద్దాడి శ్రీకృష్ణునిపంపున వాకిటనిలచిన
 యరదంబుపై నర్జునుండు సుభద్రనునిల్పికొని యింద్రప్రస్థపురంబు
 తెరవుబట్టిన యవ్వార్త నెరింగి బలరాముండు సేనలం గూర్చుకొని
 కవిసిన—

మంజ॥ కవ్వడి భీకరసంగ్రామంబున। గడగి యమబలంబుల్

పక్ష్వలబుద్ధిన హలాంకుశాహవ। దర్పమ్మున వైరాగక॥

సీ। కోవిదనారాచముల హాలింబాకకేసి; పార్థుశరదంబు నిలుపక పరపి యుండ్రి ప్రస్త పురముచు చేరె ద్వారకను రాము। కడకుకృష్ణుండు నల్లన నడచి యనియె

వచ। అన్నా! విశాఖేమేల. మేనత్తకుమారుండగుట స్వతంత్రించి గొని పోయెనని యూరడించి—

గీ॥ తల్లిదండ్రులనెల్ల బాంధవజనముల తోడగొంపోయి ధర్మజుతోడ కుంతి। తోడ సూచించి యచట పార్థునకు సుగుణ। సల్పిరతి వైభవంబున సంతసమున।

వచ॥ ఆవల శ్రీకృష్ణపరమాత్మ భార్యలందరు సంతానంబుగల్గి వంశాభివృద్ధిని గావించిరి. వారిలో ప్రద్యుమ్న, అనిరుద్ధ, దీప్తిమంత, సాంబ, మిత్ర, బృహద్భాను, మిత్రవింద, వృక, అరుణ, పుష్కర, దేవబాహు, శ్రుతదేవ, సునంద, చిత్రభాను, వరూధక, కవి, అగ్రోధ, అను పదునెనమండ్రు ప్రముఖులు. బలపరాక్రమ శేముషీధురంధరులు. కృష్ణునకు కుబ్జయందు, యశోకుడనువాడు జనించి నారద శిష్యుండై విష్ణుభక్తి నవలంబించె—

మంజ॥ విను శ్రీకృష్ణుని వంశంబును నే। వినుపించెద భూపాలా
వినదగు జన్మము పావనమై తగు। వేదనుతంబది చాలా

2. పట్టమహిషియగు రుక్మిణిగర్భము। ప్రద్యుమ్నుడు గలిగెన్
దిట్టయాతనికి యనిరుద్ధుండను। దేవనుతుండొగి గలిగెన్॥

గీ॥ అతనికుదయించె వజ్రుండు నతనికి ప్రతి। బాహుడు జనించె నరయ సుబాహుడతని। కుద్భవంబయ్యె వానికి నుగ్రసేను। డతనికతిబాహు బలుడు జన్మంబునందె॥

కం॥ వానికి శతసేనుండను। ధీనిధిజనియించె నిట్లు ధీవర శ్రీకృష్ణుని వంశవృద్ధి నందెను। భువనావన పార్థపౌత్ర పుణ్యచరిత్రా॥

వచ॥ ఇది శ్రీమద్భాగవతంబను మహాపురాణంబునందు దశమస్కంధంబని శుకమహర్షి పరీక్షిన్నరేంద్రున కెరిగించె నావల—

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ



శ్రీరస్తు—అవిఘ్నమస్తు.

శ్రీగురుపరబ్రహ్మణేనమః.

# శ్రీ కృష్ణ భాగవతము.

(హరికథ)

## ఏకాదశస్కంధము

—:o.—

### 20 జనమేజయ రాజ్యప్రాప్తి.

వచ॥ ఇట్లు సుఖంబులందేలు శ్రీకృష్ణపరమాత్మునికడకు వాణీపురందరాది
బృందారకు లరుదెంచి నమస్కరించి—

కళ్యాణి—రూపకం.

ప॥ అఖిల లోకేశ కృష్ణ। అఘవినాశ సర్వేశ ॥అఖి॥

అ॥ సుఖము లందె లోకమ్ములు। చూడ దుష్టహతమయ్యెను ॥అఖి॥

చ॥ ఇక వైకుంఠము జేరగ। నిదే యదను సమకూరెను
సకలముడిగె భూభారము। శరణుభక్త మందారమ ॥అఖి॥

2 భూలోకంబున నీవు। బుట్టి నూటయిరువదైదు
శ్రీలలనాధీశయేండ్లు। జెల్లె కలియుగంబుడాసె

చ॥ నేలయందుంట నీకోహరి। చాలుదుష్టదమనమయ్యె
బాళిదేవతలు మొక్కుచు। బల్కుమనిరి యిటు శ్రీకృష్ణ ॥అఖి॥

వ॥ అని యొరిగించి యాజ్ఞగొని యందరుచన్న ముకుందు డాసుహృ
జ్జనములజేరి యేడుదివసంబులకు న్గలివచ్చు ద్వారకా
జనపద మబ్ధిలో గలయు సత్వరమంత ప్రభాసతీర్థమం
దునవసియింప బొండనుచు తొందరబుచ్చిన యుద్ధవుండనున్॥

మం॥ దేవానివాదంబుల నెన్నిరి ఁ జేసినవక పూజింతుఁగా
భావంబున శంకాతంకంబులు। పరిమార్చినె భావింతుఁగా॥

వ॥ అనిన శ్రీకృష్ణుండు యుద్ధవుని దరిఁజేర్చుకొని ద్వారక నిశ్శేషంబు గావించి యుద్ధవా! యింద్రియసౌఖ్యంబుల గోరక మానస వాగక్షి శ్రోత్ర ఘ్రాణేంద్రియ గ్రాహ్యమానంబగు వస్తుజాతంబులెల్ల నశ్వరంబని నమ్మి దారేషణ, పుత్రేషణ, ధనేషణంబుల వర్జించి మోద ఖేదంబు లసముండవైవర్తింపుము. దారుమధ్యభాగంబున వనలుండు సూక్ష్మరూపున వర్తించునట్లు శరీరంబున జీవుండు వసియించినటించు గావున పంచేంద్రియంబులకు దృష్టంబగు పదార్థంబనిత్యంబు. నిత్య దృష్టి గ్రాహ్యంబని తెలియుము. దేహి కర్మలబ్ధ దేహుండై యుండియు సంసారమమతలు విడచి నిశ్చయజ్ఞానయుతుండై స్వప్నలబ్ధ పదార్థము నిజము. గాని క్రియ మాయాకల్పిత ప్రపంచము. అని త్యమేయని నిశ్చయించుకొని యమని యమయాసన ప్రాణాయామ ప్రత్యాహార, ధ్యాన, ధారణసమాధియను నష్టాంగ యోగమ్ముల లభించు అణిమాద్యష్ట సిద్ధులు యీమాయలోని వేసనిసద్గురు చర ణార విందంబుల దరిజేరి చతుర్విధ శుశ్రూషల నాచరించి జీవబ్ర హ్మైక్య సంధానంబెరింగి తత్వమసీతి వాక్యార్థ లక్ష్యార్థంబులందెలశి అదియు ననిత్యంబేనని యావల నిర్వికార పరిపూర్ణంబు నెరింగియొరు కను విసర్జించిననరుండే జన్మరాహిత్యపదవి గాంచునని యెరిగించిన యుద్ధవుం డిట్లనియె.

మం॥—దేవా నీరూపంబే యేయెడ। దివ్యరునద్దాని దెలియఁగా
నావీనుల పర్వంబుగ దెల్పుము। నావినుమని హరియనియెఁగా॥

వ॥ కురుక్షేత్రంబున జరిగిన కురుపాండవ రణమధ్యంబున పార్థునకు నాయొరింగించిన గీతలలో దశమాధ్యాయంబు నంగల యద్దానిని వినుము. భూతంబులం దాధార భూతంబునేను. సూక్ష్మంబులజీవుం డను. దేవతలయందు పద్మగర్భుడను. వసువుల హవ్యవాహను

హోమాను రక్తులై వర్తింతు రంత మేఘంబులు జలహీనంబులు నాగావళులల్పఫలదంబులు. సస్యంబులు నిస్సారంబులు నగునట్టితరి దేవదేవుండగు నారాయణుండు ప్రజాపాలన దీక్షాదక్షుండై శంభలగ్రామం బున విష్ణుయశుండను విప్రునకు కల్క్యవతారుండై జనించి కలిప్ర ఖండనం బాచరించు నత్తరి శంతనుని అగ్రజుండగు దేవాపియు ఇక్ష్వాకువంశజుండగు మరుత్తును ప్రభువులై ధరాపాలనంబు గావింతురు. కృతయుగ ధర్మంబు నడుచును—

మంజ॥ నేను మృతుడననుచు మదిలో । నేల నేను చింతిలకు
మాసిత భాగవతం బాలించితి । మదలరావు యీయయిలకు
2 పదునెన్మిది పురాణముల లోపల. చిలుకమౌనిముఖ్యంబు
సదమల మోక్షంబొసంగు కలిపిన జాలినవారికి నిక్కంబు।

వచ॥ తక్కపురాణంబుల వివరం బాలింపుము. నాజనకుండగు వ్యాసుండు బ్రహ్మపురాణంబు పదివేలును (10000) పద్మం బేబదియైదు వేలు (55000) విష్ణుపురాణ మిరువదిమూడు వేలును. (23000) శైవం బిరువదినాల్గువేలు (24000) భాగవతము పదునెనిమిదివేలు (18000) నారదం బిరువదియైదు వేలు (25000) మార్కండేయంబు తొమ్మిదివేలు(9000) ఆగ్నేయంబు పదునైదువేలనన్నూరు(15400) భవిష్యోత్తరంబు పదునాల్గువేల యైదువందలు (14500) బ్రహ్మకైవర్తంబు పదునెనిమిదివేలు (18000) లైంగంబు పదకొండువేలు (11000) వరాహంబు యిరువదినాల్గు వేలు (24000) స్కాందం బెనుబదియొక్కవేల నూరు (81100) వామనంబు పదివేలు (10000) కూర్మంబు పదునేడువేలు (17000) మాత్స్యంబు పదునాల్గువేలు (14000) గారుడంబు పందొమ్మిదివేలు (19000) బ్రహ్మాండంబు పన్నెండువేలు (12000) మొత్తము నాల్గులక్షల (400000) గ్రంథంబని యెరిగించెనని సూతుండు శౌనకాదుల కిట్లనియె.

మ॥ — తక్షకుండు కోలాహలమాంత్రికు ! దాడిచే నగవిషంబులన్
లక్షలకొలది విప్రుండై వెను రాపించక నృపుకడకున్॥
సీ॥ పరీక్షిన్నరేంద్రుడు ధాత్రీవిభుండగు కాంక్షవంతుడు దా
శరమునను నది నేలలు తేలంగని తక్షకుడంకురొచ్చె భూ
పుడును నృపాలుకిచ్చుట విషారకమంటిన తోన శ్రీహరి
సరణి పూజకీర్తితుడు చయ్యగనేగె విరుకమంతటన్॥

వ॥ నృపాలుమరణంబున కందుకు విచారించి రతపికుమారుండగు జనమే
జయుం డొక్కింత విచారించి కృత్యంబులందీర్చి సర్పయాగం బాచ
రించుము శ్రీవిష్ణువుచే వారింపబడిన వెనుక మునులు రాజులు జనమే
జయునకు —

కేదారగౌళ — చతురశ్రగతి.

ప॥ పట్టాభిషేకముగా। వించిరి జనమేజయునకు। పట్టా।
అ॥ దిట్టప్రజాపాలనమున। నీవుసు రణకోవిదుడని। పట్టా॥
2 మంగళతూర్యములు మ్రోయ। అంగనలు సేసలిడ వా
రాంగన నృత్యములు సెలగ। సకలమునులు దీవింపగ ॥పట్టా॥
3 గోపాలకృష్ణకవి। కోరిక కావ్యములు వ్రాయ
భూపాలురెల్లమెచ్చి। పొగడకనుల పండువుగ॥ పట్టా॥

ఇది శ్రీమహాభాగవత పురాణంబునం ద్వాదశస్కంధము.

— గద్య. —

ఇది శ్రీమద్బాలా త్రిపురసుందరీ వరప్రసాద లబ్ధ కవితా లంకార
శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్ర కొప్పరపువంశ పయఃపారా
వార తారాజార అప్పయామాత్య పౌత్రి గుర్వయ
మంత్రిపుత్ర రాజ్యలక్ష్మాంబా గర్భ శుక్తిముక్తా
ఫలాయమాన గోపాల కృష్ణమూర్తి
విరచిత
శ్రీకృష్ణభాగవతము సర్వము
సంపూర్ణం.

